# ఎల్లప్పుడూ ఆంప్రోనే!

పిల్లలకు
ఆంప్రో అంటే ప్రాణం...
అందుకే ఎప్పుడూ
తయారుగా ఉంచుతాను!
అందులో ఎంతో రుచి,
బలమూకల బిస్కట్లు!

కాస్త ఆగండి...
ఒక్క బిస్కట్టును తినండి.




## ఆంప్రో గ్లూకోజ్ బిస్కట్లు
## ఆంప్రో తో మీకు నాణ్యత ఖాయం.

Sista s/A.L./232/85 Tel a

## సంక్రాంతి సంచిక

ఆంధ్రసచిత్ర వారపత్రికపై శ్రీదేవి ముఖచిత్రం సంక్రాంతి కానుక చాలా బాగుంది విక్రమ్ బొమ్మల కథ చాలా బాగుంది వారం వారం సీరియల్స్ మమ్మల్ని ఎంతో ఆనందపరుచుచున్నవి ఇటువంటి చక్కని సీరియల్స్ అందిస్తున్న ఎడిటర్ గార్కి నా ప్రత్యేక అబినందనలు

—యరబోలు చిట్టిబాబు ఆకివీడు

* * *

ఆంధ్రసచిత్ర వారపత్రిక సంక్రాంతి సంచిక నటి శ్రీదేవి ముఖచిత్రంతో వెలువడి కొత్త అందాలను సంతరించుకున్నది ఈ సంచికలో ప్రచురించిన సంక్రాంతి సౌందర్యం మా పల్లెలో సంక్రాంతి వ్యాసాలు ప్రత్యేక ఆకర్షణగా నున్నవి 3డి సీరియల్ రచయిత పేరును కనుగొన్న పాఠకుల అబిప్రాయాలు (రచయిత గురించి) సహేతుకంగా ఉండి తృప్తిని కలిగించినవి సీరియల్ రచయిత ఇచ్ఛాపురపు రామచంద్రం గారికి మా హృదయపూర్వక ధన్యవాదాలు

ఇక సంక్రాంతి ప్రత్యేక సంచికకే ప్రత్యేక ఆకర్షణగా ప్రచురింపబడిన పులికంటి కృష్ణారెడ్డి గారి వ్యాసం అన్నమయ్య పదాలకు నృత్యాబిషేకం నకు సంబంధించిన ఫోటోలు చూడ ముచ్చటగా నుండి కన్నుల పండుగ గావించినవి

—స్వరాజ్యలక్ష్మి ఆనంద గజపతిరావు తెట్టంగి

* * *

మీరు అన్నప్రకారం సంక్రాంతి కథల పోటీలో బహుమతు లందుకున్న రచయితల ఫోటోలతో బాటు వారి జీవిత విశేషాల్ని అట్లాగే ఆ కథలపై వ్యాసరచన పోటీలో పాల్గొన్న పారితోషి కార్హులైన రచయితల రచనల్ని ఇంకా సినిమా బాలట్ వివరాల్ని ప్రచురించి పాఠకులకు సంక్రాంతి

# ఉత్తరాలు

సంతోషాన్ని నింపినందులకు నా దన్యవాదాలు సంక్రాంతి సంచికలోని కవితలు కార్టూనులు కథలు మనోరంజకంగా ఉన్నాయి

— ఆకెళ్ళ సుబ్బారావు కందికుప్ప

### కథలు

17–23 జనవరి సంచికలో కర్మసన్యాస యోగం కథ బాగుంది జీవితంలో ఒక్కో సంఘటన ఎలాంటి పరివర్తన తెస్తుందో రచయిత్రి చక్కగా చెప్పారు

— కె రామారావ్ హైదరాబాద్

### వ్యాసాలు

అందాల తార శ్రీదేవి ముఖచిత్రంతో వెలువడిన సంక్రాంతి సంచిక అత్యంత ఆకర్షణీయంగా వుంది పులికంటి కృష్ణారెడ్డి గారి వ్యాసం అన్నమయ్య పదాలకు నృత్యాబిషేకం చక్కగా వుంది అన్నమయ్య పదాలకు నృత్య రూపాన్నిద్దామన్న మాష్టర్ రమణ గారి సంకల్పం చాలా గొప్పది

—మోదేకుర్తి సత్యనారాయణ అన్నవరం

### బొమ్మల సీరియల్

17–23 సంక్రాంతి సంచిక నటి శ్రీదేవి ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్రసచిత్ర వారపత్రిక మా హృదయాలను రంజింప చేసింది

సీక్రెట్ ఏజెంట్ విక్రమ్ బొమ్మల సీరియల్ చూస్తుంటే సిన్మా చూసినట్టుగా అనుభూతి కల్గుతుంది

— జిట్టా రమణిమోహన్ కడప

(6వ పేజీ చూడండి)


# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు (1938-1972)

28 ఫిబ్రవరి-6 మార్చి 86
శ్రీ క్రోధన నామ సం మాఘ బ చవితి
సంపుటము 78 . సంచిక 25

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

| | | |
|---|---|---|
| విడి ప్రతి వెల | రు | 2-50 |
| పోస్టులో 6 నెలల చందా | రు | 71-50 |
| పోస్టులో 12 నెలల చందా | రు | 143-00 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

మురళీమోహన్
సమర్పించు
జయభేరి ఆర్ట్ ప్రొడక్షన్స్

# ఇదే నా సమాధానం

రాజాచంద్ర · మాగంటి వెంకటేశ్వరరావు · కిషోర్

# అందిన అదృష్టాన్ని నిలబెట్టుకోలేని అధికార పక్షం!

ఎవరైనా కొందరిని కొన్నిసార్లు మోసం చెయ్యగలరేమో కానీ అందరినీ అన్నిసార్లూ మోసం చెయ్యటం అన్నది అసాధ్యం గత ఏడాదిగా మన ఏలినవారు చేస్తున్నది అదే కానీ అందుకు పలితం కనిపించటం ప్రారంభం అయింది పలు విధాలుగా ప్రశ్నిస్తున్న ప్రజలని తప్పుపట్టి ప్రయోజనంలేదు అసలు వాళ్ళు ఆ ప్రశ్నలన్నిటినీ సంవత్సరం కిందటే అడిగి ఉండవలసింది అయినా వాళ్ళు అడగలేదు అదికారంలో ఉన్నవారి దగ్గర కూడా బహుశ వాటికి సమాధానాలు లేనట్లే కనిపిస్తున్నది

ఒక విషయాన్ని మనం గమనించాలి పంజాబ్ హర్యానాలలో రాజీవ్ ప్రభుత్వానికి ఎదురవుతున్న సమస్యలు వాళ్ళు సృష్టించినవి కావు అవి శ్రీమతి గాంది నించి వారసత్వంగా వారికి సంక్రమించినటువంటివి అయితే పంజాబ్ సమస్య శ్రీమతి గాంది దారుణ హత్య అన్నవి లేకపోతే ఇప్పుడు రాజీవ్ ఆయన ఉన్న చోట ఉండేవారే కాదు అలాగే సంజయ్‌గాంది ప్రమాదవశాత్తు మరణించి ఉండకపోతే అసలు ఆయన రాజకీయాలలో నే ఉండేవారు కాదు డిల్లీ సింహాసనంతో పాటు ఆయనకి పంజాబ్ సమస్య కూడా వారసత్వంగా సంక్రమించింది పంజాబ్ పరిస్థితికి రాజీవ్ కారకులు కారని తమ తల్లి చేసిన తప్పులలో ఆయన తల దూర్చటం మానాలని కొంతమంది ఇచ్చకాలు పలికేవారు అంటున్నా అది సరికాదు పంజాబ్ సమస్య ఆయన తల్లి హత్య లేకపోతే అసలు రాజీవ్‌గాంది రంగంలో నే ఉండేవారు కాదు ఆయన తమ పదవికి తగని పక్షంలో అలాంటి సూచనలే కనిపిస్తున్నాయి ఆయన చేయవలసినదల్లా నేరుగా రాష్ట్రపతి బవనానికి వెళ్ళి తమ రాజీనామా లేఖని అందజేయటమే

ఇప్పుడు శ్రీమతి గాంది మన మధ్యనే ఉన్నారని కొంత సేపు అనుకుందాము అప్పుడు పరిస్థితి ఏ విదంగా ఉండి ఉంటుందో చూద్దాము మొట్ట మొదటిది ఆమె ఇంకా ప్రధాని పదవిలో ఉండేవారా అన్నది అనుమానమే ఎందుకంటే పరిస్థితులు అప్పుడే అందుకు అనుకూలంగా లేవు అవి తర్వాతే జరిగాయని అనుకున్నా ఎన్నికలలో పంజాబ్ హర్యానాలతో సహా ఎన్నో రాష్ట్రాలలో ఆమె పార్టీ వోడిపోయి ఉండేది అస్సామ్‌లో కూడా పరాజయం పొంది ఉండేవారు కర్ణాటకతో సహా చాలా రాష్ట్రాలలో వోటమి చవిచూసేవారు నిస్సందేహంగా మహారాష్ట్ర గుజరాత్‌లలో వోడిపోయి ఉండేవారు ఆమెకి ఉత్తరప్రదేశ్ బీహార్‌లు తప్ప మరేమి మిగిలి ఉండేవి కావు, అయితే అది కూడా అనుమానాస్పదమే

అందువల్లే ఇటీవల ఈ రాష్ట్రాలలో జరిగిన ఉప ఎన్నికలలో కలిగిన నష్టం ఆశ్చర్యకరమేమి కాదు అసలు జరిగింది ఏమిటంటే తాము చేసిన పొరపాటుని గ్రహించడానికి ప్రజలకి దాదాపు సంవత్సరం పట్టింది అందుకే ఆ రాష్ట్రాలలో ని అదికార పార్టీ అబ్యర్ధులని గద్దె దించారు ఈ పని వారు సంవత్సరం కిందటే చెయ్యవలసింది కానీ కొన్ని పరిస్థితులు వారిని అలా చెయ్యనివ్వలేదు రాజీవ్ తమ తల్లికి సహజమైన వారసుడు కారు అప్పటి పరిస్థితులలో కూడా ఆయన వారసత్వానికి తగిన పరిస్థితులు లేవు ఆయన అదృష్టవంతుడు కాబట్టి ఇప్పుడు ఆయన ఉన్న స్థానంలో ఉన్నారు కేవలం అదృష్టం మీదే ఆదారపడి రాజకీయాలని ఎవరూ నడపలేరు ముఖ్యంగా పరిస్థితులు అనుకూలంగా లేనప్పుడు అసలే కుదరదు దానికి తోడు అదృష్టం కూడా ఇప్పుడు రాజీవ్‌కి వ్యతిరేకంగానే ఉన్నది

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

రాజీవ్ బృందం దాదాపు ప్రతి సమస్యని తప్పుగానే అర్ధం చేసుకోవటం జరిగింది వాళ్ళకి సమస్య అయినా అర్ధం కాకపోయి ఉండాలి లేదా దాని పరిష్కారం తెలియక పోయి ఉండాలి ఎందుకంటే ఆయన చుట్టూ ఉన్నవారంతా పరిణతి చెందని వ్యక్తులు ముఖ్యంగా వాళ్లందరూ మానేజర్లు ప్రతి సమస్యకీ తప్పకుండా ఒక పరిష్కారం అనేది ఉంటుందనీ ఎటువంటి క్లిష్ట పరిస్థితినైనా ఎదుర్కోగలమనీ వాళ్ల నమ్మకం అందువల్ల వారి దృక్పదం కంపెనీ మానేజర్ల రీతిలో నే ఉంటుంది కారణం ఏమిటంటే వాళ్లంతా తమ జీవితంలో బూట్ పాలిష్ లేదా డిస్టెంపర్ అమ్మటం మినహా చేసిందేమి లేదు కాబట్టి బారతదేశం అంటే బూట్ పాలిష్ డిస్టెంపర్‌లు కాదు ఏవో కొన్ని వొప్పందాలపై దూరదర్శన్ కెమేరాల ముందు సంతకాలు చేసినంత మాత్రం చేత దేశంలో ని సమస్యలని పరిష్కరించలేరు ఈ బూట్ పాలిష్ మాఫియాకి మరో లక్షణం కూడా ఉన్నది వారికి నాటకీయతపై మక్కువ ఎక్కువ సమస్యని కాక దాని పరిష్కారాన్ని మాత్రమే వాళ్ళు నాటకీయం చేస్తారు అలా చేయటంవల్ల వారు దానిని పరిష్కరించగల మనుకుంటున్నట్లుగా ఉంటుంది

పంజాబ్ వొప్పందం వారిని ఎంతో దూరం తీసుకు వెళ్లలేదని బడికి వెళ్లే ఏ పిల్లవాడైనా వాళ్లకి చెప్పగలిగేవాడు అసలు ప్రాథమికమైన సమస్య చండీగర్ నదిజలాల పంపిణీ హిందీ మాట్లాడే ప్రాంతాలు కాదు పంజాబ్‌లో ని సంక్షోబానికి వీటికి ఉన్న సంబందం చాలా స్వల్పం దేశంలో ని ముస్లిమ్‌ల స్థానానికి జిన్నాతో వచ్చిన సమస్యకి ఎంత సంబంధం ఉందో ఇది కూడా అంతే అకాలీలు ఎన్నికలలో నెగ్గి ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసారన్నది నిజమే కావచ్చు కానీ అసలైన అధికారం వారి చేతులలో లేదు విబజనకి ముందు పంజాబ్‌లో



ఫిరోజ్ ఖాన్‌నూన్ బృందానికి అసలైన అధికారం ఎలా లేదో ఇది కూడా అంతే చివరికి నూన్‌లంతా చరిత్రలో తెరమరుగుకి వెళ్ళిపోయారు ఎందువల్లనంటే వాళ్ళని మరింత పెద్ద శక్తులు కబళించివేసాయి పంజాబ్‌లోని ఇప్పటి అకాలీలు కూడా నూన్‌ల వంటి వాళ్ళేననీ వారికి పట్టిన గతే వీళ్ళకి కూడా పడుతుందనీ నేననుకుంటున్నాను

ఆ రకమైన శక్తులే నేడు విజృంభిస్తున్నాయి ఢిల్లీలోని సౌత్ బ్లాక్‌నించి తమ కార్యకలాపాలని నిర్వహించే ఈ బూట్ పాలిష్ బృందాన్ని ఆ శక్తులు చీల్చి చెండాడుతాయి ఈ బృందానికి భారతదేశం అంటే ఏమిటో తెలియదు డూన్ స్కూలు వారికి మంచి ఉచ్చారణని నేర్పవచ్చు కార్పొరేట్ ప్రపంచంలోని బూట్ పాలిష్ రంగంలో ఉద్యోగాలని సంపాదించి పెట్టవచ్చు కానీ వాళ్ళు మీలాగా నాలాగా భారతీయులు కారు కాబట్టి ఈ దేశాన్ని వారు అర్థం చేసుకోలేరు వాళ్ళకి పారిస్ వాషింగ్టన్‌లలోనే స్వదేశంలో ఉన్నట్లు ఉంటుంది భారతీయులమని చెప్పుకోడానికి వారు సిగ్గుపడతారు వాళ్ళు భారతదేశాన్ని భారతీయులకి కాకుండా పాశ్చాత్య దేశాలకి అమ్మడానికి ప్రయత్నిస్తున్నారు రూపాయిలకన్నా డాలర్లే వాళ్ళకి ముఖ్యం కిర్లోస్కర్‌తో కన్నా రాక్‌ఫెల్లర్‌తోనే వారు వ్యవహారాలు నడుపుతారు రాక్‌ఫెల్లర్ బహుళజాతి సంస్థలకి ప్రాతినిధ్యం వహించే మరి కొందరి ఇష్టాలు తెలుసుకోడానికి రాజీవ్‌గాంధీ ఒక ఉదయం అంతా వారితో గడిపారు ఇటీవలే వాళ్ళు తమ డాలర్ల పెళ పెళలతో ఆయనన్ని కలుసుకున్నారు గత ఏడాదిగా ఎప్పుడైనా రాజీవ్‌గానీ ఆయన బూట్ పాలిష్ బృందంగానీ కిర్లోస్కర్‌తో కనీసం ఒక గంట అయినా గడిపి ఉంటారని నేననుకోను నిజానికి వాల్‌స్ట్రీట్ కోటీశ్వరుల కన్నా కిర్లోస్కర్ ఈ దేశానికి ఎంతో మేలు చేసారు అయినప్పటికీ రాజీవ్ ఆయన బృందం భారతీయులైన మన పారిశ్రామిక వేత్తలని కించపరచటానికి అక్రమంగా తమ అధికారాన్ని వాడుకుంటున్నారు బొంబాయి వి జె టి ఐ కళాశాలలో డ్రాఫ్ట్స్‌మన్‌గా జీవితం ప్రారంభించిన కిర్లోస్కర్ తండ్రి సతారా వెళ్ళి నాగళ్ళని తయారుచేసే ఒక సంస్థని స్థాపించారు అటువంటి వారిని వాళ్ళు హీనాతి హీనంగా చూస్తున్నారు కానీ విదేశీయులతో వ్యవహరించేటప్పుడు మాత్రం వాళ్ళు నవ్వులు చిందిస్తారు ఎందుకంటే వాళ్ళూ విదేశీయులే కాబట్టి ఈ బూట్ పాలిష్ బృందానికి భారత దేశానికి సంబంధించినది ఏదైనా కొత్తే వారికి దానిపట్ల ద్వేషం తప్ప మరొకటి లేదు అలాంటివాళ్ళు ఇప్పుడు కష్టాలలో పడ్డారంటే ప్రజలకి వాళ్ళ మీద కోపం ఉన్నదంటే అది వారి తప్పే నిజానికి వాళ్ళు అదృష్టవశాత్తు అధికారంలోకి వచ్చారు కానీ తమ ఒడిలో పడిన ఆ అదృష్టాన్ని నిలుపుకో తగిన వారమని నిరూపించుకోడానికి వాళ్ళు చేసింది చాలా తక్కువ □

సీరియల్

# చైతన్య స్వరూపం

కంచుమర్తి వెంకటేశ్వర రావు

(గత సంచిక తరువాయి)

కిరణ్ ఎమ్మెస్సీ ఫస్టియర్ అయింది

కిరణ్ ఇంకా బాగా చదవాలి

డాక్టరేట్ చెయ్యాలి

విదేశాలు వెళ్ళాలి

బాబు మీద ఎన్నో ఆశలు

కానీ అన్ని రోజులు మనవి కావని తెలియజేయడానికి కొన్ని సంఘటనలు జరుగుతుంటాయి ఆ సంఘటనలు మనసు మీద ముద్రలు వేస్తాయి

బాబు నా క్రమశిక్షణలో పెరుగుతున్నాడు

ఉజ్వల భవిష్యత్తులో దేదీప్యమానంగా వెలుగుతాడు

తన విజ్ఞానపు కాంతులు లోకానికి వెదజల్లుతాడు

నా ఆశలు ఆశయాలు అన్నీ వాడే అనుకున్నాను

అయితే నా ఆలోచనలను తలక్రిందులు చేస్తూ కిరణ్‌లో మార్పు

ఆ రోజు

నా కలలు పేకమేడలుగా కూలి పోవడానికి నాంది పలికిన రోజు నా ఆశయాలు నన్ను హేళన చేసిన రోజు నా ఆలోచనలు వమ్మయిన రోజు నేను ఊహించని రోజు నా కళ్ళే నన్ను మోసం చేసిన రోజు నా హృదయం పగలడానికి సన్నద్ధమయిన రోజు

యూనివర్సిటీ నుండి చాలా ఆలస్యంగా వచ్చాడు కిరణ్

స్కూటరును వరండాలో ఉంచి మమ్మీ అంటూ లోపలకు వచ్చిన కిరణ్ నోట్లోంచి గుప్పుమని వాసన

బాబూ అంతకంటే మరో మాట రాలేదు

సారి మమ్మీ డిగ్రీ పాసయినప్పుడు యూనివర్సిటీలో సీటు వచ్చినప్పుడు పార్టీ పార్టీ అని ఫ్రెండ్సంతా గొడవ చేసారు స్కూటరు కొన్నా పార్టీ ఇవ్వకపోతే వదిలేది లేదని పట్టు పట్టేరు నేను తాగనని ఎంత బ్రతిమాలినా వదలలేదు జస్ట్ రెండు పెగ్‌లు తీసుకున్నాను

కొయ్య బొమ్మలా అలాగే నిలబడిపోయాను

అయాం వెరి సారి మమ్మీ ఇంకెప్పుడు ఇటువంటి పనులు చెయను ఈ ఒక్కసారికి నన్ను క్షమించు అన్నాడు ప్రాధేయపడుతూ

గదిలోకి వచ్చి మంచం మీద వాలిపోయాను

కిరణ్ నా పాదాల మీద తల ఆన్చాడు

కిరణ్ కన్నీళ్ళు నా పాదాలను తడుపుతున్నాయి

మమ్మీ నువ్వింత బాధ పడతావని ఊహించలేదు మళ్ళీ ఈ పొరపాటు చేయను మాట్లాడు మమ్మీ నువ్వు మాట్లాడకపోతే ఏదోలా ఉంటుంది మమ్మీ క్షమించవా ఆకలేస్తుంది మమ్మీ లెగు మమ్మీ

మంచం మీంచి లేచి బాబు తల నిమిరాను

* * * * *

ఒక వారం రోజుల తర్వాత

సాయంత్రమయింది

రాత్రయింది

బాబు ఇంటికి రాలేదు

ఏ రాత్రయినా బాబు ఇంటికి వస్తాడు

భోజనం సయించక పాలు త్రాగి పడుకున్నాను

ఆ రోజు బాబు రాలేదు

మళ్ళీ సాయంత్రం రాత్రి

రెండు రోజులైంది

బాబు ఎక్కడకు వెళ్ళాడు?

తనతో చెప్పకుండా ఎక్కడకీ వెళ్ళని బాబు

రెండ్రోజుల నుండి ఇంటికి రావడం లేదు

నాకేదో భయం

మూడో రోజు వచ్చాడు

ఆశ్చర్యం

వంద లంఖణాలు చేసిన వాడిలా నీరసంగా ముఖమంతా పాలిపోయి ఉంది బట్టలు నలిగిపోయాయి వీడు నా బాబు కాకపోతే ఎంత బాగుణ్ణుననిపించింది కానీ నా కిరణ్ నా బాబు వీడే

కళ్ళార్పకుండా చూసాను

మమ్మీ ముగ్గరు స్నేహితులతో పిక్నిక్ వెళ్ళాను నీకు చెప్పడానికి కూడా టైం లేదు ఏమీ అనుకోవద్దు మమ్మీ

కిరణ్ గొంతులో ఏదో మార్పు

బాబూ నువ్వు మళ్ళీ తాగేవా

అదొక్కటే అడిగాను

మళ్ళీ అంటే ఎన్నిసార్లు తాగేను మమ్మీ ఎప్పుడో పది రోజుల క్రితం రెండోసారి ఇప్పుడు పిక్నిక్‌లో తప్పని సరియ్యి తాగవలసి వచ్చింది అని గదిలోకి వెళ్ళిపోయాడు

మమ్మీ తప్పయింది సారి అంటాడని కోపంతో ఉన్న నన్ను తన మంచి మాటలతో శాంతపరుస్తాడని ఊహించాను అలా చేయలేదు సరికదా నిర్లక్ష్యంగా గదిలోకి వెళ్ళిన బాబును చూస్తుండి పోయాను చాలా సేపు

బాబు పెద్ద వాడయ్యాడా!

ఆ మర్నాడు లేడీస్ క్లబ్బులో కేరమ్స్ ఆడుతూ కూర్చున్నాను వనజ మాటల్లో నా కిరణ్ ప్రసక్తి రావడం వింతగా తోచింది

అడ్డాల నాడు బిడ్డలు గాని గడ్డాలు మీసాలు వచ్చింతర్వాత కాదు ఆడపిల్లయిన మగవాడైనా వయసొచ్చాక మన చేతుల్లో ఉంటారనుకోవడం పొరపాటు

ఈ ఉపోద్ఘాతం దేనికి చెప్పేది డైరెక్టుగా చెప్పు అంది నిర్మల బోర్డు మీద పౌడర్ చల్లుతూ

మన స్వరూప గారి ముద్దుల కొడుకు అలనాడు రాముడు తండ్రి మాట జవదాటని వాడు ఈ రోజు ఈ కొడుకు తల్లి గిచిన గీతను దాటని వాడు ఎంతో బుద్ధిమంతుడనుకున్నాం

**జరిగిన కథ –7** భార్గవను పోలీసులు పట్టుకు పోయారు భార్గవ భార్య స్వరూప భర్తకు విడాకులు ఇచ్చేస్తుంది రామారావు భార్గవ అసలు స్వరూపం తెలుసుకుంటాడు భార్య సీతను చేరదీశాడు – హరిత స్వరూప చెప్పిందంతా వినింది హరిత గాయత్రిని కలుసుకోవాలనుకుంటుంది హరిత బలవంతంపై స్వరూప చెప్పసాగింది– జైలు నుండి విడుదలైన భార్గవ తన తప్పు తెలుసుకొని మనిషిగా మారి భార్యను విడాకులు ఉపసంహరించుకోమంటాడు కానీ స్వరూప ఒప్పుకోలేదు భార్గవ స్వరూప ఇంట్లో లేనప్పుడు పాపను తనతో తీసుకు వెళ్ళిపోతాడు స్వరూప కొడుకు కిరణ్‌కి తల్లి అంటే ప్రాణం అతను డిగ్రీ పాసై యూనివర్సిటీలో చేరాడు భార్గవ తండ్రి పరాంకుశం కోడలు స్వరూప దగ్గరికి వచ్చి ఆమెను బాబుని తమ ఇంటికి రమ్మని అడుగుతాడు భార్గవ తల్లితండ్రుల దగ్గర లేడని తెలుసుకుంటుంది స్వరూప ఆమె మామగారి ఆహ్వానాన్ని తిరస్కరిస్తుంది పరాంకుశం నిరాశగా వెళ్ళిపోయాడు

అనుకోవడం ఏమిటి ఉన్నమాటే ప్రతి క్లాసులోనూ ఫస్ట్ ముత్యం లాంటి వాడు అంది నిర్మల స్ట్రైకింగ్ చేస్తూ

బుద్ధిమంతుడే చిన్నప్పుడు ఇప్పుడు పెద్ద వాడయ్యాడు వయసు తగ్గ బుద్ధులొస్తున్నాయి పిల్లలు మారడం ఈ సొసైటీలో మామూలే డ్రింక్ ఎక్కువగా తీసుకుంటున్నాడని మా పిల్లలు అనుకుంటే విన్నాను

ఇక అక్కడ ఉండలేకపోయాను

గబగబ ఇంటికి వచ్చాను

నా కోపం తారస్థాయికి చేరుకుంది

కిరణ్ అప్పటికే ఇంటికి వచ్చి రికార్డులు వ్రాసుకుంటున్నాడు

బాబూ

గట్టిగా అరిచాను

ఉలిక్కిపడ్డాడు కిరణ్

నేను విన్నది నిజమేనా

ఏ విషయమూ అర్థం కానట్లు కిరణ్ మాట్లాడలేదు

నువ్వు రోజూ డ్రింక్ తీసుకుంటున్నావట

మమ్మీకి అంతా తెలిసి పోయిందనుకున్నాడేమో కిరణ్ సూటిగా తొణక్కుండా జవాబు చెప్పేడు

అవును మమ్మీ ఫ్రెండ్స్‌తో అప్పుడప్పుడు తీసుకుంటున్నాను అయినా ప్రతిది ఎందుకంత సీరియస్‌గా తీసుకుంటావు యూనివర్శిటీలో పార్టీలు డ్రింక్‌లు మామూలే

అంత ధైర్యంగా సమాధానం ఇస్తాడని ఊహించలేదు

మందు తాగడం సహజమని ఎవరూ అనరు మనిషిని అదో లోకానికి తీసుకెళ్ళే అలవాట్లు క్యాజువల్ తీసుకోవడం మంచిదికాదు

ఏమిటో మమ్మీ నీ ధోరణి నాకేం అర్థంకావటం లేదు నేను తప్పతాగి రోడ్డు మీద చిందులు వేయడం లేదు డిగ్నిటీగ ప్రవర్తిస్తున్నాను

నేనేం మాట్లాడ లేక పోయాను

మాటకు మాట

వీడిలా తయ్యారయ్యా డేమిటి?

కిరణ్ నాబాబు నా ఆశల ప్రతినిధి

ఈ పరిస్థితి వీణ్ని ఎంతవరకు తీసుకెళుతుంది?

బాబు తాగుడుకు అలవాటుపడ్డాడు

ఒక రోజు

మమ్మీ తాతయ్య గారింటికి వెళ్ళాను డ్రింక్ తీసుకోవడం వలనే ఇంత వయసొచ్చినా చురుకుగా ఉంటున్నానని చెప్పాడు తాతయ్యే బలవంతంగా తాగించాడు పెద్దవాళ్ళు అవర్ చె . బాగోదని

ఆ మాటలు మరి వినలేక పోయాను

పరాంకుశం గారే బాబు చేత డ్రింక్ త్రాగించారా!

నిజమేనా!

అంతమంచి మనిషి

ఆ రోజు ఇంటికి వచ్చి ఎంత బాధ పడ్డాడు

అదంతా నాటక మేనా!

నా ఆలో చనలు రకరకాలుగా పరుగెడుతున్నాయి



# చైతన్య స్వరూపం

ఆ ఇంటికి ఎందుకెళ్ళావ్

మమ్మి నేనేం పరాయి ఇళ్ళకు వెళ్ళలేదే

బాబుకు అతనేమైనా చెప్పాడా

తను బర్త_ను వదిలేసినఆడదని చెప్పాడా!

అతనేమైనా నీకు చెప్పాడా

ఏం చెప్పలేదు మమ్మి నన్ను చూడగానే సంబర పడ్డాడు పాపం ముసలి ప్రాణం కదా! మన వడిని చూడగానే సంతోషంతో పొంగిపోయాడు ఉన్న అరగంటలో ఎన్ని కబుర్లు పారెను విస్కీ వద్దంటే వినడే

బాబు పతనానికి దగ్గరవుతున్నాడా!

నేను ఓటమికి చేరువవుతున్నానా!

ఎవరి కోసం నేను నా జీవితాన్ని పణంగా పెట్టానో ఎవరికోసం నేను నా సుఖాలన్నీ త్యాగం చేసి బ్రతుకుతున్నానో ఎవరి కోసం బర్త_ను దూరం చేసానో ఎవరి కోసం అహర్నిశలు కృషి చేస్తు_న్నానో వాడే నన్ను ఓటమిలో పడేయడానికి సిద్ధమయ్యాడు

దినికి కారణం పరాంకుశం

నా కొడుకును తాగుబోతును చేస్తు_న్న పరాంకుశం

ఆ ముసలోడికి ఎందుకింత కసి

ఆ మర్నాడు నేను టాక్సీలో పరాంకుశం గారింటికి వెళ్ళాను నన్ను చూసి ఆశ్చర్యపోయాడు పరాంకుశం

చాలాకాలానికి ఇల్లు మనుష్యులు గుర్తు_కొచ్చారో

ఆప్యాయత ఒలకబోసాడు

కూర్చోమన్నాడు

నా బాబు ఈ ఇంటికి వస్తు_న్నాడా

ఆ ఒక్క మాటే అడిగాను

నీ బాబు మన బాబు కాడా! ఈ ఇల్లు బాబుదికాదా! ఈ ఇల్లు ఆస్తి_ అంతా వాడిదే కదా!

నాక్కావలసింది ఆ సమాదానం కాదు బాబును డ్రింక్ తీసుకోమని బలవంతం చేస్తు_న్నారట

బలవంతం కాదు బాగా అలవాటు పడ్డవాడే అయినా ఈ రోజుల్లో యూనివర్సిటీ కుర్రాళ్ళె కాదు కాలేజీ అబ్బాయిలు కూడా డ్రింక్ తీసుకోవడం ఓ పేషను అదేమంత పెద్ద నేరం కాదు

మీ దృష్టిలో కాకపోవచ్చు కానీ నాకిష్టం లేదు నా బాబు దురలవాట్లకు బానిస కాకూడదు




పరాంకుశం గంబీరంగా మారిపోయాడు

చూడు స్వరూపా నీ బాబుకు త్రాగుడు నేనే నేర్పించాను అప్పుడెప్పుడో పిక్నిక్ వెళ్ళానని నీకు అబద్ధం చెప్పాడు ఆ రెండ్రోజులూ ఇక్కడే తప్ప తాగి పడి ఉన్నాడు నేనే త్రాగమన్నాను నీ బాబును ఒక తాగుబోతుగా చేయడమే నా ఉద్దేశ్యం నా పట్టుదల

పరాంకుశం ఒక్కొక్క మాట నా గుండెల్లో గుచ్చుతుంది ఎందుకి నాటకం నా బాబును ఇలా తయారు చేయడంలో వీళ్ళ ఉద్దేశ్యం ఏమిటి?

ఎందుకిలా చేస్తు_న్నారు

ఎలాగో గొంతు పెగల్చుకుని అడిగాను

స్వరూపా ఆ రోజు నీ వలనే మా కొడుకు మాకు దూరమయ్యాడు ఆ రోజు మా గుండెలు ఎంత ఘోషించాయో నీకు తెలియదు ఆ బాద నీకు కలిగించాలని నీ కొడుకు నీక్కాకుండా చెయ్యాలన్నదే నా ఆశయం ఆ పగతో నేనీ కొడుకును నా దార్లోకి తెచ్చుకుంటున్నాను నీ గురించి చాలా విషయాలు తెలిసాయి నువ్వు ఏ ఉద్దేశ్యంతో ఆ రోజు నాకొడుకును బయటకు గెంటేసావో తెలుసు నీ కొడుకును ఉన్నత విద్యా వంతుడిగా ఉత్త_మ పౌరుడిగా పదిమంది మెచ్చుకొనేలా తీర్చి దిద్దడానికి నడుం బిగించావని నీ ఆశయాలకు నా బార్గవ అడ్డు ఉండ కూడదని వాడి నీడే నీ కొడుకు మీద పడకూడదని బర్త_ని కూడా ఆలోచించకుండా చేసావు వాడు పంతెంతో ప్రాపను తీసుకెళ్ళాడు ఎవరు ఎవర్ని ఎలా తీర్చిదిద్దుతారన్న మీ ఛాలెంజ్ కూడా తెలుసు నీ తిక్క కుదిర్చాలని నీ పందెం దెబ్బ తీయాలని నీవు ఓడిపోవాలనే నా నాటకం అందుకు మొదటి అధ్యాయం నీ బాబును తాగుబోతును చేయడం రెండు [illegible]మ్మాయిలను రుచి చూపించడం

నీవు ఓడి పోవాలి

నా కొడుకు గెలవాలి

అప్పుడైనా నా కొడుకు నాదగ్గరకు వస్తా_డు

మరి వినలేక పోయాను

గబ గబ ఇంటికి వచ్చేసాను

వీళ్ళెందు కింత నాటకమాడుతున్నారు

బార్గవ్ గెలుపుకోసం తండ్రిని ఉసికొల్పేడా!

ఇంతకాలం నాబ్రతుకు సాఫీగా సాగిపోతుందనుకున్నాను కాని మళ్ళీ దారి తప్పింది మరో విషవలయాన్ని ఎదుర్కోవాలి దిని పరిణామం ఎలా ఉంటుంది

నాజీవితం ఇంకా ఎన్ని మలుపులు తిరుగుతుంది?

దూరంగా ఓ స్కూటరు ఆగింది

అకుర్రాడి వెనుక ఒక అమ్మాయి దిగింది

ఆ చీకట్లో ఒక్కక్షణం ఆ రెండు నీడలు రోడ్డు మీదే అల్లుకు పోయాయి తర్వాత విడిపోయాయి

ఆ అమ్మాయి అక్కడే నిలబడిపోయింది

ఆ స్కూటరు దగ్గరకు వస్తు_ంది

ఆ కుర్రవాడు ఎవరో తెలుస్తు_ంది

ఆ స్కూటరు ఇంటి ముందు ఆగింది

ఆ కుర్రాడు కిరణ్ అని గుర్తు_పట్టాను

★ ★ ★ ★ ★

బాబు పెద్ద వాడవు తున్నాడా!

బాబు నా అదుపు తప్పుతున్నాడా!

బాబును వక్రమార్గం పట్టిస్తు_న్నారా!

ఏది నిజం

అతని గెలుపు కోసం బార్గవే ఇలా చేయిస్తు_న్నాడా!

నా మీద ఎందుకింత పగ?

ఈ తరంలో అందరిలా కాకుండా ఓ అడుగు ముందుకు వేసినందుకా ఈ శిక్ష

బాబు బంగారు బవిష్యత్తు_ కోసం నే తీసుకున్న నిర్ణయం సమంజసం కాదా!

# మాటలకు మౌనానికి మధ్య మధురక్షణాలు

ఏదియేమయినా ఫరవాలేదనుకొనే మధుర క్షణాలు మీ జీవితంలో ఎన్నో. మౌనసామ్రాజ్యం వొడిలో ఉద్వేగపూరితమైన నవ్వుతో—ఏకమైన వేళ. ఇంకెవ్వరూ, కాదు ఈ ప్రపంచమే ఏమైనా ఫరవాలేదు నిజమే మీకు ఈ మధుర క్షణాలకు మధ్య ఏదీ అడ్డురాకుండా ఉండేందుకు అవసరమైనది కోహినూర్ లేత ఎఱుపు మీ మృదువైన ఆలోచనలకు సున్నితత్వానికి రక్షణనిస్తుంది శ్రేష్ఠమైన లేటెక్స్‌తో తయారుచేయబడినది పూర్తి రక్షణ నివ్వడానికి ఎలెక్ట్రానిక్ సాధనాలతో పరీక్ష చేయబడినది మృదువుగా ఉండేందుకు ల్యూబ్రికేట్ చేయబడింది.




**KOHINOOR**

లేత ఎఱుపు సుకుమారమైన కండోం

**TTK** తయారి.

## చైతన్య స్వరూపం

పాప బాబు

నా బిడ్డలు

బిడ్డలందరూ బుద్ధి మంతులవ్వాలని అందరిలాగే కోరుతున్నాను అయితే బార్గవ జీవితాంతం నన్ను బాద పెట్టడానికే ఈ పందెం వేసాడా!

బాబును ఉత్తమ పౌరుడిగా తీర్చి దిద్దగలననే నమ్మకం పై దెబ్బ తీయాలనే బార్గవ అలా ప్రవర్తించాడా!

ఏది ఏమైనా కిరణ్ నా బాబు ఎందుకిలా తయారవుతున్నాడు నేనుపెంచే రీతిలో ఏ పొరపాటు జరగలేదు మరి ఇలా జరుగుతుందేమిటి? పరాంకుశం చెప్పినట్లు తన కొడుకు గెలుపు కోసం నా కొడుకును ఎరగా వాడుకుంటున్నాడా! లేక బాబే సొసైటీలో మార్పు చెందాడా!

ఏది ఎమయితేనేం బాబు తప్పుదారి పడుతున్నాడు

ఆదారినుండి బాబును మళ్ళించాలి

ఈ పరిస్థితిలో అంతకంటే ఇంకేం చేయగలను?

గెలుపు కోసం కాదు నాతృప్తి కోసం

ఇలా ఎన్నో ఆలోచనలు

బాబు చుట్టూ ఆలోచనలు పరిభ్రమిస్తున్నాయి

రోజులు ఎ మార్పు లేకుండా జరిగిపోతున్నాయి

కిరణ్ అప్పుడప్పుడు డ్రింక్ తీసుకుని రావడం

అమ్మాయిలతో షికార్లు నాకళ్ళకు కనిపిస్తున్నాయి

రెండు దెబ్బలు కొట్టి మార్చడానికి చిన్న పిల్లాడేం కాదు కొన్ని రోజులు బాబు విషయంలో చొరవ తీసుకోకుండా ప్రవర్తించాలి ఎప్పుడైతే నేను మందలించకుండా మౌనం పాటిస్తున్నానో కిరణ్ ఏం ఊహించాడో గాని కొంచెం తగ్గాడు ఇంట్లో ఉన్నంత సేపు బుద్ధిగా చదువుకుంటున్నాడు

అయితే బాబు విషయంలో నాకు నచ్చనది అమ్మాయిలతో షికార్లు

బాబులో మాటి మాటికి బార్గవ్ కనిపిస్తున్నాడు

అమ్మాయిల వ్యసనం వలనే బార్గవ దుర్మార్గుడిగా తయారయ్యాడు అమ్మాయిల జీవితాలతో ఆడుకోవడం వలనే బార్గవ ఓ కసాయివాడయ్యాడు ఆ అలవాటే అతన్ని జైలుకు పంపించింది ఆ చర్యలకు విరక్తి చెందే నేను భర్తకు దూరమయ్యాను అటువంటి తండ్రికి కొడుకుగా బాబు పెరగ కూడదనే నా కోరికలను ఆశలను జీవితాన్ని క్షణికంగా వదలి ఒంటరి బ్రతుకు గడపడానికే తర్మానించుకున్నాను బాబును కళ్ళల్లో పెట్టుకుని పెంచడానికే నడుం కట్టాను

జరిగిందేమిటి?

ఆ తండ్రి రక్తం పంచుకుని పట్టినందుకా బాబు ఇలా తయారవుతున్నాడు 'ఆ తండ్రి బుద్ధులే పుదుతున్నాయి'

బాబు అలా తయారవ్వడానికి వీలు లేదు

బాబును ఆ వ్యసనం నుండి తప్పించాలి

బాబు నా ముద్దుల బాబు

నా ఆశల ఊపిరి కిరణ్

బాబు ఎమ్మెస్సి యూనివర్సిటి ఫస్టులో పాసవుతాడు డాక్టరేట్ చేస్తాడు విదేశాలు వెళతాడు ఈ నా ఆశలు ఆశలుగానే మిగిలి పోతాయని తెలియ జేయడానికే కనిసం ఫస్టుక్లాసులో కాకుండా ఆర్డినరి సెకండ్ క్లాసులో పాసయి నాదగ్గర తల వంచాడు

విదేశాలు కాదు కదా ఈ దేశంలో మంచి ఉద్యోగానికి కూడా పనికి రాదు సెకండ్ క్లాస్ ఎ జి

మమ్మి అయాం వెరి సారి

అన్న కిరణ్ మాటకు చిన్నగా విరక్తిగా నవ్వేను

దండించినా ఎం పలితం?

వారం రోజుల తర్వాత

తరచుగా కిరణ్ ఓ అమ్మాయితో తిరగడం కనిపించి నా ఎదుట పడ్డాడు ఆ రోజు కిరణ్ ఇంటికి రాగానే నెమ్మదిగా అసలు విషయం కదిపాను

బాబూ ఈ వయసులో ప్రేమించడం ప్రేమించ బడటం పాపమంటున్నావు నేనుండగా నీకు లోటురాదు నువ్వు రోజూ షికార్లు చేసే అమ్మాయి ఎవరో చెప్పు పెళ్ళి చేసేస్తాను

పెళ్ళి గురించి ఇంత సడన్‌గా అడుగుతానని ఊహించని కిరణ్ కొయ్య బొమ్మయ్యాడు అదిగాక తను తిరిగే అమ్మాయితో

మమ్మీ ఆ అమ్మాయితో పెళ్ళి జరిపిస్తావా

కిరణ్ మాటల్లో వెటకారం స్పష్టమయింది

ఏం అంత ఆశ్చర్య పడుతున్నావ్

ఆ అమ్మాయిని అనుభవించడానికేగాని పెళ్ళికి పనికిరాదు

కిరణ్ మాటకు నాలో కోపం తారస్థాయికి చేరుకుంది

చూడు మమ్మీ ఆ అమ్మాయి చాలా పేదది పైగా డబ్బు పిచ్చిది డబ్బున్న వాళ్ళతో రోజు కొక గంటయినా గడపందే వాళ్ళ ఇల్లు గడవదు అటువంటి అమ్మాయిని నాలాంటి వాడు కాదు ఏ సంప సంస్కర్తో రావాలి

నేనలాగే నిలబడి పోయాను మరి మాట్లాడ లేక

వీడు చాలా పెరిగి పోయాడు

తర తరాల నుండి ఆడది మగవాడు ఆడుకునే బొమ్మగా తయారవుతుంది ప్రతి తరంలోను మగవాడు మగవాడే వాడి నరనరాల్లో ఈ రాక్షసత్వం జీర్ణించుకు పోతుంది

ఒకప్పుడు నాభర్త

ఇప్పుడు నా కొడుకు

ఇద్దరిలో ప్రవహించేది ఒకే రక్తం

అందుకే ఒకే బుద్ధులొచ్చాయా'

అలా జరగ కూడదనేగా నా జీవితాన్ని చీకటి చేసుకున్నాను ఏ ఆశలు ఆశయాలతో జీవించాలను కున్నానో అవే ఎదురు తిరుగు తున్నాయి విధి నాతో ఎందుకంత కర్కశంగా ఆడుతుంది

వ్యసనపరుడి దగ్గర పాప

సంస్కారం పాణికి పుచ్చుకున్న తల్లి దగ్గర బాబు

ఎవరు ఎలా ఎవర్ని తీర్చి దిద్దుతారు'

భార్గవ వా లెంబ్ చెవుల్లో మారు మ్రోగుతుంది

నేను ఓడిపోతున్నానా ఓడిపోయానా

భార్గవా నా పాపను ఒకసారి చూపించు

నా పాపను గుండెలకు హత్తుకోవాలి

నా హృదయం మౌనిస్తుంది

నా బాధను బాబు కెలా చెప్పగలను'

బాబూ నువ్వు మారి నా బాధను తగ్గించు

అని బాబును ప్రాధేయపడాలి ఎలా'

ఏం చెప్పితే వాడు మారతాడు'

నా కన్నీళ్ళు చూసి వాడు పలిస్తాడా'

ఆర్నెళ్ళు గడచాయి

కిరణ్ చేత మంచి సెంటర్లో ఫాన్సీ స్టోరు తెరిపించాను ఒక వ్యాపకంలో పడితే ఓ దారికి వస్తాడనే ఆశతో అలా చేసాను వ్యాపారం అంటే కిరణ్‌కి మంచి ఇంట్రెస్టు జులాయిగా తిరగడానికి అడ్డంగా ఉన్నా బ్రతుకు తెరువుకోసం ఎప్పటికైనా ఏదో మార్గం చూసుకోవాలి కదా అని ఆలోచించాడేమో ఓ ఒద్దున పడ్డాడు ఉదయం టిఫిను చేసి నేను కాలేజికి వాడు షాపుకు వెళ్ళేవాళ్ళం మధ్యాహ్నం ఇంటికి వచ్చి భోంచేసేవాడు సెలవు రోజున ఇంటి పట్టునే ఉంటున్నాడు

మరో ఆరు నెలలు

షాపు ఇల్లు మరో వ్యాపకం పెట్టుకోకుండా బుద్ధిగా ఉన్నాడు ఇద్దరు కుర్రాళ్ళను ఉంచాడు సెంటరవడం వలన సేల్సు పెరిగాయి షాపుకి ఫో కూడా పెట్టాడు

బాబు దారికొస్తున్నాడు

నా ఆశలు మళ్ళీ చిగురించాయి

బాబులోని మార్పు నాలో సంతోషాన్ని కలిగించింది

అప్పుడప్పుడు షాపు కెళ్ళి చూసేదాన్ని

ఓ రోజు షాపులో ఒకమ్మాయి కనిపించింది సేల్స్‌గర్ల్ మాట వరసకయినా కిరణ్ నాకు చెప్పలేదు

మమ్మీ ఈ రోజుల్లో వ్యాపారంలో ఇదొక లిటిగేషను అమ్మాయుంటేనే షాపుకు కళ రెండ్రోజులే అయింది అపాయింట్ చేసి, నీకు చెబుదామనే మరచి పోయాను నా తత్వం తెలిసిన నీవు మరోలా భావిస్తావని షాపులో అమ్మాయిలను ఉంచవద్దని అంటావని భయపడే చెప్పలేదు కోపం వస్తే క్షమించు మమ్మీ

తప్పు చేసిన వాడిలా తల వంచేసాడు

నేనేం మాట్లాడలేదు

ఆ రాత్రి ఇంట్లో కూర్చుని బుక్స్ రిపర్ చేస్తుంటే కిరణ్‌తో పాటు ఆ అమ్మాయి వచ్చింది

నమస్తే మేడమ్

అంది వినయంగా

అప్పుడు చూసాను ఆమెను

సన్నగా నాజూగ్గా తెల్లగా అందంగానే ఉంది చూపరులను ఇట్టే ఆకర్షించగల ఆ కళ్ళు పొందికగా ఉన్న అవయవ సౌష్టవం ముఖం కళతో అంతకంటే గమ్మత్తయిన అమాయకత్వం స్పష్టమయింది వయస్సు ఇరవై ఉండొచ్చు సింపుల్‌గా ఉన్నా ఒంటి జడ మరింత అందాన్నిస్తుంది ఆ అమ్మాయి మీద నాకు సదభిప్రాయం కలిగింది

నీ పేరేమిటమ్మా

గాయత్రి మా నాన్నగారు రామచంద్ర హైస్కూలు టీచరుగా రిటైరయ్యారు నా తర్వాత ఇద్దరు తమ్ముళ్ళున్నారు నేను బియ్యే ఈ సంవత్సరం పాసయ్యాను నాకు మంచి ఉద్యోగం వచ్చేవరకు ఈ పని చేయాలను కుంటున్నాను ఇంతవరకు మా నాన్నగారు అప్పో సప్పో చేసి నన్ను చదివిస్తూ గడుపు కొచ్చారు తమ్ముళ్ళు చదవాలన్నా రిటైరయిన తండ్రి మనసు ప్రశాంతంగా ఉండాలన్నా నేను ఉద్యోగం చేయడం తప్పదు

వివరాలు అడగకుండానే గబగబ చెప్పేసింది

చిన్నగా నవ్వి ఊరుకున్నాను

నేనంటే ఎంతో గౌరవం గాయత్రికి

షాపు సెలవు నాడు ఇంటికి వచ్చేది

మేడమ్ అమ్మగారు అని గాయత్రి పిలుస్తుంటే వారించాను ఆంటీ అనమన్నాను ఆ మాటకే గాయత్రి పొంగి పోయింది

చిన్నప్పుడే తల్లిని పోగొట్టుకున్న గాయత్రికి నేను చూపించే ప్రేమ అభిమానం అమృత తుల్యం

(ఇంకా ఉంది)


సీక్రెట్ ఏజంట్
విక్రమ్
7


తెరచి ఉన్న ఓ కిటికీలో నించి లోపలికి వెళ్ళాడు విక్రమ్–


ఇప్పుడు ఎటు వెళ్ళాలి?
ఆ! ద్వారం అక్కడ ఉంది
29/7


ఉన్నట్టుండి లైట్లు వెలిగాయి–
కదల వద్దు!


చేతులు పైకెత్తు విక్రమ్
ఎత్తులు వెయ్యకు


వాళ్ళు విక్రమ్‌దగ్గరున్న సంచిని రివాల్వర్‌ని తీసేసుకున్నారు ఈ లోగా విక్రమ్ తేరుకున్నాడు–
మీ రక్షణ ఏర్పాట్లకి నిజంగా అభినందించాలి మీరు ఇలాగే ఎప్పుడూ అప్రమత్తంగానే ఉంటారా?
1983


అలాంటి నియమం ఏదీ లేదు కానీ నీ రాక మాకు ముందే తెలుసు విక్రమ్!
ముందే తెలుసా? ఎలా? దానికి ఒక్కటే ఒక్క సమాధానం కనిపిస్తుంది


అదే ఆ కుడివైపు వెళ్ళిన వ్యక్తే విక్రమ్!


మార్టిన్?
నా పేరు కాలిస్టో
నా మారు వేషం ఎలా ఉంది?




నువ్వు చంపదలుచు కుంటే నన్ను చంపటానికి ఎన్నో సార్లు నీకు అవకాశం లభించినా ఎందుకలా చెయ్యలేదు? ఇక్కడికి తీసుకురావటం ఎందుకు?
ప్రశ్నలకిది సమ
కాదు మార్క్!
ఇతడ్ని ఇక్కడి నించి తీసుకువెళ
సరుకు వస్తుంది
తయారుగా ఉండాలి
(ఇంకా ఉం




# తీర్పు

డాక్టర్ సోమిరెడ్డి (పెళ్ళకూరు) జయప్రద

"లోకేష్ ఒంటరి తండ్రిని వదిలేసి తన దారి తను చూసుకున్నాడు

ఈ వార్త మా స్నేహ బృందానికి తెలిసి పది నిముషాలయింది పాపం ఈ వయస్సులో లోకేష్ తండ్రి ఒంటరి వాడయిపోయాడు అని మాలో ఒకరిద్దరన్నా మిగతావాళ్ళు దాన్ని సపోర్ట్ చేయలేదు

లోకేష్ ప్రేమించిన ఎల్లి అన్యకులస్థురాలే కావొచ్చు కానీ కనుముక్కు తీరు చూడ్డానికి బాగనే వుంటుంది గుణవంతురాలు రేపొద్దున మంచాన కుంచాన పడితే మావకు సేవలు చేసే అమ్మాయే కాని నాకెందుకొచ్చిన తద్దినం అనుకునే అమ్మాయికాదు మరి ఈయన అభ్యంతర మేమిటట? ఎదిగిన బిడ్డ మీద యీయన జులుం ఎమిటట?

ఇది మధుసూదన్ దేవానందం ఉద్దేశం

కాదన్నాడే అనుకో లోకేష్ జబ్బు తండ్రిని ముసలి తండ్రిని వదిలేసి వెళ్ళిపోవడం – ఎమో నాకన్యాయమనే అన్పిస్తోంది అనకుండా వుండ లేకపోయాను

అంటే నీ ఉద్దేశం – ఆ అమ్మాయికి అన్యాయం చేయాలంటావు?

కాస్త నీళ్ళు నమిలాను నేను

నిజమే మనసు మాట జారేసినపుడు తండ్రి కాదన్నపుడు ఎవరో ఒకర్ని అన్యాయం చేయాల్సిందే కదా!

తండ్రిని కన్విన్స్ చేసుకో నుండొచ్చు ఇంత కాలం పెంచి పెద్ద చేసి తన మీదే ప్రాణాలు పెట్టుకునీ

ట్రాష్! ఊరుకుందూ ఆ ముసలాడు ఒప్పుకుంటాడా?

నవ్వొచ్చింది నాకు లోకేష్ తండ్రికి యాభై అయిదేళ్ళుంటాయి మాకంతా యాభైదగ్గరే అతను ముసలాడు మేము పడుసోళ్ళం

మొత్తానికి అందరం కలిసి లోకేష్ మంచిపని చేసాడనే నిర్ధారణ చేసుకున్నాం కానీ ఒక్కటి ఆలోచించలేదు మేము ఇదే పని మా పిల్లల్లో ఒక్కరు చేస్తే ఆ రియాక్షన్ మాలో ఎలా వుంటుంది

ఈ నాటి ఈ తాజా వార్త విన్నప్పటి నుండి దాని మీద యీ రెండు గంటలుగా జరుగుతున్న డిస్కషన్ వెనగ్గా నాకు నిన్నటి తాజావార్త నిన్నటి డిస్కషన్ వద్దన్నా గుర్తొస్తూ వుంది

నిన్న మా చిన్నమ్మాయి నా దగ్గర కొచ్చి

నాన్నా! మీ రొక్కసారి నా ఫ్రెండ్ మధూలిక ఇంటికి రావాలి అని పిలిస్తే ఆశ్చర్యపోయాను మధూలికతో గానీ ఆమె తండ్రితో గానీ నాకు పరిచయం లేదు




అదే నాన్నా! పాపం మధూ నాన్న ఆ ముసలామె వుంది చూడు రాదమ్మ ఆమెను ఆమెను

ఏమిటమ్మా

ఆమెను ఆమె నిప్పుడు పెళ్ళి చేసుకుంటాడట ఆయన

నాకే ఆశ్చర్యం! నేనే తృళ్ళిపడ్డాను ఓ క్షణం

ఆ తర్వాత ఆలోచిస్తే అన్పించింది అందులో తప్పేముంది? పెళ్ళి లోక సహజం అయినప్పుడు ఆయన చేసే దాంట్లో తప్పేముంది? అదే మాట నా కూతురితో అందామనుకున్నాను కానీ అనలేదు ఆ అమ్మాయి కళ్ళు నా సపోర్ట్ కొరకు ఎదురు చూస్తున్నాయి మౌనంగా నా కూతురి వెంట మధూలిక ఇంటికెళ్ళాను

ఆ పెద్ద హాలులో చెరో మూల నిల్చొనున్నారు మధూలిక ఆమె అన్న శేషసాయి మధూలిక తండ్రి డాక్టర్ వేదమూర్తి సోపాలో కూర్చొనున్నాడు అతని ముఖం వాడిపోయింది కానీ అతని కళ్ళల్లో శిలాకఠినత్వం –

మధూ! రాద ఆంటీ అంటే నీ కిష్టమే కదమ్మా ఆమె కంపెనీ నువ్వు ఎంజాయ్ చేస్తావు కదమ్మా

అది వేరు మా అమ్మ ప్లేస్

తన తల్లి స్థానంలో మరో మనిషికి చోటివ్వడం ఆ పిల్లకు పూర్తిగా నచ్చని భావం – ఆ అసంపూర్ణ వాక్యంలో స్పష్టంగా వుంది –

నిజమే తన తల్లి తిరగాడిన యీ ఇంట్లో మరో కొత్త మనిషిని భరించడం కష్టమే అలా అని యీ ఇంటికి అల్లుడు రాకుండా వుంటాడా? ఈ ఇంట్లో సోపాల మీద కూర్చోకుండా వుంటాడా? తన తల్లి వాడిన కప్పూ సాసర్లలో కాఫీ తాగకుండా వుంటాడా?

అదే అడగాలనుకున్నాను కానీ నన్ను నా కూతురు తీసుకొచ్చింది అందుక్కాదు అందుకే మౌనంగా మిగిలిపోయాను ఓ పరాయి వ్యక్తి ఆ సమయంలో తమ మధ్య కొచ్చినా తన కూతురుగానీ కొడుకు గాని సంభాషణ ఆపు చేయకపోవడంతో వాళ్ళే సపోర్ట్ కొరకు తనని పిల్చుకున్నారని అనుకున్నాడేమో నన్ను కూర్చోమని సోపా చూపి ఆయన సంభాషణ కొనసాగించారు

## తీర్పు

అయినా ఈ వయస్సులో మీకు పెళ్ళేమిటి? కొడుకు ఓ మూల నిలబడి భయంగా కోపంగా వేసిన ప్రశ్నకు వేదమూర్తి మనసులో ఏమి తడబడ్డాడో పైకి మాత్రం

ఈ వయస్సులో తోడు కావాలనిపిస్తోందిరా అన్నాడు చెదరని స్పష్టతతో సాయి వెంటనే మరో ప్రశ్న వేయలేదు అతనికి ఈ పరిస్థితి డెలికేట్‌గానే వుంది

నేను నా కూతురితో ఆ హాల్‌లో ఎంటరవగానే కూర్చోమని మర్యాద చేసిన తండ్రీ కూతురు ఆ తర్వాత మా విషయమే పట్టనట్టుగా తమ గోలలో వున్నారు ఈ ప్రపంచంలో ఎవరు గోడు వాళ్ళది

మధూలిక స్త్రీ సహజమైన సిగ్గును బిడియాన్ని ప్రక్కకు నెట్టి అంది రేప్రొద్దున నాకు పెళ్ళైలా అవుతుంది నాన్నా

నాకు ఆ పిల్ల ప్రశ్నలు నవ్వొస్తున్నాయి

ఈనాడు తోడు లేని తండ్రి తోడుకు వెతుక్కుంటే కాదంటున్న ఆ పిల్ల ముందు ముందు తనకు తోడు దొరకదేమోనని భయపడుతోంది

రాదా నేను కలిసి నీ పెళ్ళి చేస్తామమ్మా

ఆ పిల్ల ముఖం చిట్లించింది – రాద అనే వ్యక్తి ప్రసక్తే తన కిష్టం లేదన్నట్టుగా ముఖం చిట్లించి వూర్కోలేదు

ఆమేవిటి నాకు పెళ్ళి చేసేది అనేసింది ఇలాటి డెలికేట్ విషయాల్లో మగవాళ్ళ కంటే ఆడవాళ్ళే ఎక్కువ ధైర్యం చేయగలరేమో! ఎదుటి వ్యక్తి మనసుల్ని నిస్సంకోచంగా పగలగొట్టగలరేమో అన్పించింది నాకు

మీ అమ్మ బ్రతికుంటే నీకు పెళ్ళి చేయదా మధూ నేను రాదను పెళ్ళి చేసుకుంటే నీకు అమ్మే కదమ్మా

అమ్మా! ఈ కొత్త మనిషి నాకమ్మా!

ఎవరైనా జీవితంలోకి ప్రవేశించక ముందు కొత్త మనుష్యులేనమ్మా మీ అమ్మ ఆ రోజు నాకు కొత్త మనిషి కాదూ! రేపు ఇంటికొచ్చే అల్లుడు నాకు కొత్త మనిషి కాడా? అంత మాత్రాన నాకు అల్లుడు కాకపోతాడా? ఈ ఇంట్లో మనిషి కాకపోతాడా?

మధూ కొన్ని నిముషాలు ఏం మాట్లాడాలో తోచలేదు కాబోలు విసురుగా తల తిప్పుకుని నిల్చుంది

అయినా మీరు చేయబోయే పని నాకు నచ్చలేదు నాన్నా సాయి నోరు విప్పాడు మరొక్కసారి

నీకు నచ్చలేదబ్బాయీ! నీకు నచ్చలేదని నీ తండ్రి ఈ రోజు రాదమ్మ చెయ్యి వదిలేస్తాడనుకో రేపు ఆయనకు దురదృష్టవశాత్తూ కాలూ చెయ్యి పడిపోయిందనుకో నీ చేత్తో ఆయన నోట్లో అన్నం పెడతావా? బాత్‌రూమ్‌కి తీసుకెళ్ళి మనస్ఫూర్తిగా స్నానం చేయిస్తావా? మలమూత్రాలు శుభ్రం చేస్తావా? రాదమ్మలా సేవ చేస్తావా?

అడగాలనుకున్నాను నిలదీసి అడగాలనుకున్నాను అడగాలనుకుని నా కూతురి కళ్ళల్లోకి చూస్తే అవి ఇందుకా నిన్ను తీసుకొచ్చింది నేను అన్నట్లు చూస్తున్నట్లనిపించాయి – స్వతహాగా పిరికివాణ్ణయిన నేను నాలుగు సార్లు మనసులో మననం చేసుకొందే పైకి అనలేని సాత్వికుణ్ణి నేను నా స్వర శబ్దం పెదాలు దాటలేదు

నువ్వు ఇవ్వలేని నిజమైన తోడు నీ తండ్రికి ఎవరో ఇస్తానంటే వద్దంటావేమిరా పిచ్చి సన్నాసీ అని మనసులో మాత్రం అనుకుని ఊర్కున్నాను

సాయీ! నేను చేయబోయే పనివల్ల మీకేమీ నష్టం రాదురా ఈ వయసులో మేము కోరుకునేది ఒకరితోడు ఒకరికే గానీ ఈ ఆస్తులు కాదు ఇవన్నీ మీవే – అలా అని వ్రాసివ్వమన్నా వ్రాసిస్తాను

అతన్ని చూస్తే నాకు జాలేసింది అతను కన్నపిల్లలు వీళ్ళు – అతను పెంచిన శరీరాలు వీళ్ళవి – అతను సంపాయించిన ఆస్థులు ఇవి అయినా అతను వాళ్ళను అర్థిస్తున్నాడు ఇది నా ఇష్టం మీ ఇష్టమయితే వుండండి లేకపోతే మీ ఏడుపు మీరేడవండి అనలేక పోతున్నాడు ఎందుకని? అతను వాళ్ళకి శరీర రూపాలే కాదు – తన సర్వప్రేమను ఇచ్చాడు ఆ ప్రేమను చంపుకోలేక అల్లాడిపోతున్నాడు ఎంతటి మూర్ఖులీ బిడ్డలు ఎంత స్వార్థపరులు వీళ్ళు వీళ్ళ కొరకు ఎందుకు మాకీ తాపత్రయం' నా కూతురు మనసు బాధ పడుతుందని స్వతంత్రించి నా అభిప్రాయాన్ని నేను

చెప్పుకోలేని ఈ పాశాలెందుకు?

సాయి మాట్లాడలేదు అతనికి తన తండ్రితో ఇలాటి జుగుప్సాకరమైన టాపిక్ మీద చర్చ జరపాలని లేదు – తండ్రి మనసు మార్చాలనుకుని రాధమ్మతో పెళ్ళి ప్రస్తావన ఆపేసుకుంటే బాగుణ్ణని వుందతనికి

మూర్తి నా వైపు తిరిగాడు నా రాకను అందులో అంతరార్థాన్ని అర్థం చేసుకున్న వాడిలా అడిగాడు

నా కూతురు తరఫున మీరేమైనా మాట్లాడే దలుచుకుంటున్నారా?

నేను తడబడ్డాను

ఏదైనా మాట్లాడదల్చుకుంటే మీ తరఫునే మాట్లాడాలని వుంది అని చెప్పాలనిపించింది నిస్సహాయంగా నిల్చిపోయిన అతని భుజం తట్టి బాయీ! నువ్వు ముందుకు నడువు రాదమ్మ చెయ్యి పట్టుకుని నడువు నీ వెనుక నేనున్నాను అనాలని వుంది

యాభై ఏళ్ళ వయసులో పెళ్ళి కొరకు కొడుకుని కూతుర్ని ప్రాధేయపడూ గిల్టీగా ఫీల్ అవుతున్న అతనికి 'నువ్వు చేసేది తప్పులేదు ఇది లోక సహజం అవకాశాన్ని వదులుకోవడమే మూర్ఖత్వమవుతుంది ఓ పసిపిల్ల మెడలో మూడు ముళ్ళువేస్తే అన్యాయమవుతుంది నువ్వు జేషయిన పని చేస్తున్నావు అని అభయమియాలని వుంది-

నేను నా వాళ్ళ మనసు నొప్పించలేని వెదవను అందుకే

లేదు లేదు ఏమీ లేదు అని నోరు చప్పరించి ఊరుకున్నాను

ఏమీ లేక పోవడమేమిటి నువ్వొచ్చిందెందుకు? అన్నట్టు మొహం చేత్తో పొడిచింది నా ఆఖరి కూతురు

వుండు అప్పుడేనా అవకాశం రానీ అన్నట్టు ఆ పిల్ల వైపు చూసాను - ఎక్స్పెక్ట్స్ చూసే చూపది

ఈ ఇంట్లో మీకిప్పుడేం తక్కువయిందని మీకేం జరగడం లేదని తండ్రి చూపులో వేడిని భరించలేనిదానిలా తలవాల్చేసుకుంది మధూలిక

అతనేం మాట్లాడలేదు ఏం మాట్లాడుతాడు

# తీర్పు

పాపం తన కూతురు మేమివ్వలేంది ఆ రాదమ్మ మీకేం ఇస్తుంది? అని అడుగుతుంటే పెళ్ళికాని కూతురికి అతనేం చెప్తాడు రేప్రొద్దున నీ మెడలో మూడు ముళ్ళువేయబోయే నా అల్లుడు నీకేమి ఆనందం ఇస్తాడో నీకేమి తోడునిస్తాడో నీకెంత ధైర్యాన్నిస్తాడో, జీవితం మీద ఎంత భరోసానిస్తాడో ఎంత ఓదార్పు నిస్తాడో ఎంత మనశ్శాంతి నిస్తాడో ఎంత మనోధైర్యాన్నిస్తాడో అది అది నాకు

రాదమ్మ ఇస్తుందమ్మా అని ఎలా చెప్తాడు అసలు చెప్పాలా ఎదిగిన ఆడపిల్లకు జీవిత భాగస్వామి పిల్లలకు మించి, తల్లిదండ్రులకు మించి ఏమిస్తారో తెలీదా?

డాడీతో సినిమాకా? బోర్ ఫ్రెండ్స్‌తో పోతాను అనే పిల్లల జనరేషన్ ఇది సినిమాహాల్‌లో తండ్రి ప్రక్కన కూర్చోడానికి సిగ్గుపడే పిల్లలు మీరు భర్త ప్రక్కన సినిమాహాల్లో కూర్చోడానికి గర్వంగా భావించే భార్య రాధమ్మ

మధూ! మీ నాన్న ఏ ఎమర్జన్సీ కేసుకో హాస్పిటల్ కెళ్ళి అర్ధరాత్రికి ఇంటికి తిరిగొస్తే తలుపు తీయడానికే విసుక్కునే మీరు నాలుగు కబుర్లు చెప్పి ఆయన సేద తీర్చలేని మీరు ఆయన ఎదురుగా కూర్చుని కొసరి వడ్డించి తినిపించడానికి ఆసక్తి చూపలేని మీరు నిద్ర పట్టక పడకమీద పొర్లాడుతున్న తండ్రిని చూచి నిద్ర చెడగొడుతున్నారని విసుక్కునే మీరు మీకు పోలికేమిటమ్మా రాదమ్మతో అనాలనుకున్నాను కానీ అనలేదు కానీ నేను అనదల్చుకున్న భావాన్ని ఆయన బయట పెట్టారు

ఈ ఇంట్లో ఏమి జరగడంలేదు అని కదూ మధూ నువ్వడిగావు?

ఏమి జరగడం లేదని నేనెలా చెప్తానమ్మా, నేనొచ్చేసరికి గీజర్‌లో నీళ్ళు వేడిగానే ఉంటాయి కొద్దిగా చల్లగా వున్నా నాయరు వడ్డించి వెళ్ళిన కూరలు అన్నం డైనింగ్ టేబిల్ మీదసిద్ధంగానే వుంటుంది నాలుగు రోజులకో బెడ్‌షీటు నీట్‌గా నా పడక మీదుంటుంది - వార్డ్ రోబ్‌లో నా షర్ట్స్ ప్యాంట్స్ ఎప్పటికప్పుడు ఐరన్ చేసుంటాయి కానీ - కానీ మదూ నాకింటి కొచ్చేసరికి ఎవిటో ఇల్లు శూన్యంగా వుంటోందమ్మా

శూన్యంగా అన్పిస్తుందా? మేమంతా ఏమయ్యాము? ముఖం చిట్లించిందా పిల్ల తండ్రి జవాబుకు కాస్త అఫెండయినట్టుంది

కూతురు చిన్నబుచ్చుకున్నందుకు అతను బ్బాధపడినట్టున్నాడు

అది కాదమ్మా మీరంతా లేరని కాదు కానీ కానీ నేనింటి కొచ్చేసరికి నువ్వు సాయి సినిమా కెళ్ళుంటారనుకో నాకు ఇంటికెందు కొచ్చానా? ఇంకాస్సేపు అక్కడే కూర్చుంటే ఇంకో నలుగురు పేషెంట్లు నాకు కాలక్షేపం అయ్యేవారు కదా అన్పిస్తుంది

అదేమిటి నాన్నా! మీరు త్వరగా వచ్చే రోజు చెప్తే కాలేజీ నుండి వచ్చాక మేమెక్కడికీ పోకుండా ఆగిపోదుము కదా! తండ్రి మెత్తబడటంతో అతన్ని మార్చుకోవాలనే తపనతో మదూలిక తండ్రికి తోడు వుంటాననే హామీ ఇచ్చింది

అతను ఇక్కడ కొద్దిగా తడబడ్డాడు

నువ్వు వుండవని కాదమ్మా నాకెప్పుడు ఒ పి త్వరగా అవుతుందో ఎలా తెలుస్తుంది నాకు ఏ రోజు పేషెంట్లు తక్కువగా వుంటే ఆ రోజు ముందు వస్తాను

అతని మనసులో జవాబు వేరే

ఏ మనిషికయినా తన మనిషి తన కొరకు ఎదురు చూడాలని - ఎదురు వచ్చి పలకరించాలని వుంటుంది కానీ నువ్వు నాకోసం ఎదురు చూడు అని చెప్పాలని వుండదు భార్యతో అయితే మనసు విప్పి 'నా కోసం వెయిట్ చెయ్యి అని చెప్పగలడు గానీ పిల్లలు తన వాళ్ళే అయినా పిల్లల మీద తల్లిదండ్రులకు ప్రేమ ఎంత చిక్కగా వున్నా వాళ్ళ నర్థించడానికి సంకోచపడ్తాడు

చిట్టి తల్లీ! నువ్వీ రోజు నాకోసం ఎదురు






చూస్తావ్? మాటిచ్చినదానికన్నా ఎదురు చూస్తావు నాకు తెలుసు కానీ నీ పెళ్ళయి పోయాక ఇన్ని వైభోగాలు నీకి ఇంట్లో జరుగుతున్నా మరో కొత్త తోడును వెతుక్కుని అతని చిటికెన వ్రేలు పట్టుకుని అతనితో యీ ఇంటి గడప దాటాక నా కొరకు ఎవరు ఎదురు చూస్తారమ్మా నాకు నా జీవితాంతం నిండు మనసుతో నా రాక కొరకు నా ప్రజెన్స్ కొరకు ఎదురు చూసే మనిషి కావాలమ్మా అని చెప్పలేకపోయాడతను

ఇన్ని మాటలెందుకు డాడీ ఈ ఇంట్లో మా వల్ల ఎందుకో బాధపడినట్టున్నారు ఇక మీ మనసుకు ఎలాటి బాధా కలగనీకుండా మేమిద్దరం చూసుకుంటాం - లోకం నవ్విపోయే ఈ పని మాత్రం చేయకండి మి మనసు మార్చుకోండి శేషశాయి ఒకడుగు ముందుకు వేసి అన్నాడు ఈ కొద్ది నిముషాలుగా అతనీ నాలుగు ముక్కలు చెప్పడానికి మనసులో నే రిహార్సల్ వేసుకున్నట్టున్నాడు

డాక్టర్ మూర్తి ఏమీ మాట్లాడలేదు కానీ నా గొంతులో మాటల్ని బయటకు కక్కేయాలనే నాసిమేటింగ్ సెన్సేషన్ నన్ను నిలవనీయడంలేదు

ఒరే నాయనా! నువ్వీ మాటలు మనస్ఫూర్తిగానే అన్నావో నాన్న మనసు మార్చడానికే అన్నావో గానీ చిట్టి తండ్రీ రేప్రొద్దున నీకు పెళ్ళయితే నీ జీవితంలోకి నీ భాగస్వామి ప్రవేశిస్తే ఆ ప్రేమలో ఆ మైకంలో ఆ స్వార్థంలో ఈ మాటలు గుర్తుంటాయా? నీకు అప్పుడీ థైలాగు మారిపోతుందిరా పిచ్చి సన్నాసి ఎందుకాయన్ని భ్రమలోకి త్రోసి ఆయన జీవితాన్ని సమాది చేస్తావ్?

నా గొంతులో బాషా బావం పొంతి కాలేదు

ఎందుకు చెప్పడం? ఈ వయసులో ఈ వేదాంతం అరగదు వాడికి మరలా వాళ్ళ నాన్న వయసు వచ్చినప్పుడు తప్ప వాడికీ బాధ అర్థంకాదు అశీర్వదించ కూడదు గానీ భార్యా వియోగం అనుభవించిన వాడికే ఆ విలువ ఆ బాధ ఆ శూన్యం అర్థమయ్యేది

ఓ గంట తర్వాత రెండు వైపుల నుండి అర్థింపులు పూర్తయినట్టున్నాయి కొడుకు బెదిరింపులో కొచ్చాడు.

మీరు ఆమెను పెళ్ళి చేసుకునేపనయితే నేనీ ఇంట్లో వుండను

డాక్టర్ మూర్తి కొడుకు వైపు చూశాడు తదేకంగా చూసాడు తర్వాత దృఢంగా నిర్ణయించుకున్న వాడిలా నోరు విప్పాడు

అయితే మి చెల్లెలు మాటేమిటి?

నేనూ మా అన్నతో నే వెళ్తాను

ఆల్ రైట్ మీరీ మాట ఈనాడే కాదు ఏనాడైనా నాతో మనస్తాపం వచ్చినప్పుడు అంటారు కానీ నాకు తెలుసు రాద నేనెంత తప్పు చేసినా నన్ను వదిలి వెళ్ళరు వెల్ మీరెళ్ళక్కర్లేదు ఈ ఇంటిని ఈ ఇంట్లోని వస్తువులను నా గుండెల్లో మి పట్ల ప్రేమని మీకే వదలి వెళ్తున్నాను నేను రాధను మాత్రం తీసుకెళ్తున్నాను నన్ను క్షమించే శక్తి

# ఇ: వేమన పద్యాలు

నా మీద నమ్మకం లేకపోతే నన్ను వదిలి పోండి, అంతేగాని......





పెరటిచెట్టు బెట్టి పరికించకుండినా
వెలుగుదాటి తీగ వెళ్ళిపోవు
ఆడుదాని గుణము నటువలె నుండురా
విశ్వదాభిరామ వినురవేమ

వుంటె మిరెప్పుడైనా రావాలనుకుంటే మా చిన్ని ఇంటికి నిస్సంకోచంగా రావచ్చు బిడ్డల్ని క్షమించే శక్తి తండ్రులకెప్పుడూ వుంటుంది బై అతను విసురుగా వెళ్ళిపోయాడు శ్రోతల్ని విభ్రాంతితో ముంచుతూ వెళ్ళిపోయాడు

* * *

ఈ తాజా వార్తను విన్న నేను నా స్నేహ బృందానికి చెప్పినప్పుడు - అందరూ ఏక కంఠంతో డాక్టర్ మూర్తి చేసింది చాలా తప్పన్నారు, పెళ్ళికాని కూతుర్ని ముఖ్యంగా తన స్వార్థం చూసుకుని వదలి వెళ్ళిపోవడం దురన్యాయమన్నారు రోజులు చెడిపోతున్నాయన్నారు అలాటి వాళ్ళని సంఘం నుండి వెలివేయాలన్నారు మనస్ఫూర్తిగా అతను చేసిన పనిని విమర్శించారు

ఈ రోజు లోకేష్ చేసిన పనిని హర్షిస్తున్నారు

లోకేష్ చేసింది డాక్టర్ మూర్తి చేసింది ఒక్కటే ఇద్దరూ తను కోరుకున్న తోడు కొరకు ఇల్లు వదిలేసారు డాక్టర్ మూర్తి పెళ్ళికాని కూతుర్ని ఇంట్లో వదిలి వెళ్ళడం అంత ఘోరమైన పనైతే జబ్బు తండ్రిని ఒంటరిగా వదలి వెళ్ళడం లోకేష్‌ది ఘోరాతి ఘోరం అవుతుంది లోకేష్ తండ్రికి ఇక జీవితంలేదు మరో వసంతం అతని జీవితంలోకి రాదు ఈనాడు డాక్టర్ మూర్తి వెళ్ళిపోయిన మధూలికకు సాయికి యిద్దరకు ముందు జీవితముంది తండ్రిని తండ్రి చేసిన అన్యాయాన్ని మర్చిపోయి ముందుకు పోవడానికి మార్గముంది కానీ లోకేష్ తండ్రికి ఏం మిగిలింది?

స్వభావసిద్ధంగా ఎవర్నీ ఖండించలేని నేను నిశ్శబ్దంగా లేచి వచ్చేసాను నాకేగాని శక్తి వుంటే యీ సాంఘిక చట్టాన్ని మార్చేయాలని అనుకుంటూ ◘



# బహుముఖ ప్రజ్ఞానిధి సి. ఆర్. రెడ్డి

వ్యవస్థ వ్యక్తుల్ని రూపొందిస్తుంది వ్యక్తులు చరిత్రను నిర్మిస్తారు ఈ పరిభ్రమణంలో కొందర్ని అనర్గళవచో రచనా విన్యాసం అభిస్మరణీయుల్ని చేస్తుంది మరి కొందర్ని చక్కని పరిపాలనా దక్షత ప్రసిద్ధుల్ని గావిస్తుంది ఇంకొందర్ని స్వచ్ఛంద సేవా ప్రవృత్తి మహోజ్జ్వల చరితుల్ని సృష్టిస్తుంది ఈ సుగుణాల సమిష్టి స్వరూపంలో అఖండ ఖ్యాతి నార్జించిన అసాధారణ శేముషీధురంధరుడు సి ఆర్ రెడ్డి

చిత్తూరు హైస్కూల్లో చదివి మద్రాసు క్రైస్తవ కళాశాల్లో బి ఏ నూ కేంబ్రిడ్జిలో ఎం ఏ హిస్టరీ ట్రైపాస్ పట్టానూ పొందిన రెడ్డి 1880వ సంవత్సరం చిత్తూరు జిల్లా కట్టమంచి గ్రామంలో జన్మించారు విద్యార్థి దశలో తన ప్రజ్ఞను కేవలం విద్యలోనే గాక సాహితీ రంగంలో కూడా వ్యక్తం చేశాడు తత్ఫలితమే ప్రబంధ ఆధునిక యుగ సంధానకర్త ముసలమ్మ మరణం కావ్యం విమర్శనా పంథాలలో వేగుచుక్క కవిత్వ తత్వ విచారము ఆయనలో అంతర్లీనమై యున్న కవితా శక్తి విమర్శనా పాటవం స్నేహశీలం వక్తృత్వ నైపుణ్యం మొదలైన లక్షణాలతో విద్యార్థి దశ దేదీప్యమానంగా వెలుగొందింది కేంబ్రిడ్జి ఉపాధ్యక్షుడుగా ఎన్నికైన తొలి భారతీయుడాయన అక్కడ డికిన్‌సన్ డేవిడ్ మెక్‌టాగర్ట్‌ల సమక్షంలోనూ గోఖలే సాన్నిధ్యంలోనూ లిట్టన్ స్ట్రాచీ క్లైవ్‌బెల్ స్క్వేర్‌ల సాహచర్యంలోనూ తన వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దుకున్నాడు

1908లో స్వదేశానికి తిరిగివచ్చిన కట్టమంచి బరోడా కళాశాలలో మైసూరు రాజా కళాశాలలో ఆచార్య పదవులు నిర్వహించాడు ప్రాక్ పశ్చిమ దేశాలు పర్యటించి అక్కడి విద్యాసంస్థల తీరుతెన్నులు పరిశీలించి మైసూరు విశ్వవిద్యాలయాన్ని తీర్చిదిద్దాడు తరువాత ఇన్‌స్పెక్టర్ జనరల్ ఆఫ్ ఎడ్యుకేషన్‌గా ఆయన విశేషమైన కృషి చేశాడు హరిజన విద్యార్థులకు కళాశాలలో ప్రవేశం కల్పించి అంటరానితనం రూపుమాపటానికి ప్రయత్నించిన సంస్కరణాభిలాషి అటు నుంచి రాజకీయ రంగంలోనూ తిరిగి ఆంధ్ర విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుడుగానూ మహత్తర కృషితో జీవితం అంకితమొనరించుకున్న ధన్యజీవి కట్టమంచి మైసూరు యూనివర్శిటీ ప్రో చాన్సలర్‌గా కొనసాగుతూ అనారోగ్యానికి గురి ఐ 1951 ఫిబ్రవరి 24వ తేది తనువు చాలించారు

## రాజకీయరంగం

స్వాతంత్ర్యోద్యమం ముమ్మరంగా సాగుతున్న జాలు మాంటేగు చెమ్స్‌ఫర్డ్ సంస్కరణలు వేశపెట్టిన రోజులు రెడ్డి తన పదవికి రాజీనామా సి జస్టిస్ పార్టీలో చేరారు లెజిస్లేటివ్ కౌన్సిలర్‌గా సనసభ ప్రసంగాల్లో చర్చల్లో సమయస్ఫూర్తి నిశిత మేధస్సు జోడించి తన శక్తిసామర్థ్యాలను దర్శించారు కానీ కలుషిత రాజకీయ రంగంలో న స్వచ్ఛంద ప్రవృత్తిని ఇముడ్చుకోలేని రణంగా రాజకీయాల నుండి తప్పుకుని 1925లో ంధ్ర విశ్వవిద్యాలయ ప్రథమ ఉపాధ్యక్షుడుగా దవినధిష్ఠించారు

1930లో గాంధీజీ సత్యాగ్రహాన్ని అణచివేయడాన్ని నిరసిస్తూ పదవికే రాజీనామా చేసిన దేశభక్తుడాయన తిరిగి కాంగ్రెసు ప్రచారంలో పాల్గొన్నారు చిత్తూరుజిల్లా అధ్యక్షుడిగా ఎన్నికై జిల్లా అభివృద్ధికి అవిరళ కృషి చేశారు నిష్పక్షపాతం సునిశిత పరిశీలన సమగ్ర అవగాహన పరిధులుగాగల ఆయన మానవతా దృష్టితో రాజకీయ ప్రహసనాన్ని చదివారు అవలంబించారు మానవతకు మించిన రాజకీయమే లేదన్నారు

## హాస్యరసధుని

కట్టమంచి ఒక విజ్ఞాన సర్వస్వం చక్కని వక్త మంచి భావుకుడు నిజాన్ని కుండబద్దలు కొట్టినట్టు మాట్లాడేవాడు ఉపన్యాసంలో చలోక్తుల్ని శ్లేషోక్తుల్ని వ్యంగోక్తుల్ని సూక్తుల్ని ప్రతిభోత్పత్తుల్ని సమపాళ్ళగా వొర్జించేవాడు విశ్వనాథ అన్నట్టు రెడ్డిగారికున్న ప్రతిష్ఠలలో నన్నిటికంటే గొప్పది వాక్చమత్కృతి మద్రాసు మెడికల్ కాలేజీలో ఆయన ప్రసంగం మధ్యలో విద్యుత్తు ఆగిపోవడం వల్ల చీకటిలో మాట్లాడే అలవాటు నాకు లేదు నేను బ్రహ్మచారిని గదా! అని చమత్కరించారు

ఒక సభలో రెడ్డి మన ఆంధ్రకేసరి– ఆంధ్రులకే సరి అని మాట విరిచి ప్రకాశానికి జరిగిన అన్యాయాన్ని తన సహజ ధోరణితో నవ్వుల వర్షం కురిపించారు భారత సార రత్నావళిలో ఆకారమున సుబ్బయ్యగారేనుగు తల లేని విఘ్నేశ్వరులు అంటూ ఆకారాన్నేగాక ఆహారంలో కూడా సుబ్బయ్య పాటవాన్ని రెడ్డి వక్కాణించారు

## ఉపాధ్యక్షుడు

భారత దేశంలోనే అగ్రశ్రేణి విశ్వవిద్యాలయంగా వెలుగొందుతున్న ఆంధ్రా యూనివర్శిటీ చరిత్రలో రెడ్డి పాత్ర అజరామరమైనది. ఈ విషయంలో కలకత్తా యూనివర్శిటీ వైస్ చాన్సలర్ సర్ అస్‌తోష్ ముఖర్జీ హిందూ విశ్వ విద్యాలయ వైస్ చాన్సలర్ మదన్ మోహన్ మాలవ్యలతో పోల్చడం ఎరిపాటి ఆంధ్ర విశ్వ కళా పరిషత్ అని పేరు పెట్టడంలోనూ ఎన్ని విమర్శలు తలెత్తినా వాల్తేరులో నే స్థాపించడంలోనూ ఆయన వివేచనకు అద్దం పడుతుంది ఇంత చక్కని ప్రదేశంలో నిర్మించబడిన విశ్వవిద్యాలయం భారత దేశంలో ఎక్కడా లేదు అన్నారు సర్ సి వి రామన్

రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో యూనివర్శిటీ కార్యాలయాన్ని గుంటూరుకు తరలించడం వల్ల ఏర్పడిన గందరగోళంలోనూ ఖర్చులు పెరిగి బడ్జెటు లోటు ఏర్పడడం వల్ల కలిగిన ఆర్థిక సంక్షోభంలోనూ ఆయన చూపిన ఆత్మ విశ్వాసం నిశ్చల దీక్ష మరపురానివి శాస్త్రీయ దృక్పథంతో అనేక నూతన శాఖలు ప్రవేశ పెట్టాడు ప్రాక్పశ్చిమ దేశాలలోని విశిష్ట పద్ధతులను కూడా అమలు పరచాడు ఎన్నో తాళపత్ర గ్రంథాలను సేకరింప చేశాడు ఎన్నో అముద్రితాలను ముద్రించాడు అత్యంత సమర్థులైన డా భగవంతం డా టి ఆర్ శేషాద్రి వి ఎస్ కృష్ణ విస్సా అప్పారావుల సహకార సంపత్తితో విశ్వ విద్యాలయ భవిష్యత్తు దీపకను దేదీప్యమానంగా వెలుగొందేటట్లు చేసిన ఘనత ఆయనదే

## సాహితీమూర్తి

నవ్యాంధ్ర సాహితీ వికాసానికి విమర్శనా పద్ధతులు కొత్త పుంతలు తొక్కుటకు ప్రాచ్య దృక్పథాల అవగాహనతో పాశ్చాత్య రీతులను తెలుగులో అనుసంధానం చేసిన తాత్త్వికుడు కట్టమంచి నవ్యాంధ్ర సాహిత్యోద్యానంలో వినూత్న భావ పరిమళాల్ని విరజిమ్మిన మనోజ్ఞపుష్పం ఆయన ముసలమ్మ కిరణం తెలుగు సాహిత్యంలో విమర్శనా స్వభావాన్ని మార్చి నూతన పందాలు చూపి కొంగ్రొత్త కాంతులు వెదజల్లిన ప్రభాత కిరణం ఆయన కవిత్వతత్వ విచారం

సద్విమర్శకు ప్రధాన లక్షణాలైన ప్రతిభా సంపత్తి అలంకారిక సంప్రదాయ పరిజ్ఞానం సద్వివేచన రసాస్వాద హృదయం విషయాన్ని నిక్కచ్చిగా నిర్మొహమాటంగా పరిశీలించగల ధైర్యం నిష్పాక్షికత కట్టమంచిలో కనిపిస్తాయి ఆయన కళాపూర్ణోదయాన్ని ప్రశంసిస్తూనే ప్రబంధకవులయందలి స్ఖాలిత్యము నింద్యను బెక్కులు కలవని విమర్శించాడు ఆయన కవిత్వతత్వ విచారం విమర్శ దృక్పథంలోనే ఒక క్రొత్తదనాన్ని తెచ్చి సంపూర్ణ విమర్శకు ఒరవడి అయ్యింది

– ముత్యాల, తుంగ

సీరియల్

## ఎస్. భారతీ దేవి



# ప్రేమసాగరం

(గత సంచిక తరువాయి)

మోహినినీ బాబునూ దాదాపు నెల రోజుల తర్వాత ఇంటికి తీసుకొచ్చారు

ఎన్ని మందులు వాడినా రమణరావు గారి ఆరోగ్యం కుదుటపడలేదు హాస్పటల్‌లో నే ఆయన చనిపోయారు

ఖర్మకాండలన్నీ జయరామే జరిపించాడు బాబు బలంగా ఆరోగ్యంగా ఉన్నాడు స్వప్న కన్నలు తల్లి అయ్యే యోగ్యత లేదనుకుంటే మోహినికి రెండో సారి తల్లి అయే అవకాశం లేకుండా పోయింది జయరాం పంచప్రాణాలూ బాబే ఒక్కపూట కూడా బాబును చూడకుండా ఉండలేకపోతున్నాడు ఎక్కడ కూర్చున్నా బాబు ఎలా ఉన్నాడో బాబును వదిలేసి అమ్మా కూతురు కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నారేమో అన్న ఆలోచన అతని మనస్సును తొలిచేస్తుంది

బాబును ఎ సి రూముల్లో ఉంచాలనీ అపురూపంగా పెంచాలనీ జయరాం కోరిక స్వప్న బంగళాలో అయితే అన్ని వసతులూ ఉన్నాయి ఆ బంగళాలో ఉన్న బెడ్‌రూములు ఏ సి రూములు బాబును ఇక్కడకు తీసుకు రావాలంటే బాబుతో బాటు మోహినిని ఆమెతో బాటు వాళ్లమ్మనూ తీసుకురావాలి స్వప్న ఎదుట తలెత్తుకుని తిరగాలంటేనే ముఖం చెల్లటం లేదు అతనికి ఇక వీళ్ళను ఆమెతో బాటు ఉంచటానికి అతనికి ధైర్యం చాలటం లేదు

బాబుకు అయిదు నెలలు నిండాయి అన్నప్రాసన చేయించాలి ఘనంగా జరిపించాలనుంది జయరాంకు ఆ ఇంట్లో బాబు ఉంటే పార్టీ అక్కడే జరగాలి అలా చేస్తే అందరి విమర్శలకూ గురి కావలసి వస్తుంది అదే ఇక్కడ జరిపిస్తే స్వప్న ఉంటుంది పార్టీకి వచ్చిన వాళ్ళ మనస్సుల్లో ఏమున్నా ఆ భావాలను బయటకు వ్యక్తం చేసే అవకాశం ఉండదు

జరిగిన కద– 6 స్వప్న జీవితంలో తనిక తల్లిని కాలేనని తెలుసుకొని కుమిలి పోతుంది జయరాం తన ఆపీసులో పని చేసే మోహని అనే అమ్మాయితో ప్రేమాయణం సాగిస్తున్నాడని తెలుసుకున్న స్వప్న తండ్రి ఆస్థి అంతా కూతురిపేర రాసేస్తారు అది స్వప్నకు నచ్చదు భర్త అసలు స్వరూపం తెలుసుకుంటుంది స్వప్న స్వప్న తండ్రి తల్లి మరణించారు జయరాం ప్రియురాలు మోహని గర్భవతయిందని రఘునాద్ స్వప్నకు చెపుతాడు జయరాంకు విడాకులు ఇచ్చేయమని చెపుతాడు స్వప్నకు తను అండగా ఉంటానంటాడు అతనికి తనపైనున్న ప్రేమకు చలించి పోతుంది స్వప్న మోహినిని రహస్యంగా గుళ్లో పెళ్లి చేసుకున్నాడు జయరాం మోహానిక కొడుకు పుట్టాడు

బాబుకు అన్నప్రాసన చేయించాలి స్నేహితులందరికీ పార్టీ ఇవ్వాలనుకుంటున్నాను నీ కష్టమయితే బాబును ఇక్కడకు తీసుకొస్తాను స్వప్నా అని అడిగాడు చివరకు ధైర్యం చేసి

స్వప్న క్కూడా భర్తకు ప్రతిరూపమయిన బాబును చూడాలనుంది హాస్పటల్‌లో ఉండగానే వెళ్ళి చూసొద్దాం అనుకుంది జయరాం హాస్పటల్‌కు వస్తావా? అని గానీ బాబును చూస్తావా? అని గానీ అనకపోవటంతో తానుగా వెళ్ళలేకపోయింది ఇప్పటి వరకూ బాబు ప్రస్తావన అతను స్వప్న ముందు తీసుకు రాలేదు స్వప్న కూడా బాబును చూడాలన్న కోరికను అణుచుకుందే తప్ప బాబును చూడాలనుంది అని చెప్పలేదు

మి ఇష్టప్రకారం చెయ్యండి అంది ఆ రెండో రోజే బాబుతో బాటు మోహినిని వాళ్ళమ్మగార్ని కూడా ఇక్కడకు తీసుకొచ్చాడు అక్కడ ఇల్లు కూడా ఖాళీ చేసి సామాను ఇక్కడకు తీసుకొచ్చేసాడు ఆ సామాను చూడగానే కడుపులో తెమిలినట్టనిపించింది స్వప్నకు మసితో నల్లగా ఉన్న గిన్నెలు వంకరలు పోయిన బకెట్లు నవారు మాసి కంపు కొడుతున్న మంచాలు

ఆ సామాన్లు ఈ ఇంట్లో పెట్టొద్దు పనివాళ్ళను పిలిచి తలా రెండు ఇవ్వండి అని చెప్పింది భర్తను పిలిచి స్వప్న అతని క్కూడా ఆ సామాను చూస్తుంటే చికాకుగానే ఉంది అన్నీ పనివాళ్లకు ఇచ్చేసాడు

ఎంతో ఖరీదయిన సామాను ఇక్కడుంటే ఆ తుక్కు సామానెందుకు పోతే పోయింది అనుకుంది వరలక్ష్మి

బాబుకు అన్నప్రాసన జయరాం కోరుకున్నట్టుగానే చాలా ఆర్భాటంగా జరిపించాడు దాదాపు యాభయ్యి వేల రూపాయల దాకా ఖర్చు పెట్టాడు

స్వప్న బాబుకు రవ్వలు పొదిగిన పులిగోరు పతకం పాతిక వేలు పెట్టి కొని బాబు మెడలో పెట్టింది

పార్టీకి వచ్చిన వాళ్ళంతా బాబు అదృష్టాన్ని కొనియాడటంతో బాటు స్వప్న దురదృష్టానికి సానుభూతి చూపిస్తుంటే తుప్పుపట్టిన మొండి కత్తితో గుండెను చీలుస్తున్నట్టుగా అనిపించింది స్వప్నకు

స్వప్నలాంటి ఖరీదయిన మనుష్యులకు మనసారా ఏడ్చి మనస్సు బరువు దించుకోవటాని క్కూడా వీలుండదు మనస్సులోని భావాలను ముఖంలో కన్పించనీయకుండా జాగ్రత్త పడుతూ పార్టీ పూర్తి అయే వరకూ తనను తాను నిగ్రహించుకుంది

పార్టీ పూర్తయింది ఆహ్వానితులందరూ వెళ్ళిపోయారు బాబు జయరాం చేతుల్లోనే ఉన్నాడు అప్పటివరకూ బాబును తీసుకుందామని స్వప్న వెళ్ళేపోయేంతలో అతను మోహిని వైపు నడిచాడు ప్రేమగా ఆమెకు అతను బాబు నందించటం ఆమె బాబు నందుకోబోతున్నప్పుడు తనకు దగ్గరగా వచ్చిన ఆమె ముఖం మీద జయరాం చటుక్కున ముద్దు పెట్టుకున్నాడు

జయరాం గానీ మోహిని గానీ స్వప్నను చూడలేదు అప్పుడే గదిలో నుంచి అటువైపు వెళ్ళబోయిన స్వప్న ఆ దృశ్యాన్ని చూసింది

ప్రేమను ప్రేమగానే ప్రేమించండి ప్రేమతోనే ఆరాదించండి అన్నాడు ఒక రచయిత

ఆ రచయితే మదురాతి మదుర బావనల తరంగాల హోరులో వినిపించే రాగం– ప్రేమ అన్నాడు

తాత్కాలిక ప్రయోజనాల కొంచి ప్రేమించే ప్రేమికుడు జయరాం ప్రేమ ఎ కోవకు చెందుతుందో అటువంటి ప్రేమకు బాష్యం ఏ రచయితా చెప్పలేదేమో

ప్రేమికుల హృదయమందిరాలలో అనుక్షణం పూజింపబడేది ప్రేమ అనుక్షణం ప్రేమోద్యానవనంలో విహరిస్తూ ప్రేమ పరిమళాలను వెదజల్లే స్వప్న మనస్సు ఆ దృశ్యాన్ని చూడగానే మొద్దుబారి పోయింది నిలువు గుడ్లు పడిపోయాయి

వాళ్ళిద్దరూ ఒకరికొకరు అంటుకుపోయినట్టుగా నడుస్తూ ఆమెదురుగానే గదిలో కెళ్ళి తలుపులు మూసుకున్నారు

మూసి ఉన్న ఆ తలుపులు వైపు పిచ్చిదానిలా చూసింది స్వప్న ఆమెను తనింటికి తీసుకొచ్చి తనెంత పొరపాటు చేసిందో అర్థమయింది ఆమెకు అడుగు ముందుకు పడలేదు

ఆమె కళ్ళు తెరిచే ఉన్నాయి కానీ దృశ్యాలు మసక మసకగా కనిపిస్తున్నాయి

అడుగులు బరువుగా వేస్తూ వెళ్ళి లాన్‌లో మల్లె పొద పక్కగా గార్డెన్ చెయిర్‌లో కూర్చుంది ఎదురుగా చెట్టునిండా ఎర్రగా పండిన కాయలతో కళ కళలాడుతున్న దానిమ్మ చెట్టు కనిపించింది

ప్రేమను దానిమ్మ చెట్టుతో పోల్చాడు ఒక ప్రాకృత కవి దానిమ్మ పండులోని అరలు ఒకటొకటిగా ఎర్రబడుతూ వస్తాయి అన్నీ ఎర్రబడిన తర్వాత గాని పండులో తీపి పుట్టదు ప్రేమ ఎకపక్షమయితే మాదుర్యం ఉండదు ఉబయ పక్షాలు రాగరంజితమయినప్పుడే మాదుర్యం అంటాడు ఆ ప్రాకృత కవి

గంటలు గడిచిపోతున్నాయి నీలాకాశంలోకి ఆ వెనగ్గా విశాలంగా పరుచుకున్న శూన్యంలోకి చూస్తూ కూర్చుంది స్వప్న



# ప్రేమసాగరం

ఆమె మీద బర్త ప్రబావం ఎంతగానో విస్తరించి ఉంది అతని ప్రేమ కరువయ్యేసరికి మనస్సులో ఏర్పడిన శూన్యం ఎంతో బాదాకరంగా దారుణంగా ఉంది

తనెందుకు బ్రతుకుతుందో, ఎవరి కోసం బ్రతుకుతుందో తెలియనంత నిర్లిప్తంగా నిరాసక్తంగా ఉంది

జయరాం! నిన్నెంతగా ప్రేమించాను? నన్నింత త్వరగా ఎలా మరిచిపోగలిగావు? నన్ను చేర్చుకుని దాచుకున్న ఆ గుండెల మీద మరో ఆడదాన్ని ఎలా చేర్చుకోగలిగావు? ప్రేమ ఇంత చంచలమయిందా? మగాళ్ళంతా ఇంతేనా? లేక మనస్సు చంచలమా?

జీవితం ఎంత విచిత్రమయినది? ఇప్పటి వరకూ ప్రతిక్షణం నిన్నెలా సుఖపెట్టాలని ఆలోచించాను ఈ క్షణం నుంచి నువ్వందించిన అనుభూతుల్ని నీ ప్రేమనూ ఎలా మరిచిపోవాలా అని ఆలోచిస్తున్నాను

రోజు రోజుకూ క్యాన్సరులా పెరిగే ఈ బాధను నేనెలా బరించాలి?

ఎంత మరిచిపోదామని ప్రయత్నించినా, ముద్దు సన్నివేశమే మనస్సులో మెదులుతుంది పేగులను లాగి ముక్కలుగా తరిగినా కత్తితో శరీరాన్ని తూట్లు తూట్లుగా పొడిచినా అంత బాధనిపించదేమో

సృష్టిలో ప్రేమ ఎంత చిత్రమయిందో అది మనస్సును పెట్టే హింస కూడా అంత వేదనతో నిండిందే బర్త తిరుగుబోతయినా బార్య బరించి అతనితో కాపురం చెయ్యగలుగుతుంటుంది భర్త చేసే పని ఆమె కళ్ళకు కనిపించదు ఆ ఊహ కలిగినప్పుడు మాత్రమే మనస్సు పిండినట్టుగా ఉంది

బర్తను అమితంగా ప్రేమించే బార్య, భర్త మరో స్త్రీని చేతుల్లోకి తీసుకోవటం కళ్ళారా చూస్తే ఆ బాధ భరించలేక ఆమె గుండె బ్రద్దలయి చనిపోతుంది లేదా ఆ బాధను బరిస్తూ బ్రతికే కంటే చావటమే మంచిదన్న నిర్ణయానికొచ్చి ఆత్మహత్య చేసుకుని చచ్చిపోతుంది ఈ రెండూ చెయ్యలేకపోతే ప్రేమోన్మాదిలా మారిపోయి అసూయతో తన బర్తకు చేరువయిన ఆడదాన్ని చంపి హంతకురాలవుతుంది

ప్రేమ ద్వేషంగా మారితే అసూయ మనస్సును ఆక్రమిస్తే మనిషిని ఆ స్థితికి తెస్తుంది

స్వప్నకు వాళ్ళ డాడి మమ్మి గుర్తొచ్చారు నేల మీద నడిస్తే కందిపోతాయేమో పాదాలు అన్నంత అపురూపంగా పెంచారు చీకటిని చూస్తేనే బయపడే నువ్వు ఆ చీకటిలో తోడేలు ఎదురయితే బరించగలవా అమ్మా? అన్న డాడి మాటలు గుర్తుకు వచ్చి రెండు చేతుల్లో ముఖం దాచుకుని కుమిలి కుమిలి ఏడ్చింది ఏడ్చి ఏడ్చి ఆమె కళ్ళలో నీళ్ళు ఇంకిపోయాయే తప్ప ఆమె గుండె మంట మాత్రం చల్లారలేదు




★ ★ ★ ★ ★

జయరాం బయట నుంచి రావటం ఆలస్యం బాబు నెత్తుకుని వరండాలో బాబుతో ఆడుకుంటూ కూర్చుంటాడు బాబు నిద్రపోయిన తర్వాతనే స్నానం బోజనం ఇప్పుడు ఆరు గంటలకల్లా ఇంటికొచ్చేస్తున్నాడు రాత్రి తొమ్మిది వరకూ బాబుతోనే సరిపోతుంది అతను బాబుతో కల్సి ఉన్నంత వరకూ మోహిని అతని ప్రక్కనే ఉంటుంది స్వప్న మనస్సు ఆ సమయంలో ఎంత తీవ్రమైన వేదనకు గురవుతుందో మాటలతో చెప్పనలవి గాదు ఆ నరకయాతన అనుబవించలేక ఆ చాయలక్కూడా రాదు

స్వప్న ఇంట్లో ఉంటున్నాడు ఆమె ఆస్థిని అనుభవిస్తున్నాడు ఆమె కారులో తిరుగుతున్నాడు ఆమె మూలంగా ఆస్థినీ హోదాను పెంచుకున్నాడు ఆమె దయాదాక్షిణ్యాల మీద బ్రతికే అతను [illegible]కు ప్రతిపలంగా అనుక్షణం ఆమె గుండెను గాయం చేస్తున్నాడు

మగాడు శరీరానికి ఇచ్చే విలువ ప్రేమకివ్వడు ఇప్పుడు అతనికి కావలసిన సుఖం మోహిని అందిస్తుంది అందుకని అతని మనస్సు మోహిని వైపే మొగ్గు చూపుతుంది స్వప్న బాదపడుతుందన్న ఆలోచన అతనికి రావటంలేదు

పగలూ రాత్రి పదకొండు గంటల వరకూ అతను మోహినితో బాబుతో గడిపినా నిద్ర మాత్రం అంతకు ముందులా స్వప్న బెడ్ రూములో డబల్ కాట్ మీద స్వప్న పక్కనే పోతాడు అతని బెడ్ రూము మాత్రం స్వప్న రూమే గుడ్డి కంటే మెల్ల నయం అన్నట్టుగా కొంతలో కొంత ఓదార్పుగా ఉంది స్వప్నకు మేడ మీదుంటుంది స్వప్న బెడ్ రూము కిందున్న బెడ్ రూమ్ ఒకటి మోహిని మరో బెడ్ రూమ్ వాళ్ళమ్మ వరలక్ష్మి ఉపయోగించుకుంటున్నారు రెండు బెడ్ రూమ్‌లూ ఏ సి రూములే ఇంట్లో పనులు చెయ్యటానికి నలుగురు నౌఖర్లున్నారు అమ్మా కూతురు పనివాళ్ళ మీద అజమాయిషి చెయ్యటం వాళ్ళకు కావలసిన వంటకాలు వండించుకుని సుష్టుగా తినటం ఇది వాళ్ళు చేసే పని

నౌఖర్లు నలుగురూ స్వప్న చిన్నతనం నుంచి ఆ ఇంట్లో పనిచేసేవాళ్ళే వాళ్ళు తమ యజమానురాల్ని ఎంత బాదపెడుతున్నారో వాళ్ళకు తెల్సు అమ్మా కూతురు కనిపిస్తేచాలు కత్తుల్లాంటి చూపులతో నిర్లక్ష్యంగా చూస్తారు వాళ్ళిద్దర్ని జయరాం అంటే బయం వీళ్ళిద్దరూ ఆయనకు సంబందించిన మనుష్యులు కావటంతో మనస్సుల్లో ఎంత అయిష్టం ఉన్నా వాళ్ళిద్దరి మాటా వినక తప్పటంలేదు వాళ్ళకు

జయరాంతో బాటు మోహిని బోజనానికి కూర్చుంటుంది వరలక్ష్మి ఇద్దరికి వడ్డిస్తుంది ఆ విషయం మాత్రం జయరాంకు బాదగా ఉంటుంది ఏ రోజు కా రోజు తనకంటే ముందుగానో లేక తను బోంచేసిం తర్వాతనో బోంచెయ్యమని మోహినికి చెప్పాలనుకుంటాడు చెప్పలేకపోతాడు అలాగే వారాలు నెలలు గడిచిపోతున్నాయి

క్రమంగా అలవాటుగా మారిపోయింది ఆ విషయాన్ని గురించి ఆలోచించటం మానేసాడు జయరాం స్వప్న మాత్రం ఆ బాదను మనస్సులో నుంచి తీసేయలేక పోయింది రోజూ జరుగుతున్న విషయమే అయినా ఆ బాద ఎప్పటికప్పుడు కొత్తగానే ఉంటుంది స్వప్నకు

ఆ డైనింగ్ టేబుల్‌ను కుర్చీలను ప్రత్యేకంగా స్వప్న కోసం వాళ్ళ డాడీ జైపూర్ నుంచి తెప్పించారు మోహిని ఆ టేబుల్ మీద బోంచెయ్యటం మొదలుపెట్టిం తర్వాత మళ్ళీ ఆ టేబులు మీద స్వప్న బోంచెయ్యలేదు మాదవరావుగారు కూతురు సుఖం కోసం ఎంతో కూడబెట్టారు అవన్నీ మోహినీ వాళ్ళమ్మగారు అనుబవిస్తున్నారు

కాలం అన్ని గాయాలను మాన్పుతుందంటారు స్వప్న విషయంలో మాత్రం అందుకు వ్యతిరేకంగా జరుగుతుంది ఒక్కో రోజు గడిచేకొద్దీ ఆమె గుండెల్లోని గాయం కెలుకుతున్నట్టే అవుతోంది తప్ప మానటం లేదు

స్వప్న రోజంతా వంటరిగా తన బెడ్‌రూములో గానీ పూలమొక్కల మధ్యగానీ గడుపుతుంది ఆ పూలతోనే మాట్లాడుతుంది వాటితోనే కాలక్షేపం చేస్తుంది

ఏడుస్తూ బయటకొచ్చింది వంట చేసే రాములమ్మ స్వప్న కూర్చున్న దగ్గరకు

## ప్రేమసాగరం

ఏం జరిగింది రాములమ్మా? ఎందుకేడుస్తున్నావు?

నేనీ ఇంట్లో పని చెయ్యలేనమ్మగారూ? వెళ్ళిపోతాను అంటూ బావురుమంది రాములమ్మ

అసలేం జరిగిందో చెప్పు

ఈ పూట పప్పుచారు పెట్టి నంజుకోవటానికి ఎండు చేపముక్కలు వేయించమని చెప్పారమ్మా ఆ వరలక్ష్మిగారు నేను పప్పుచారు పెట్టి కొబ్బరి చట్నీ గుత్తి వంకాయ కూర చేసాను అయ్యగారూ, మీరూ ఇద్దరూ చేపల కూర తినరు ఆ వాసన కూడా మీరు భరించలేరు అందుకని ఎండు చేప ముక్కలు వేయించలేదు ఎందుకు వేయించలేదనడిగితే ఈ విషయం చెప్పాను నా మాటకు ఎదురు చెబుతావా అంటూ టేబులు మీదున్న కూరగిన్నె నా ముఖానికేసి కొట్టిందమ్మగారూ అంది ఏడుస్తూ రాములమ్మ

రోజు రోజుకూ పనివాళ్ళ మీద పెత్తనం చలాయించటం వరలక్ష్మి ఎక్కువ చేస్తుందని స్వప్న గ్రహించినా ఆమెతో మాట్లాడటం ఇష్టం లేక పట్టించుకోకుండా ఉంటుంది రాములమ్మ స్వప్న పుట్టుక ముందు నుంచి వాళ్ళింట్లో పని చేస్తుంది చాలా నెమ్మదయినది ఇంట్లో ఒక మనిషిలా కల్సిపోయింది అటువంటి మనిషి మీద కూరగిన్నె విసిరిందని చెప్పేసరికి వళ్ళు మండిపోయింది స్వప్నకు విసురుగా లేచి లోపల కొచ్చింది

వరలక్ష్మి ప్లేటు నిండుగా లడ్డూలు పెట్టుకుని డైనింగ్ టేబులు ముందు కూర్చుని తింటుంది

వరలక్ష్మిగారూ! ఖంగుమంది స్వప్న గొంతు బిత్తరపోయి చూసింది వరలక్ష్మి ఆమె వైపు

ఈ ఇంట్లో పనివాళ్ళు ఎప్పటి నుంచో మా ఇంట్లో పని చేస్తున్నారు మీకు లేని అధికారాన్ని వాళ్ళ మీద చూపించొద్దు గిన్నెలు విసరటం గరిటెలు విసరటం లాంటి అలవాట్లు ఈ ఇంట్లో ఇప్పటి వరకూ లేవు మీకు అవసరమయినవి చెప్పి చేయించుకోండి అంతేగాని ఇంకెప్పుడూ ఇలా ప్రవర్తించవద్దు అంది

ఏమిటమ్మా నీ ఇంట్లో ఉంటున్నామని నీ నోటి కొచ్చినట్టు మాట్లాడుతున్నావు ఈ ఇంట్లో నీ కెంత అధికారముందో మాకు అంతే అధికారముంది పనిమనిషి అయింది నేను చెప్పింది చెయ్యాలా? లేదా? అంది చేతులు తిప్పుతూ గొంతు చించుకుని అరుస్తూ

ఈ ఇంట్లో నీ కధికారం ఉందని ఎవరు చెప్పారు? నేను తలుచుకుంటే ఈ నిముషంలోనే మిమ్మల్ని ఇక్కడ నుంచి పంపించెయ్యగలను హద్దు మీరి మాట్లాడటం మంచిదికాదు మీ విలువేమిటో తెల్సుకుని ప్రవర్తించటం మంచిది అంటూ ఆమెతో సంభాషణ పొడిగించటం ఇష్టం లేనట్టుగా అక్కడ నుంచి తన గదిలో కెళ్ళింది స్వప్న

దాదాపు గంటసేపు వరకూ పెద్దగా అరుస్తూనే ఉంది వరలక్ష్మి ఆ అరుపులు స్వప్నకు వినిపిస్తూనే ఉన్నాయి

ఏడుస్తూ పడుకుంది స్వప్న ముభావంగా ఉండటం అలవాటయింది కాబట్టి ఆమెలోని మార్పు జయరాం గమనించలేదు అతనింటికొచ్చే వరకూ వరలక్ష్మి అరుస్తూనే ఉంది ఆమె నోరు తెరిచిందంటే కొన్ని గంటల వరకూ మూతపడదు

జయరాం మోహిని బెడ్ రూములో కొచ్చి మీ అమ్మగారెందుకు అంత పెద్దగా అరుస్తున్నారు? అన్నాడు మోహిని విసురుగా ముఖం తిప్పుకుంది

ఏం జరిగింది మోహినీ?

మమ్మల్ని ఆ ఇంట్లోనే ఉంచితే సరిపోయేదిగా? ఇక్కడికెందుకు తీసుకురావటం? అంది

ఏమయిందిప్పుడు?

మీ భార్యగారు మమ్మల్ని పని మనుష్యుల కంటే హీనంగా చూస్తుంది మేము పనివాళ్ళను ఏమీ అనకూడదంట వాళ్ళకు ఏ పనీ చెప్పకూడదంట పనిమనిషిని మా అమ్మ ఏదో చెయ్యమన్నదని మీ ఆవిడగారు మా అమ్మని అనరాని మాటలంటుంటే వింటూ ఊరుకున్నాను చివరకు ఈ ఇంట్లో నుంచి కూడా పంపించేస్తానంది

స్వప్నకు సామాన్యంగా కోపం రాదు ఆ విషయం జయరాంకు తెల్సు మోహినితో సంబంధం పెట్టుకోనంత వరకూ తామిద్దరి మధ్యా చిన్న గొడవ కూడా రాలేదు స్వప్న అలిగితే, ఆమెకు కోపం వస్తే చూడాలని అతనికో కోరికగా ఉండేది

పెద్దగా మాట్లాడటం కూడా అలవాటులేని స్వప్న అలా మాట్లాడిందంటే అతనికి నమ్మబుద్ధి కాలేదు

అయినా పనివాళ్ళతో మీ అమ్మ కెందుకు? అన్నాడు

అంటే మీరు కూడా మా అమ్మదే తప్పంటున్నారా?

మోహినీ! మీరుంటున్నది స్వప్న ఇంట్లో పనివాళ్ళంతా ఆమెను దేవతలా చూస్తారు వాళ్ళను కూడా ఆమె అంతే అభిమానంగా చూస్తుంది తింటూ కూర్చోకుండా మీ అమ్మకు ఈ గొడవలన్నీ ఎందుకు? అన్నాడు విసుగ్గా

అవునులెండి మీ భార్య మీకు దేవత ఆమె మీద ఈగ వాలటం కూడా మీరు సహించలేరు మేము మీ దయాదాక్షిణ్యాల మీద ఆధారపడి బ్రతుకుతున్న వాళ్ళం మీ ఆవిడే కాదు పనివాళ్ళు అన్నా పడుండాలి అంది ముక్కు చీదుతూ

నేను అనేది ఒకటి నువ్వర్థం చేసుకునేది ఒకటి మీకు కావాల్సినవి చేసుకుని తిని, హాయిగా ఉండే దానికి ఈ సమస్యలన్నీ సృష్టించుకోవటం






ఎందుకంటున్నాను

జయరాంకు చికాకుగా విసుగ్గా ఉంది మోహిని సాదిస్తూనే ఉంది వింటూ శిలలా కూర్చున్నాడు జయరాం

ఆ రాత్రి అతనికి భోజనం కూడా చెయ్యాలనిపించలేదు బెడ్‌రూములో కొచ్చేసరికి స్వప్న కిటికి కెదురుగా కూర్చునుంది ఆమె ముఖంలోకి చూడటానికూడా సిగ్గనిపించి బెడ్ మీద పడుకున్నాడు

ఆమె జరిగింది తనతో చెప్పి బాధ పడినా బాగుండు తను అనునయించగలడు గంభీరంగా తపస్విలా కూర్చున్న ఆమెను పలకరించటానికే ధైర్యం చాలటం లేదు స్వప్నా అని పిలవాలనుకున్నాడు ఆ పిలుపు పెదవులు దాటి రాలేదు

ఆమె వైపు పరిశీలనగా చూసిన జయరాంకు మనస్సు పిండినట్టనిపించింది ఏ క్షణంలో చూసినా చెరగని చిరునవ్వుతో సెలయేరులా గలగలలాడుతూ ప్రపంచంలోని సంతోషమంతా తన స్వంతమే అన్నట్టుగా ఉండే స్వప్న సర్వసం కోల్పోయిన దానిలా జీవం లేని చూపులతో చలనరహితంగా కూర్చునుంది

స్వప్నా! పిలిచాడు ఆర్ద్రతగా

ఊ నూతిలో నుంచి పలికినట్టుగా ఉంది ఆమె గొంతు

భోం చేసావా?

అతని వైపు తిరిగి చూసింది ఆ చూపుల్లో ఎన్నో భావాలు ఆ భావాలు అర్థమయినా సమాధానం చెప్పలేదు అతను ఆమె కళ్ళలో పలికించిన ప్రశ్నలన్నిటికి సమాధానంగా తనను క్షమించమని కళ్ళతోనే సమాధానం చెప్పాడు

భోం చెయ్యలేదు కదూ?

నటనలో మళ్ళీ ఇదొక కొత్తరకమయిన నటనా?

నాది నటనగా కనిపిస్తుందా స్వప్నా?

ప్రేమ నటించే నన్ను పెళ్ళి చేసుకున్నారు ప్రేమ నటించే నన్ను మోసం చేసి సెకండ్ వైఫ్‌ను పెట్టుకున్నారు ప్రేమ నటించే ఆమెను బంధుమిత్ర సపరివార సమేతంగా ఇక్కడకు చేర్చారు మీరు ప్రేమగా స్వప్నా అని పిలిచారంటే ఈ నటన జరగబోయే ఏ కార్యానికి నాంది అనిపిస్తుంది ఇంత మృదువుగా తీయగా పలకరించారంటే అందుకు తప్పకుండా ఏదో ఒక కారణముంటుంది చెప్పండి డబ్బు కావాలా? అంది

ఆమె మాటలు శూలాల్లా గుచ్చుకుంటున్నాయి అతనికి

ఎంత కావాలి?

నా మీద నీకు నమ్మకం పోయింది స్వప్నా! నేనేం చేసినా ఏం మాట్లాడినా నీకు నటనగానే అనిపిస్తుంది నువ్వు నన్ను నీ కోపం పోయే వరకూ తిట్టు సాదించు అంతే గాని ఇలా మవునంగా ఉండొద్దు నీ మవునం నా మనస్సును రగిలిస్తుంది

బుజంమిదుగా తలతిప్పి వింతగా ఆశ్చర్యంగా చూసిందతని వైపు

ఎంతసేపలా కూర్చుంటావు? వచ్చి పడుకో

నిద్రరావటం లేదు

బాల్కనీలో కూర్చుందామా? వెన్నెలగా ఉంది వెన్నెలంటే నీకిష్టంగా?

వెన్నెలలో మీతో కల్సి గడపటం

నాతో నే ఉంటావుగా? కూర్చుందామా?

నా ఇష్టాఇష్టాలు మీకింకా జ్ఞాపకమున్నాయా?

మాటలతో నన్ను బాధ పెట్టటం నీకు సంతోషంగా ఉంటే అలాగే బాధ పెట్టు స్వప్నా హిమాలయాలంత ఎత్తుకు ఎదిగిపోయిన నీ వ్యక్తిత్వం ముందు నిన్ను తలెత్తి చూడలేని స్థితిలో ఉన్నాను నేను

మాటలతో మభ్య పెడుతూ ఇంకా నన్నెందుకు పిచ్చిదాన్ని చేస్తారు? అంటూ రెండు చేతుల్లో ముఖం దాచుకుంది స్వప్న ఏడుస్తూ ఆమె ఏడుపు అతని మనస్సును కలిచివేసింది

తనేం మాట్లాడినా ఆమె బాధ మరింత అధికం అవుతుందని చూస్తూ పడుకున్నాడు జయరాం స్వప్న గుండె బరువు తగ్గే వరకూ ఏడ్చి ఏడ్చి అలసిపోయింది ఎప్పుడో తెల్లవారు జామున కలత నిద్రపోయింది

(ఇంకా ఉంది)




కె ఎ ఎల్–కర్నూలు

నా వివాహము జరిగి 2 సం అయినది కాని ఇంతవరకు సంతానము కలుగలేదు డి ఎన్ సి ఆపరేషను ద్వారా సంతానము కల్గుతుందని అంటారు ఇది నిజమా అసలు డి ఎన్ సి ఆపరేషను అంటే ఏమిటి? ఇది చేయించుకుంటే నిజముగా సంతానము కలుగుతుందా?

డి అండ్ సి (డైలటేషన్ అండ్ క్యూరటాజ్) చేసినంత మాత్రాన సంతానం కలుగుతారని ఏమీ లేదు గర్భాశయంలోని లోపలి గోడలను కప్పి ఉంచే పొరలను ఒక ఆయుధం ద్వారా గిసి చాలా మటుకు తీసివెయ్యటమే ఆపరేషన్‌లో జరిగే చర్య హార్మోనుల పనితనానికి ఈ పొర పెరుగుదలకీ దగ్గర సంబంధం ఉంటుంది ఈ పొరలను పరిశీలించి, హార్మోనుల పనితనాన్ని పిల్లలు కలిగే అవకాశం ఉన్నదీ లేనిదీ అనే దాన్ని లేడీ డాక్టర్లు నిర్ణయిస్తారు

కె ఆర్ ఎమ్ , బళ్ళారి

నా వయస్సు 25 సం లు మా ఇంట్లో మా తాతగారి నుండి నా వరకు దృష్టి లోపము వలన అందరము పవర్‌ఫుల్ అద్దాలు వాడుచున్నాము ఇప్పుడు నాకు పెండ్లి చేయవలయునని ఇంట్లో చాలా బలవంతం చేయుచున్నారు మా ఇంట్లో వారందరికి మా మేనమామ కూతుర్ని నాకిచ్చి చేయవలెనని నిశ్చయించుకున్నారు కానీ నాకు మా బంధువుల ఇంట్లో వివాహము చేసుకొనుట ఇష్టము లేదు ఒక వేళ అట్లు చేసుకొన్నట్లయితే పుట్టబోవు బిడ్డలు కూడా దృష్టిలోపముతో పుడతారేమోనన్న అనుమానము

ఇష్టంలేని పెండ్లి చేసుకోకండి రోగం పిల్లలకి వస్తుందేమో అని అనుమానంతో అవస్థపడే బదులు అలా చేయకపోవడమే ఉత్తమం వైద్యరీత్యా కూడా అదే మంచి పద్ధతి

కె పి గౌడ్ , జగిత్యాల

నేను సన్నగా వుంటాను నాకు ఊహ తెలిసినప్పటి నుంచి సన్నగానే వున్నాను నా వయసు 18 సంవత్సరములు నేను లావు కావాలంటే ఏ మందులు వాడాలి? స్వీట్స్ తింటే లావు అవుతారని కొందరంటున్నారు అది నిజమేనా? ఏ పాళ్ళలో ఏ రకమైన స్వీట్స్ తీసుకోవాలి?

లావు అవటానికి మందులు లేవు మాంసకృత్తులు (ప్రొటీన్లు) అధికంగా గల ఆహారపదార్థాలు అంటే పప్పుదినుసులు పాలు గ్రుడ్లు, మాంసము మొదలయిన వాటిని వాడి చూడండి కొందరు పై వాటిని ఎంత వాడినా లాభం పొందరు కొందరి శరీర తత్వం అలాగే ఉంటుంది కొందరికి వయస్సు మీరేకొద్దీ శరీరం లావు అవుతుంది కొందరికి, వివాహం తర్వాత శరీరం పెరుగుతుంది వీటికి హార్మోనుల ప్రభావం కారణం అని నిపుణుల అంచనా □

# నిరీక్షణ

## వై. మురళీకృష్ణ

రాత్రి ఎదకొండు అవుతోంది దేవీ చౌక్ సెంటర్‌లో సందడి పూర్తిగా తగ్గి పోయింది ఒకటి రెండు షాపులు మాత్రమే తెరిచి వున్నాయి

వస్తూన్న నిద్రను బలవంతంగా ఆపుకొన్న విద్యాదర్ టైము చూసుకొని కుర్చీ లోంచి లేచాడు ఆసెంటర్‌లో వున్న ఒకే ఒక్క మెడికల్ షాపది బద్ధకంగా ఒక్కొక్కటే సర్దసాగాడు అంతా సర్దేసరికి పావుగంట పట్టింది లైట్స్ ఆప్ చేసి షాపు బయటికి వచ్చి షట్టర్స్ క్లోజ్ చేసాడు లాక్ చేసి అంతాసరిగ్గా వుందో లేదో చూసుకొని స్కూటర్ దగ్గిరికి వచ్చి స్టార్ట్ చేశాడు స్టార్టవలేదు రెండో సారి ప్రయత్నించాడు

తనకోసం ఎదురు చూస్తూ వుంటుంది సాహిత్య పదకొండున్నర అయిపోతోంది

స్టార్ట్‌కాని స్కూటర్ మీద కోపం వచ్చింది విద్యాదర్‌కి ట్రబులెక్కడో పరిక్షించడం మొదలు పెట్టాడు

షాప్ క్లోజ్ చేసే శారా?

తల వెనక్కి తిప్పి చూశాడు విద్యాదర్ ఒకామె ఆయాసంతో రొప్పుతూ నిలబడి వుంది చాలా కంగారుగా వచ్చినట్లు తెలిసి పోతోంది

క్లోజ్ చేసేశాం జవాబు చెప్పి తలతిప్పేసుకొన్నాడు

స్కూటర్ మళ్ళీ స్టార్టు చేశాడు

స్టార్టయింది

ఆమెలో కంగారు హెచ్చింది

ప్లీజ్ వెళ్ళిపోకండి ఈ మందు చాలా అర్జెంట్ స్కూటర్ హోరులో అతనికి వినబడదేమోనని గట్టిగా అందామె

సారి మేడమ్

గేరు మార్చి స్కూటర్‌ని ముందుకి పోనిచ్చాడు

మళ్ళీ తాళాలు తీసి లైట్స్‌వేసి అనవసరం అనుకొన్నాడతడు

మలుపు తిరుగుతూ అసంకల్పితం గానే షాపు కేసి చూశాడు అక్కడ్నుంచి షాప్ కనబడు తుంది సడెన్‌గా అతని స్కూటర్ కి బ్రేకుపడింది

షాప్ మెట్ల మీద నిస్సహాయంగా కూలబడి పోయినట్లుగా వుందామె

విద్యాదర్ స్కూటర్‌ని వెనక్కి తిప్పాడు దగ్గిరవుతోన్న స్కూటర్ శబ్దానికి ఆమె తలఎత్తి చూసింది లేచి నుంచొంది

స్కూటర్ స్టాండ్ వేశాడు

తాళం తీసి షట్టర్స్ ఓపెన్ చేసి లైట్లు వేశాడు

చీటి ఇలా యివ్వండి

వణుకుతూన్న చేతులో ఇచ్చిందామె

మందు తెచ్చి ఇచ్చాడు డబ్బులు తీసుకొంటూ ఆమె మొఖం కేసి చూశాడు

కళ్ళక్రింద కారిన నీటి చారికలు స్పష్టంగా కనిపించాయి

చాలా ధ్యాంక్సండి

కృతజ్ఞతా బారంతో ఆమె గొంతు గాద్గదికమైంది

చాలా ధ్యాంక్స్ అని ఇంకో సారి చెప్పి ఆమె వడి వడిగా నడుస్తూ వెళ్ళి పోయింది

షాప్ క్లోజ్ చేసేసాడు

స్కూటర్ స్టార్ట్ చేసి స్పీడ్‌గా ఇంటికి పోనిచ్చాడు

ఇల్లుగలావిడ వీది తలుపు వేసేసింది తలుపు తట్టాడు ఆవిడ నిద్ర నుంచి లేచివచ్చి తలుపు తీసింది

అతనొక్కడే వుండడం చూసి అడిగింది

సాహిత్య ఏది బాబూ?

సాహిత్య స్కూల్ నుంచి ఇంకా ఇంటికి రాలేదా?

నువ్వు స్కూల్‌కి వెళ్ళలేదా? ఆవిడ ఆశ్చర్యపోతూ అడిగింది

పంక్షన్ పదకొండింటికి అయిపోతుంది కదా ఈ పాటికి ఇంటికి వచ్చేసి వుంటుందని నేను స్కూల్‌కి వెళ్ళలేదు స్కూటర్ స్టార్టుచేసి స్కూల్ వైపు వేగంగా పోనిచ్చాడు

స్కూల్లో అందరూ వెళ్ళిపోయారు

పంక్షన్ గురించి ఏర్పాటు చేసిన సామానంతటిని సర్దుతున్నారు అయిదారుగురు

కుర్చీలు సరిగ్గా వున్నాయోలేదో లెక్క చూసుకొంటున్న ఒకాయన్ని అడిగాడు విద్యాదర్

అంతా వెళ్ళిపోయారా?

ఆవ్యక్తి విద్యాదర్ వేపు ఒక్కక్షణం చూసి ఆఫీస్ రూమ్‌లో హెడ్మాస్టరు గారున్నారు అని సమాధానం చెప్పి తిరిగి తన పనిలో మునిగి పోయాడు

ఆఫీస్ రూమ్ దగ్గరికి పరుగెత్తాడు

సార్ మా పాప ఇంకా ఇంటికి రాలేదు

సాహిత్యేనా మీ పాప?

ఆ ఉద్వేగంతో అన్నాడు

సారి మీపాప మేడమెట్ల మీది నుంచి జారి పడింది హాస్పిటల్‌కి తీసుకు వెళ్ళాం కంగారుపడకండి పెద్ద దెబ్బలేమి తగల్లేదు వెంకట్ హాస్పిటల్లో జాయిన్ చేశాం

ఆగలేదు విద్యాధర్

వెంకట్ హాస్పిటల్ ముందు స్కూటరాపి లోపలికి పరుగెత్తాడు నర్సుకి వివరాలు చెప్పి రూమ్ నెంబర్ అడిగాడు చెప్పింది నర్స్

రూమ్ దగ్గరికి పరుగెత్తాడు

సాహిత్య బెడ్‌పై స్పృహలేని స్థితిలో వుంది ప్రక్కనే స్టాండుకి అమర్చిన సెలైన్ బాటిల్ లోంచి ఒక్కొక్క చుక్క సాహిత్య శరీరంలోకి ప్రవేశిస్తోంది

డాక్టర్! పాపకెలా వుంది డాక్టర్? కంగారుగా అన్నాడు విద్యాదర్

ఏం ఫర్వాలేదు మీరేం వర్రీ కాకండి ధైర్యం చెప్పాడు డాక్టర్ షి విల్ బి ఆల్‌రైట్

విద్యాదర్ మనస్సు కొంచెం కుదట పడింది అక్కడే వున్న బల్లపై నిస్సత్తువగా కూలబడ్డాడు

సాహిత్య వదనం ప్రశాంతంగా వుంది

ఆ చిన్ని ప్రాణానికి ఏం జరిగినా బరించలేడు తను తన జీవితానికి మిగిలిన ఒకే ఒక్క తోడు సరళ మిగిల్చిన జ్ఞాపకానికి రూపం ఎవరో ఒకరిపై ఆత్మీయత లేకుండా బ్రతకడం కష్టం ఎవరో ఒకరి ప్రేమ పొందలేని బ్రతుకు వ్యర్థం తనకి సాహిత్య సాహిత్యకి తను

అతని చూపు అదే బల్లపై కొంచెం దూరంగా కూచుని సాహిత్యకేసి చూస్తూవున్న ఒకామెపై బడింది

సరిగ్గా అరగంట క్రితం మందుకోసం వచ్చిన స్త్రీ ఆమె

★ ★ ★ ★

కాలింగ్ బెల్ గట్టిగా శబ్దం చేస్తూ మ్రోగింది ఎదుకొని వున్న విశారద లేచి టైమ్ చూసింది ఉదయం ఎది గంటలయింది

వెళ్ళి తలుపు తీసింది

విద్యాదర్

మీరా? ఆమె నిద్రమత్తు వదిలింది పక్కకి తప్పుకొని రండి లోపలకు అని ఆహ్వానించింది

కూర్చోండి

కూర్చున్నాడు విద్యాదర్

ఇంట్లో ఎవరూ లేనట్లున్నారు? గొంతు పెగల్చుకొని అన్నాడు

ఎవరూ లేరు నేనొక్కతినే

ఆమె మొఖం కేసి చూశాడు విద్యాదర్ చప్పున లేచి సారి మీ నిద్ర డిస్టర్బ్ చేసినట్లున్నాను అని నొచ్చుకొంటూ అన్నాడు

ఫర్వాలేదు కూచోండి వస్తాను అంటూ ఆమె లోనికి వెళ్ళింది

విద్యాదర్ తన్ను తాను తిట్టుకొన్నాడు

తనతో పాటు రాత్రంతా కూడా ఆమె మేలుకొనే వుంది

కాపి తెచ్చి ఇచ్చింది విశారద

మొఖం కడుక్కొన్నట్లుంది– ప్రెష్‌గా వుంది

ఇబ్బందిగానే తీసుకొన్నాడు కాపి

పాప ఎలా వుంది?

బానే వుంది మిమ్మల్నొకసారి చూడాలని

వుంచట రమ్మంది

సాయంత్రం వస్తాను చిరునవ్వుతో అందామె

చాలా కృతజ్ఞతలండి మీరు మా పాప గురించి పడిన శ్రమకి మీ ఋణం తీర్చుకోలేను

నో మెన్షన్ క్లుప్తంగా అందామె

ఆమెను చూస్తుంటే విద్యాధర్‌కి ఏదో ఇబ్బంది కరమైన ఫీలింగ్ కలుగుతోంది ఇబ్బందిగా ఫీలవుతున్నాడు

వస్తానండి లేచాడు

చిరునవ్వుతో తల వూపింది ఆమె

లేచి తలుపు గుమ్మం దాటబోతూ ఆగాడు వెనక్కి తిరిగాడు

ఆమె అతనికేసి చూస్తోంది

ఇంక అతను తన మనసుని నొక్కి పట్టలేకపోయాడు సాహిత్యకి తల్లి లేదు నా గురించి ఎదురు చూస్తూ ఒంటరిగా వుంటుందని షాప్ మూసేసి వెళ్ళబోతూండగా మీరు వచ్చారు మళ్ళీ షాప్ తెరవాలంటె అతను ఆగాడు

క్షమించండి స్పష్టంగా అన్నాడు

నేను అర్థం చేసుకొన్నాను నెమ్మదిగా అంది విశారద

* * * *

సాయంత్రం అయిదయింది స్కూల్ విడిచిపెట్టారు విశారద సాహిత్య ఇంటి వేపు నడప సాగింది

సాహిత్య క్లాసులో అందరికన్నా బాగా చదువుతుంది అని సాహిత్యపై తనకి అభిమానం ఏర్పడలేదు మిగతా పిల్లలందరూ టీచర్ అనే గౌరవం ఇస్తారు కాని సాహిత్య ఎందుకో చాలా అభిమానంగా మాట్లాడుతుంది ఒక్క రోజు స్కూల్‌కి తను వెళ్ళకపోతే మర్నాడు అడుగుతుంది

ఇంటి తలుపు తట్టింది విశారద

తలుపు తెరుచుకొంది విశారదని చూసి విద్యాధర్ మొహం విప్పారింది

రండి!

సాహిత్య ఏది?

బెడ్ రూమ్‌లో వుంది రండి

టీచర్‌ని చూడగానే సాహిత్య మొహం విప్పారింది

మీరు వస్తారో రారో అనుకొన్నాను టీచర్

రాకుండా వుండగలనా? ఇపుడు ఒంట్లో ఎలా వుంది?

బానే వుంది టీచర్!

గుడ్!

విద్యాధర్ కాఫీ తెచ్చి ఇచ్చాడు

మీరు రాత్రంతా నా దగ్గిరే నిద్రలేకుండా వున్నారట కదా టీచర్? అడిగింది సాహిత్య

ఎవరు చెప్పారమ్మా!

డాడీ అని చెప్ప మళ్ళీ అంది

మిమ్మల్ని చాలా శ్రమ పెట్టాను కదండి టీచర్?

ఏమి శ్రమ పెట్టలేదు ఇలాంటి వేమి ఆలోచించకు! తలమీద చేయి వేసి నిమురుతూ చెప్పింది విశారద

కాస్సేపుండి లేచింది

వస్తాను సాహిత్యా!

అలాగే టీచర్!

వీధి గుమ్మంవరకూ వచ్చాడు విద్యాధర్

వస్తానండి!

ఒక్క క్షణం ఆగండి

ఆగింది నెమ్మదిగా అన్నాడతను



ఎందుకో ఇంట్లోకి మీ వస్తే బాగుంటుందని పిస్తోంది

అతని వుద్దేశ్యం ఆమెకి అర్థమయింది

వస్తాను!

వడివడిగా వెళ్ళిపోయిందామె

* * * *

స్కూల్ గేటు దాటి బయటికి వచ్చిన విశారద అక్కడే వున్న విద్యాధర్‌ని చూసి ఆగింది

ఆమె దగ్గిరికి వచ్చాడు

# ఐహికం-ఆముష్మికం

## ధర్మపథం



సంసారం నిర్వహిస్తున్నవారందరికీ ఐహికాముష్మికాలు రెండూ కావలసినవే! జన్మించిన మానవుడు కేవలం ఆధ్యాత్మిక చింతలోనే పడి వుంటే యోగిగా మారవలసిందే! అది అందరికీ సాధ్యం కాదు ఏ కొద్ది మందో అట్టి వారు ఉంటారు మిగిలిన వారందరూ బాల్య కౌమారాలు గడిచాక గృహస్థులై దనం సంపాదించి, గృహస్థ దర్మాలను నిర్వహిస్తూ లౌకిక సుఖాలు అనుభవిస్తారు గృహస్థాశ్రమంలో ఉన్నప్పుడు కూడా ధైవచింతన, గృహ దేవతా పూజ, అతిధి సత్కారం మున్నగునవి కూడా ఆచరణీయాలే కాని విడువ దగినవి కావు। వయస్సు మళ్ళిన పిదప, సంసార బాధ్యతలను క్రమంగా తొలగించుకొని ఆముష్మికాన్ని గురించి ప్రయత్నించవలసి ఉన్నది ఆగర్భ శ్రీమంతులు మొదలుకొని అందరూ ఇలా చేయవలసిందే! పూర్వం రాజాదిరాజులు కూడా ఈ పద్ధతినే అవలంబియే ఉన్నట్లు మన గాథల వల్ల తెలుస్తున్నది జన్మించిన వారికి ఎప్పుడో ఒకప్పుడు అంతం కూడా తప్పదు ఈ జన్మలోని పాప పుణ్యాల ఫలాలను అనుభవించడానికి జన్మాంతరం తప్పదని అనేక మంది తత్త్వ వేత్తల సిద్ధాంతం జన్మ పరంపరలు కలుగకుండా ముక్తి కోసం ప్రయత్నించటం అవసరం దానికి ఆత్మ చింతన, పరమార్థ తత్త్వ గవేషణ ప్రధానాలు

పాశ్చాత్య విద్యలో ఆరితేరి ఉన్నత పదవులను నిర్వహిస్తూ తీరిక లేని ఇంజనీర్లు డాక్టర్లు మున్నగు వారు కూడా, ఉన్న స్వల్పావకాశంలోనూ పారమార్థిక చింతన చేస్తూ ఉద్యోగ విరమణ చేసిన పిదప తమ జీవిత శేషాన్ని ఆముష్మిక విషయంతో వినియోగిస్తూ ఉండడం మనం చూస్తున్నాం వారు రచించి ప్రకటించిన గ్రంథాలు అందరికీ ఆదర్శప్రాయాలై ఉంటున్నవి ఈ విషయాలను గ్రహించి ఐహికాల యెడల చూపే ఆసక్తిని ఆ ముష్మిక విషయంలో కూడా చూపడం అత్యంతావశ్యకం

-బులుసు వేంకటరమణయ్య

నిన్న ఏమైనా నేను మీతో తప్పుగా మాట్లాడితే క్షమించండి

ఆమె మాట్లాడలేదు

కేవలం మా సాహిత్యపై మీరు చూపించిన ఆత్రుతే నాలో అభిమానాన్ని కలిగించలేదు అంతకు మించి మరేదో చెప్పలేని భావం సాహిత్యకి తల్లి స్థానంలో ఉండగల వ్యక్తి కూడా మీరే!

మాట్లాడలేదు ఆమె

మాతో జీవితం పంచుకోవడానికి మీ కభ్యంతరం లేకపోతే మా అంత అదృష్టవంతులు ఉండరు

ఆమె సమాధానం చెప్పక పోవడం చూసి అతను మీ మనసు నొప్పిస్తే క్షమించండి వస్తాను కనీసం ఈ పరిచయాన్నైనా మిగలనివ్వండి

వెళ్ళిపోయాడతడు

తేలిగ్గా నిట్టూర్చి ఇంటికి నడవడం ప్రారంభించింది

విద్యాధర్ మాటలు ఆమె మనసులో ప్రతిధ్వనిస్తున్నాయి

తలుపు తాళం తీసి లోనికి ప్రవేశించింది మంచంపై వాలిపోయింది ఏమి చెయ్యాలనిపించడం లేదామెకు

చీకటి పడింది

## నిరీక్షణ

అప్పటిదాకా ఆమె ఆలోచిస్తూనే వుంది

తరువాత ఒక నిర్ణయానికి వచ్చింది లేచి లైటు వేసి టేబిల్ ముందు కూర్చొంది లెటరు రాయడం మొదలు పెట్టింది

విద్యాధర్‌గార్కి

నమస్కారములు

నాకు పెళ్ళయ్యింది మూడ్నెల్లు కాపరం కూడా చేశాను ఆ తరువాత యాక్సిడెంట్‌లో ఆయన మరణించారు నా గురించి ఇంతకంటే మీకు చెప్పాల్సింది ఏమి లేదు

మీకు నిశ్చయంగా సాహిత్యపై నేను చూపించిన ప్రేమ ఈ భావాన్ని కలిగించింది సాహిత్య స్థితిలో ఏ అమ్మాయి వున్నా నా స్థితిలో ఏ టీచరున్నా ఇంచుమించు ఇలానే జరిగి వుండేది అంతకుమించి ఏదో చెప్పలేని భావన అన్నారు అలాంటి భావనలు తాత్కాలికం సాహిత్యకి తల్లి స్థానాన్ని ఇవ్వడానికి ఇంట్లోనే ప్రవేశించనక్కఱలేదు ఒక టీచరుగా అది నా బాధ్యత సాహిత్యకి పూర్తిగా నయమైంది గాయం మానిపోయింది మన పరిచయం కూడా ఇంతటితో ఆగిపోతేనే మంచిదని నా అభిప్రాయం

లెటరు రాయడం పూర్తి చేసి పోస్ట్ చేసింది

★ ★ ★ ★

తలుపు తట్టిన శబ్దం

విశారద వెళ్ళి తలుపు తీసింది

లోపలికి రావొచ్చా! విద్యాధర్ లోనికి వస్తూ అన్నాడు

రండి ఆహ్వానించింది విశారద

మా సాహిత్యకి మార్కులు ఎలా వచ్చాయి?

పర్సంటేజ్ బాగుంది

ఇదుగోండి అంటూ కవరు తీసి అందించాడు

కవరు తెరిచి అందులో ఉత్తరం బయటికి తీసింది తను వ్రాసినదే అది

నేనన్న మాటలు కేవలం తాత్కాలిక మైనవి కాదని నా భావన శాశ్వత మైనదని మీరు అనుకోవడానికి గడిచిన ఈ సంవత్సరం చాలను కొంటున్నాను ఎన్ని సంవత్సరాలైనా నిరీక్షించగలను

అతని మాటల్లో డ్రమెటిక్ ఏమి లేదు

మీరు ఇంక నిరీక్షించనవసరం లేదు అంది విశారద నెమ్మదిగా □







భారత స్త్రీల మంగళ చిహ్నం

# ఐటెక్స్

## మాట్ ఫినిష్ తిలకం




అరవింద్ లాబరేటరీస్ మద్రాసు 600 033

Imageads 2230 Tel

# అభిమాన తారలపై అభిప్రాయం !

అక్కినేని నాగేశ్వరరావు నా అభిమాన నటుడు. భగ్న ప్రేమికునిగా పలు చిత్రాల్లో అక్కినేని నటన సూపర్బ్ ! కుటుంబ సమేతంగా చూడదగ్గ చిత్రాల్లో నటించి, క్లాస్ హీరోగా పేరొంది, ప్రేక్షకుల హృదయాల్లో 'ఎవర్‌గ్రీన్'గా స్థిరనివాసం ఏర్పరచుకొన్న నటుడాయన. చిత్రాల్లో అక్కినేనిని



చూస్తుంటే, ఆ చిత్రంలోని పాత్రలో జీవిస్తుంటే మనకి పాత్రే తప్ప నటుడు కన్పించడు. అందుకే.. అందుకే అక్కినేనంటే అభిమానిస్తాను. ఇష్టపడతాను. అయితే ఒకనాటి ఈ "దేవదాసు" తర్వాత "దసరాబుల్లోడి" సినిమాలు, ఈ మధ్య (కొన్ని) బాగుండట్లేదు. అదీకాక అక్కినేని తానిక కుర్ర (హీరో) పాత్రలు వేయటం మానేస్తే బాగుంటుంది. (తాను స్వయముగా ఓ ఇంటర్వ్యూలో చెప్పినట్లు) వయసు మళ్లిన పాత్రల్లాంటి "బహుదూరపు బాటసారి" చిత్రాల్లో నటిస్తే సూటబుల్‌గా ఉంటుంది. అలాగే వీలయితే 'చరిత్ర పురుషుల' పాత్రల్లో నటిస్తే చూసి ఆనందిస్తాము.

–ఎ. వేణుగోపాల్, జగిత్యాల

★ ★ ★ ★ ★ ★

ఈ మహోన్నత సినీ ప్రపంచంలో విరిసిన మల్లెపూవే సూపర్‌స్టార్ కృష్ణ. ఆ మహానటుడు కేవలం నా అభిమాన నటుడే కాదు, అఖిలాంధ్ర ప్రేక్షకులకు అభిమాన హీరో. రంగప్రవేశంతోనే



డాషింగ్ హీరోగా పేరు తెచ్చుకున్న కృష్ణ, ఆది నుండి తనదైన ప్రత్యేక నటనతో ప్రేక్షకుల మనసులను రంజింప చేసారు. ఎవరూ చేయలేని సాహసం చేసి, "అల్లూరి సీతారామరాజు"గా ఆ పాత్రలో జీవించి, తెలుగువాడి గుండెల్లో నిదురించిన పౌరుషాగ్ని రగులు కొలిపిన మహానటుడు కృష్ణ. భారీ నిర్మాణాత్మక చిత్రాల నెన్నింటినో నిర్మించి విజయాలను సాధిస్తున్న కృష్ణ డేరింగ్ అండ్ డాషింగ్ హీరోగా తెలుగువారి హృదయ పీఠాన్ని అలంకరించిన ఏకైక నటుడు. తెలుగు వారి ఖ్యాతిని ఒక దక్షిణ భారతంలోనేకాక, ఉత్తరాదిన కూడా "పద్మాలయ" సంస్థ ద్వారా గణనీయంగా పెంచిన కృష్ణ అభినందనీయుడు. సుమారు 225 పైచిలుకు చిత్రాలలో నటించిన మన నటశేఖర కృష్ణ, దర్శకత్వ బాధ్యతను కూడా చేపట్టి "సింహాసనం" అనే భారీ వర్ణ చిత్రాన్ని ప్రారంభించి యావత్ సినీ ప్రపంచ దృష్టిని తన వైపు నిలుపుకున్న కృష్ణకు నా కళాంజలి సమర్పిస్తున్నాను.

– పి. పర్వత శేఖర్, సీతారామపురం, ఒంగోలు

★ ★ ★ ★ ★ ★

ఈనాడు ప్రతివారికి ఒక అభిమాన నటి (లేక) నటుడు ఉంటున్నారు. అలాగే నా అభిమాన నటి సుహాసిని. ఈనాడు మనము చూచే ప్రతి చిత్రంలో హీరోయిన్స్ అర్థనగ్నంగా కనిపిస్తున్నారు. అలా



కాకుండా నిండుగా కనుపించే నటి సుహాసిని. ప్రతి నటి డబ్బుకోసము ఎలాంటి పాత్రకయినా ముందుకొస్తున్న ఈ రోజులలో నిండుతనముతో పాటు ఆ పాత్రకు ప్రాణం పోస్తున్న నటి సుహాసిని నటన చాల బాగుంటుంది. అతిగా కాకుండా తన పాత్రవరకు తాను ప్రాణం పోస్తుంది. అలాగే ఆమె పాత్రల విషయములో తగిన శ్రద్ధ తీసుకోవాలి. డబ్బుకోసము ఏదో ఒక పాత్ర వేయక అలనాటి సావిత్రి లాగ ప్రేక్షకుల హృదయాలలో నిలిచిపోయే పాత్రలనే ధరించాలి. కొన్ని పాత్రలకు సుహాసిని తప్ప ఇంకెవరు చేయలేరు అనే విధముగా ఆ పాత్రలకు ప్రాణం పోసి సావిత్రి తరువాత అంతటి నటి కావాలి. పాత్రల ఎంపికలో తగిన శ్రద్ధతీసుకొని సం.లో ఎన్ని మంచి పాత్రలు ధరించానా? అని ఆలోచించాలి.

–వినుకొండ విజయ, టంగుటూరు

★ ★ ★ ★ ★ ★

నా అభిమాన నటుడు చిరంజీవి. సినీ చరిత్రలో వెరైటీ తీసుకువచ్చి, తనదంటూ ప్రత్యేకమైన రీతిలో నటిస్తూ, సరిక్రొత్త పంథాలో పాత్రపోషణ చేసే చిరంజీవంటే ఎనలేని అభిమానం. అటు నాట్య ప్రధాన చిత్రాలైతేనేమి, కుటుంబ కథా చిత్రాలయితేనేమి, ఇటు హాలివుడ్ స్టైల్‌లో ఫైట్లు, ఏక్షన్ చేసే చిరంజీవంటే మక్కువ ఎక్కువ. ఒక్కో చిత్రంలో ఒక్కొక్క తరహా నటన నందించే చిరంజీవికి హేట్సాఫ్. అందుకే ఆయన ఏక్షన్



కలిగించింది నాపై రియాక్షన్.

యికపోతే చిరంజీవి యింకా మంచిపేరు సంపాదించుకోవాలంటే సం.కి కనీసం ఓ రెండైనా చక్కని కుటుంబ కథా చిత్రాల్లో నటించాలి. అన్నీ డైనమికల్‌గానే చిరంజీవి నుపయోగించుకొనే సినిమాలు రావటం ప్రేక్షకులకు చికాకు కలిగించవచ్చు. సంవత్సరానికి 8 సినిమాలే తనవి రిలీజ్ కావాలన్న చిరంజీవి ప్రకటన సర్వదా అభినందనీయం. దీనివలన చిరంజీవి సినిమాలే పోటీగా రిలీజ్ అవటం జరగదు.

–ఎమ్. వి. జె. భువనేశ్వరరావు, గవరపాలెం, అనకాపల్లి

★ ★ ★ ★ ★ ★

నాకు సినిమా పరిజ్ఞానం ఏర్పడినప్పటి నుండీ, నేను శోబన్‌బాబు అభిమానినే ఆయన తనదైన స్వంత శైలి అద్భుతమైన నటనా పటిమతో నన్ను తన అభిమానిగా చేసుకొన్నారు పలానా పాత్ర మాత్రమే శోబన్ చేయగలడు అన్న ముద్ర



ఆయనపై లేదు. సంపూర్ణ రామాయణం నుండ సంపూర్ణ ప్రేమాయణం దాకా, ఏ పాత్రనైనా శోభన్ మెప్పించగలడు.

ఇక, వ్యక్తిగతంగా శోభన్ తన అభిమానులతో మెలిగే తీరు, నన్ను ఆయనకు మరింత సన్నిహితుణ్ని చేసింది. శోభన్ ఒకానొక సందర్భంలో

తన అభిమానులతో మాట్లాడుతూ యువతి యువకు లైన తన అభిమానులు అభిమాన సంఘాల పేరిట కాలం డబ్బు వృధా చేయక బాగా చదువుకొని గొప్ప హోదాలో ఉండాలని కన్నవారి ఆశలు నెరవేర్చాలని శోబన్ మూలంగా తమ సంతానం చెడిపోయిందన్న అపఖ్యాతి రాకూడదని ఆయన అన్నారు

ఈ మాటలలో ఉన్న మందలింపు మాకు ఎప్పటికీ గుర్తు ఉంటుంది తన అభిమానులు ఉన్నతి కోరే హీరో కి అభిమానులుగా ఉన్నందుకు ఎంతో గర్విస్తున్నాము ఆయన తను ధరించే పాత్రల హుందాతనాన్ని జీవితంలో కూడా పాటిస్తారనడంలో అతిశయోక్తి లేదు శోబన్ పై నా అభిప్రాయం చెప్పడానికి అవకాశం కల్పించిన ఆంధ్రసచిత్రవార పత్రిక వారికి కృతజ్ఞతలు

— విజాపురపు వెంకటరావు, చిక్కడపల్లి, హైదరాబాదు

* * * * * *

డేరింగ్ అండ్ డాషింగ్ నటశేఖర కృష్ణగారంటె నాకు చాలా అభిమానం. నటుడిగా, నిర్మాతగా ఆతను మనకెన్నో మంచి చిత్రాలు అందించారు.



ఒక్కసారి మునుపటి చిత్రాలు గుర్తు తెచ్చుకుంటె క్రైంచిత్రాలులో తనకు పోటీ ఎవరూ లేనట్టుగా మోసగాళ్ళకు మోసగాడు చిత్రం ద్వారా నిరూపించి అంతటితో ఆగకుండా విప్లవాత్మక చిత్రాలలో తనకంటూ ప్రత్యేక స్థానముందని అల్లూరి సీతారామరాజు చిత్రం ద్వారా నిరూపించి ప్రేక్షకుల హృదయాల్లో చెరగని ముద్ర వేశారు ఇక సాంఘిక చిత్రాన్ని తీసుకున్నట్టయితే పండంటి కాపురం చిత్రాన్ని నాటికీనేటికీ మరువలేము

కృష్ణగారి నటన మునుపటి చిత్రాల్లో చాలా బాగుండేది కాని ఇప్పటి చిత్రాల్లో అప్పటి స్పీడు కనిపించుట లేదు ఫైట్స్ నృత్యాలు కూడా పాత చిత్రాలలో వలె కాకుండా నేటి యువతరానికి ఆకట్టుకొనే విధంగా చేసినట్టయితే బావుంటుంది అదే విధంగా ఉచ్చారణ హావభావాల్లో కూడా మార్పు రావాలి



— ఎస్ శశిభూషణ్ రాయ్, రైల్వే న్యూకాలనీ, విశాఖపట్నం

□

# ఆంధ్రసచిత్రవారపత్రిక

## పాఠకులకి అగ్ర కథానాయిక జయసుధ సమాధానాలు!



తెలుగు సినిమా ప్రేక్షకుల ఆదరాభిమానాలని విశేషంగా చూరగొన్న ప్రముఖ నటీమణి జయసుద ఆంధ్రసచిత్ర వారపత్రిక పాఠకుల ప్రశ్నలకి సమాదానాలు ఇస్తారని తెలియ చేయటానికి సంతోషిస్తున్నాము త్వరలో ప్రారంభం కాబోయే ఈ శీర్షికకి పాఠకులు అర్థవంతమైన ప్రశ్నలని మాత్రమే పంప గోరుతున్నాము వారం వారం ప్రచురింపబడే ఈ శీర్షికలో ప్రతివారం జయసుధ ఎన్నిక చేసిన ఉత్తమ ప్రశ్నని పంపినవారికి ఆటోగ్రాఫ్‌తో ఉన్న ఆమె అందమైన ఫొటో బహుమతిగా లభిస్తుంది ప్రశ్నలు పంపేవారు తమ ప్రశ్నని ఈ కింది కూపన్‌లో స్పష్టంగా సిరాతో లేదా బాల్‌పాయింట్ పెన్‌తో రాసి, తమ పేరు, పూర్తి చిరునామాతో సహా జయసుద సమాధానాలు శీర్షిక పేర సంపాదకుడు ఆంధ్రసచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ– 520003 అన్న చిరునామాకి పంపాలి ఒక కూపన్‌లో ఒక ప్రశ్నని మాత్రమే రాయాలి విడిగా రాసి పంపినవి పరిశీలింపబడవు

పాఠకులు ఉత్సాహంతో ఈ అవకాశాన్ని వినియోగించుకోగలరని ఆశిస్తున్నాము

కూపన్

## ఆంధ్రసచిత్రవారపత్రిక
## జయసుధ సమాధానాలు

ప్రశ్న ____________________

____________________

____________________

పంపినవారి పేరు

పూర్తి చిరునామా

# సినిమా విశేషాలు

-జివిజి

## జంధ్యాల అమెరికాలో రూపొందించే పడమటి సంధ్యారాగం లో సుహాసిని

ఆనందభైరవి క్షేత్ర యాత్రలో మేము అమెరికా సంయుక్త రాష్ట్రాలలో పర్యటించినప్పుడు అక్కడి ప్రతిభావంతులైన మన ఆంధ్ర డాక్టర్లు ఇంజనీర్లు ఇతర ఉన్నతోద్యోగులు తెలుగు భాషను తెలుగు సంస్కృతిని విస్మరించకుండా అసలు సిసలైన తెలుగు ఆచారాలను పాటించడం నాకు ఆశ్చర్యానందాలను కలిగించింది అక్కడి యార్లగడ్డ ప్రసాదరావు గారికి గుమ్మలూరు శాస్త్రిగారికి చాలా కాలంగా ఒక తెలుగు చిత్రాన్ని అమెరికాలోనే తీయాలనే కోర్కె ఉంది ఒక కథ గురించి చర్చించి ఎస్ పి బాలసుబ్రమణ్యం స్వరకల్పనలో ఆయనా శైలజా పాడిన సదాశివ బ్రహ్మేంద్రస్వామి కృతి పిబరే రామరసం ను వాషింగ్టన్ లోని ఒమేగా స్టూడియోలో సౌండ్ ఇంజనీర్ కుమారి షేన్ చేత మల్టీట్రాక్ స్టీరియో సిస్టమ్‌లో రికార్డ్ చేయించాం కూడా ఇలా ఒక తెలుగు చిత్రానికి పాట అమెరికాలో రికార్డవడం ఇదే ప్రథమం ఈ పడమటి సంధ్యారాగం చిత్రం షూటింగ్ జూన్ చివరి వారంలో ప్రారంభమై 50 కాల్‌షీట్లలో ఆగస్టులో పూర్తవుతుంది ఇందులో నాయిక సుహాసిని- అమెరికా వెళ్ళిన తెలుగు పల్లెటూరి పిల్ల ఈమె ఒక శ్వేత యువకుడూ ఒక నీగ్రో యువకుడూ- వీరి ముగ్గురి చుట్టూ అనూహ్యమైన మలుపులతో సాగే రసవత్తరమైన కథ మిగతా పాత్రలను అమెరికాలో స్థిరపడిన మన తెలుగు వారే ధరిస్తారు వాషింగ్టన్ చికాగో న్యూయార్క్ డెట్రాయిట్ నయాగరా వగైరా చోట్ల పాటలను ఎక్సరైజ్ చేస్తాం అని తెలియజేశారు దర్శక రచయిత జంధ్యాల అమెరికా-ఆంధ్రా కంబైన్స్ బానర్‌లో తయారయ్యే ఈ చిత్రానికి ఎస్ గోపాల్ రెడ్డి ఛాయాగ్రాహకుడు

## టి కృష్ణ దర్శకత్వంలో రేపటి పౌరులు

నేటి బాలల పరిస్థితి ఓ విధంగా కలుషితంగా ఉందనే చెప్పాలి పిల్లలు తమంతటి వారు కావాలని తల్లిదండ్రులు ఆశ పడడమే గాని పిల్లలకు సవ్యమైన లోకజ్ఞానం ఇవ్వలేకపోతున్నారు తండ్రి వృత్తినే తనయులు చేపడుతూ సమాజానికి ఏ విధంగానూ ఉపయోగపడ లేకపోతున్నారు వారు రేపటి పౌరులు కావాలంటే ప్రజలలో ఏ విధమైన మార్పు తీసుకురావాలో తెలియజేయడమే మా లక్ష్యం అన్నారు టి కృష్ణ ఈయన కథ స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో పోకూరి వెంకటేశ్వరరావు నిర్మిస్తున్న ఈతరం ఎక్సర్స్ వారి ఈ చిత్రం రెండవ షెడ్యూల్ ఫిబ్రవరి 5 నుంచి ఒంగోలులో జరిగినప్పుడు పతాక సన్నివేశాలు చిత్రీకరింపబడ్డాయి విజయశాంతి

రాజశేఖర్ వేలు కోట శ్రీనివాసరావు ఎ ఎల్ నారాయణ పొట్టి ప్రసాద్ నర్రా వెంకటేశ్వరరావు వీరారెడ్డి భీమేశ్వరరావు కె వి లక్ష్మి మహిజా విజయలక్ష్మితో పాటు అనూరాధ ఒక క్లిష్టమైన పాత్రను నిర్వహిస్తోంది ఎం వి ఎస్ హరనాధరావు మాటలు చక్రవర్తి సంగీతం ఆర్ రామారావు ఛాయ బి ఎస్ మోహన్ శిల్పం వెలగా కృష్ణారావు

సహకార దర్శకత్వం కమల్‌తేజ్ సహదర్శకత్వం బి కోటేశ్వరరావు ప్రొడక్షన్ గౌతంరాజు కూర్పుతో పోకూరి బాబూరావు సమర్పకులు

కర్పూర దీపం లో సుహాసిని



ఊర్వశి వేటగాళ్ళు లో





సింహాసనం లో జయప్రద కృష్ణ

## ఎ సి రెడ్డి దర్శకత్వంలో కృష్ణ శ్రీదేవి

కృష్ణగారు నేను కలిసి వర్క్ చేసిన చిత్రాలెంతగా విజయవంత మయ్యాయో అందరికీ తెలుసు కృష్ణగారి ఇమేజ్‌ని మరింత పెంచే సబెక్ట్‌ను ఎద్దం చేశాం అన్నారు ఎ చంద్రశేఖరరెడ్డి ఈయన దర్శకత్వంలో బాలాజీ ఫిలిమ్స్ అనే నూతన సంస్థ అధినేతలు జి సత్యనారాయణ ఎ హెచ్ పాపారావు నిర్మించె చిత్రంలో శ్రీదేవి నాయిక నెల్లూరు బాబు నిర్మాణ సారధి

## రవిరాజా పినిశెట్టి దర్శకత్వంలో పంపిణీదారులు నిర్మించే చిత్రం

పూర్తిగా గ్రామీణ వాతావరణంలో తయారౌతోంది అన్నారు రవిరాజా పినిశెట్టి ఈయన స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో గుంటూరులో ని ప్రసిద్ధ పంపిణీదారులు పద్మావతీ ఎక్స్ నిర్మించే తొలి చిత్రానికి జనవరి 26న ప్రారంభోత్సవం జరిగింది అర్జున్ భానుప్రియ రావుగోపాలరావు ఎ ఎల్ నారాయణ రాళ్ళపల్లి నిర్మల అన్నపూర్ణ వై విజయ కన్నడ నటి ఉమశ్రీ పాల్గొంటున్నారు ఫిబ్రవరి 24 నుంచి మార్చి 6 మార్చి 27 నుంచి 31 ఏప్రిల్ 26 నుంచి 30 మే 1 నుంచి 20 వరకు జరిగే షెడ్యూల్‌తో చిత్రీకరణ ముగుస్తుందని నిర్మాతలు వి ఎస్ సబ్బారావు కె రవీంద్రబాబు తెలిపారు జి సత్యమూర్తి రచన కె ఎస్ హరి ఛాయ కృష్ణ శిల్పం విశ్వస్వామి కూర్పు వెంకటేశ్వరరావు నిర్వహణతో రాజేంద్ర ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్

ఈ సంస్థ శోభన్‌బాబుతో జూలైలో ప్రారంభించే చిత్రానికి విజయబాపినీడు దర్శకుడు

## రచయిత జి సత్యమూర్తి దర్శకత్వం వహించే తొలి చిత్రం చైతన్యం

జాతీయ సమైక్యత ప్రధానాంశం ప్రాంతీయ భేదం లేకుండా విశ్వమానవాళికంతటికీ సంబంధించిన ఓ సమస్యాత్మక కథ అన్నారు రచయిత జి సత మూర్తి ఈయన కథ స్క్రీన్‌ప్లే మాటలు సమకూర్చి తొలిసారిగా దర్శకత్వం వహించే చిత్రంలో జయసుధ చంద్రమోహన్ భానుచందర్ సాగరిక జె వి సోమయాజులు గొల్లపూడి మారుతిరావు రాళ్ళపల్లి వేలు వీరభద్రరావు కోట శ్రీనివాసరావు సాక్షి రంగారావు భాస్కరరెడ్డి రజనీష్ దీక్షితులు కాకినాడ శ్యామల వై విజయ జయమాలిని డిస్కో శాంతి ఒక విశిష్టమైన పాత్రలో సంగీత దర్శకుడు చక్రవర్తి నటిస్తున్నారు మొదటి షెడ్యూల్ ఫిబ్రవరి 21 నుంచి 28 వరకు జరిగింది లోక్ సింగ్ ఛాయ ఆర్ బాబు శిల్పం శివసుబ్రహ్మణ్యం నృత్యాలు రాజు సాహసాలు ఎల్ వెంకటరాజు ప్రొడక్షన్ డి వెంకటరత్నం కూర్పుతో కామిని రాము కామిని లక్ష్మీకాంతరావు సహనిర్మాతలు మార్చి 21 నుంచి 31 ఏప్రిల్ 21 నుంచి 30 వరకు జరిగే తదుపరి షెడ్యూల్స్‌లో షూటింగ్ ముగుస్తుంది అన్నారు కామిని ప్రొడక్షన్స్ బ్యానర్‌లో ఈ చిత్రాన్ని నిర్మిస్తున్న కామిని వెంకటేశ్వరరావు



"జీవన పోరాటం"లో రాధిక, శోభన్‌బాబు



"రక్త తర్పణం"లో చంద్రమోహన్, మనోచిత్ర



స్మిత, "ఖైదీరాణి"లో

## చేతబడి

అన్ని విద్యల అర్థం పరమార్థం మానవ సంక్షేమం విశ్వమానవ కల్యాణం క్షుద్ర విద్యలను స్వప్రయోజనాలకు వాడుకోవాలనుకునే వారికి వశా ఖరినికి పట్టిన గతే పడుతుంది అనే సత్యానికి సజీవ రూపకల్పన జనవరి 6 నుంచి 31 ఫిబ్రవరి 11 నుంచి 20 వరకు జరిగే రెండు షెడ్యూల్స్‌తో షూటింగ్ ముగుస్తుంది అన్నారు కె మణిమురుగన్ ఈయన గతంలో దాదాపు 10 కన్నడ చిత్రాలను డైరెక్ట్ చేశారు ఈయన స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో కె రాములు ఎన్ ఎన్ ఆర్ ఆంజనేయులు నిర్మించే శివనాగరాజా ఫిలిమ్స్ చేతబడి చిత్రంలో శరత్‌బాబు నళిని జె వి సోమయాజులు రాజేష్ వీరభద్రరావు శుభలేఖ సుధాకర్ విక్రమ్ ప్రభాకర్ రమణమూర్తి అనూరాధ నవ నటుడు రజనీష్ పాత్రధారులు ఎస్ ఎల్ వి రాజ్ కథకు కొంపెల్ల విశ్వం సంభాషణలకర్త కె జె జాయ్ స్వరకల్పనలో ఆత్రేయ వేటూరి గోపి గీతాలు రాశారు కె ఎస్ మణి ఛాయ ఆర్ ఎస్ బాబు సాహసాలు జోడించారు వగైరా సాంకేతికులు



"ఖైదీ నాగమ్మ"లో వేలు



గర్జించిన గంగ లో జయసుధ పూర్ణిమ అర్జున్



పవిత్ర అన్నపూర్ణ సంయుక్త పుణ్యస్త్రీ లో

## ANDHRA SACHITRA VARA PATRIKA (Weekly)

Effective from *1st March 1986*

### (ALL FLAT RATES)

| | | |
|---|---|---|
| Inside Full Page (B & W) | Rs | 2,000/- |
| Inside Full Page Multi Colour | Rs | 4,000/- |
| Back Cover | Rs | 5 000/- |
| II/III Covers | Rs | 2,500/- |
| Inside Half Page | Rs | 1,000/- |
| ,, Quarter Page | Rs | 500/- |
| Centre Spread MultiColour | Rs | 8,000/- |
| ,, ,, B & W | Rs | 4,000/- |
| Classified (5 cm × 1 col ) | Rs | 150/- |

| | |
|---|---|
| Opening Page/Specified Position | 15% Extra |
| Bleed Size | 25% Extra |
| Box No Charges | Rs 5/- Extra |

### TECHNICAL DATA

| | | | |
|---|---|---|---|
| Overall / Bleed size | 27 cm | X | 20 cm |
| Full Page | 23 cm | X | 17 cm |
| Quarter Page | 11 5 cm | X | 8 5 cm |
| Quarter Page Horizontal | 6 cm | X | 17 cm |
| Half Page Vertical | 23 cm | X | 8 5 cm |
| Half Page Horizontal | 11 5 cm | X | 17 cm |

Art pulls Art Works Bromides and positives are accepted

*Last Date for acceptance of materials*

For Black & White 30 days for Colour 40 days before the date of Publication

**Day of Publication** **FRIDAY**









అమృతాంజన్‌కే
తెలుసు
తలనొప్పి
బాధ



మృదువైన మూలపదార్థము వల్ల
ఉపయోగించుట సులభము

క్రొత్త కార్కు అమరిక వల్ల
మందు శక్తికి రక్షణ



OBM 8708 TG



1984 ఒలింపిక్స్ క్రీడలలో
పాల్గొన్న భారత క్రీడాకారులకు
అధికారపూర్వకంగా పెయిన్ బామ్
సరఫరా చేసినవారు.




ఏ ఇతర బాధలు కల్గించని
శీఘ్ర నివారిణిని నమ్మండి

# దాసరి, కృష్ణంరాజుల మహోన్నతమైన కళాఖండం "తాండ్ర పాపారాయుడు"లో బుస్సీగా ప్రాణ్

పౌరుషానికి సాహసానికి విలక్షణమైన వ్యక్తిత్వానికి ప్రతీకలైన బొబ్బిలి రాజుల వైభవ ప్రాభవాలు తెలుగునాట ఆబాలగోపాలానికి కరతలామలకం బొబ్బిలి చరిత్రలో ఆద్యుడైన పాపారాయుడి గురించి పెక్కు గ్రంథాలు పరిశోధించాం నేనూ డైరెక్టర్ దాసరి నారాయణరావుగారూ కొండవీటి వెంకటకవిగారూ రెండు నెలలకు పైగా కథ గురించి చర్చించాం ప్రముఖ చారిత్రక పరిశోధకుల సలహాలు తీసుకున్నాం సెట్‌కి పది పదిహేను లక్షల రూపాయల చొప్పున నాలుగు షెడ్యూల్స్‌కి నాలుగు బ్రహ్మాండమైన సెట్స్ నిర్మిస్తున్నాం ఎక్కడా రాజీ పడడం లేదు మా గోపీకృష్ణ మూవీస్ చిత్రానికి తొలిసారిగా దర్శకత్వం వహిస్తున్న దాసరి నారాయణరావుగారు చూపుతూన్న శ్రద్ధాసక్తులను ప్రత్యేకంగా పేర్కొనాలి కర్నాటక హిందూస్థానీ పాశ్చాత్య సంగీతాలలో నిష్ణాతులైన ఎస్ రాజేశ్వరరావుగారు తమ అనుభవాన్నంతా రంగరించిపోసి అద్భుతమైన సంగీతాన్ని సమకూర్చారు కీలకమైన బుస్సీ పాత్రలో ప్రముఖ హిందీ నటుడు ప్రాణ్ విజృంభించారు మా బొబ్బిలి బ్రహ్మన్న చిత్రం మా గోపీ కృష్ణా మూవీస్ ఇమేజ్‌ని పెంచడమే కాకుండా మా మీద మరింత బాధ్యతను పెంచింది ఈ చిత్రానికి మించిన స్థాయిలో తాండ్ర పాపారాయుడు చిత్రాన్ని రూపొందించడానికి మా యూనిట్‌లోని ప్రతి ఒక్కరూ అత్యంత శ్రద్ధతో కృషి చేస్తున్నారు అన్నారు కృష్ణంరాజు ఈయన ప్రధాన భూమిక నిర్వహిస్తూ సమర్పించే పై ప్రతిష్ఠాత్మక చిత్రం షూటింగ్ డిసెంబర్ 21 న రాజమండ్రి దగ్గర ప్రారంభమైంది ప్రాణ్ మోహన్‌బాబు జె వి సోమయాజులు గుమ్మడి కోట శ్రీనివాసరావు, అల్లు రామలింగయ్య సారథి, వేలు ధూళిపాళ మిక్కిలినేని రమణమూర్తి త్యాగరాజు జయప్రద శారద విజయశాంతి సంగీత రమాప్రభ విజయలలిత నిర్మల అన్నపూర్ణ షహీద, స్మిత జయమాలిని వగైరా తారా సందోహం కొండవీటి వెంకటకవి సంభాషణలను రాశారు యామినీ సరస్వతి సహాయ సంభాషణల రచయిత సి నారాయణరెడ్డి కొసరాజు గీతాలకు ఎస్ రాజేశ్వరరావు స్వరకర్త భాస్కరరాజు శిల్పం పి ఎస్ ప్రకాష్ ఛాయ డి వెంకటరత్నం కూర్పు జ్యోతి ప్రసాద్ ప్రొడక్షన్ వై ప్రభాకర్ సహకార దర్శకత్వం, జి సత్తిరాజు నిర్మాణ సారథ్యం జాడో రత్నం సాహసాలతో ఈ చిత్రాన్ని నిర్మించే యు వి సూర్యనారాయణరాజు ఇదొక బృహత్ పథకం సాహసంతో పాటు ఎంతైనా సహనం కూడా కావాలి కోటిన్నర రూపాయలకు పైగా వ్యయమవవచ్చు హీరో స్వారీచేసే జాతి గుర్రానికి


నేను మొదలుపెట్టిన భారీ చిత్రాన్ని నువ్వు పూర్తి చెయ్యాలి నాయనా!

ప్రత్యేకమైన శిక్షణ ఇప్పించాం రెండు ఏనుగులు వందకుపైగా అశ్వాలు ఉంటాయి గజ తురగ పదాదులకే చాలా ఖర్చవుతుంది ఇది దాసరి నారాయణరావుగారు డైరెక్ట్ చేసే 90 వ చిత్రమవడం మాకు మరింత ఆనందంగా ఉంది మొదటి షెడ్యూల్ జనవరి 20 వరకు జరుగుతుంది

100 కాల్‌షీట్స్‌కు పైగా పని ఉంటుంది ఏప్రిల్‌లో

వెంకట కృష్ణమూర్తి నవల ఆధారం అన్నారు జ్యోతి ఆర్ట్ పిక్చర్స్ అధినేత బీమవరపు బుచ్చిరెడ్డి

ఈయన జంధ్యాల స్క్రీన్‌ప్లే సంభాషణలు దర్శకత్వంలో నిర్మిస్తున్న పై చిత్రంలో చిరంజీవి

సరసన సుహాసిని నాయిక ఫిబ్రవరి 14న చిత్రీకరణ మొదలైంది

ముఖ్యాంశం అత్యధిక వ్యయప్రయాసలతో కనీ వినీ ఎరుగని రీతిలో నిర్మించాలని మా సంకల్పం అన్నారు డి ఆర్ చెన్నారెడ్డి ఈయనా ఆర్ లక్ష్మారెడి టి సోమిరెడి నిర్మించే ధరణి చిత్రాలయవారి పై చిత్రం షూటింగ్ ఫిబ్రవరి 21న మొదలైంది కృష్ణంరాజు జయసుధ రాధ గిరీష్ కర్నాడ్ సత్యనారాయణ విజయచందర్ శివకృష్ణ







షూటింగ్ పూర్తవుతుంది అన్నారు ఈ చిత్రం 70 ఎం ఎం స్టీరియో ఫోనిక్ సౌండ్ సిస్టమ్‌లో తయారవుతోంది

## చిరంజీవి చంటబ్బాయ్ గా జంధ్యాల దర్శకత్వంలో బుచ్చిరెడ్డి చిత్రం

విశేషంగా పాఠకులను ఆకట్టుకున్న మల్లాది

# సినిమా

## ఎ కోదండరామిరెడ్డి దర్శకత్వంలో రుద్రభూపతి గా కృష్ణంరాజు

స్వరాజ్యం సిద్ధించడానికి ముందు ఆ తర్వాత మన దేశ పరిస్థితులను సమీక్షిస్తూ రుద్రభూపతి పాత్రను మహోన్నతంగా మలచాం అస్తవ్యస్త పరిస్థితులను అతనెలా ఎదుర్కొన్నాడనేది

గొల్లపూడి మారుతీరావు నూతన్‌ప్రసాద్ ప్రతిసస్త్రు సంగీత అన్నపూర్ణ మున్నగు తారా సందోహం

పరుచూరి సోదరులు కథ మాటలు సమకూర్చారు వేటూరి గీతాలను చక్రవర్తి స్వరపరిచా రు ఏ ఎస్

ఆర్ స్వామి ఛాయ కుదరవల్లి శిల్పం రాచ రి

శ్రీనివాసరావు సహదర్శకత్వం ధి వెంకటరత్నం కూర్పుతో ఏ కోదండరామిరెడ్డి సమర్పకులు □

### ఎ వి కె గుంటూరు

★ హాయ్! కె రా గారూ ఎమిట మి శీర్షిక గురు మారింది? కారణం చెప్తారా?

● చిత్రకారునికి సరదా పుట్టి అంతకంటె కారణం ఎముంటుంది?

### రాజు, నారాయణపేట

★ అందరూ నిన్ను రామలక్ష్మి అంటే నేను అరుణ లక్ష్మి అంటాను సరేనా?

● నాకు సరే మరి ఆయనగారేమంటారో! నువ్వేమిటి? నాకు లక్ష్మి వేమిటి? పొమ్మంటె- కష్టం నేను- ఖర్చుని!

### బి ఆర్ కె మహబూబ్‌నగర్

★ ఆడదాన్ని అసహ్యించుకుంటె మగవాడిక జవితం గడపడం కష్టం అంటారు ఎందు వలన?

● భుక్తి గడపడు ఎన్నాళ్ళు తింటారు హోటలు ఫుడ్? చాకరి చేసుకోలేరు-ఎంత మంది కని పె చెయికందువచ్చే జీతం? అందుకే ఓ పెళ్ళాం కోసం వెతుకుతారు చాలామంది మిరు వినే వుంటారు తిండి సరిగా కుదరడం లేదండి పెళ్ళి చేసుకుందా మనుకుంటున్నాను అన్నమాట

### జి వి ఆర్ అనకాపల్లి

★ నన్నే పెళ్ళి చేసుకుంటానని మామయ్య కూతురు పట్టు పట్టుకు కూర్చుంది లేకపోతే ఆత్మ హత్య చేసుకుంటానంటూంది కాని నా మనసేమో ఇంకొకరిక స్వంత మైంది ఇది నా సమస్య

● మి మన సింకొకరిదని తెలిసిన నాడు- మి మామయ్య కూతురు మనసు మార్చుకుంటుంది మిరి విషయం చెప్ప వుండరండి- (లేక- బెస్ట్ ఆఫ్ది బార్గెయిన్ కోసం – చూస్తున్నారా-)

### ఎస్ వి సంగం జాగర్లమూడి

★ అమెరికన్ గాంధి సరివాప్ప గాంధి ఇలా పేటకో గాంధి పుట్టుకొస్తుంటె గాడ్సేలనెక్కడ నుంచి ఉత్పత్తి చేసేది?

● మిలాంటి ఉత్తముల బావ గ్రహించె కాబోలు టెర్రరిస్టులు- ముందు జాగ్రత్త లోనె వుంటున్నారు

### టి ఏ కోరాపుట్

★ కోడి ముందా? గుడ్డు ముందా?

● తినేవాడికి మిమాంస అవసరమా?!

### ఎస్ ఎస్ నెల్లూరు

★ మి సమాధానాలు తగినట్లుగా వుంటాయి మిరు ఎంతో ఉత్సాహాన్ని కల్గిస్తారు మి తెలివి ఎంతో తెలుపకలరా?

● ఆ రోజుల్లో మూర్‌మార్కెట్‌లో ఎంత కొన్నానో మరిచి పోయానయ్యా! లెక్కలు తీసి చూడడానికి మా నాన్న కూడా లేరు నేను అనాదని! (అంటే తల్లి తండ్రి లేనిదాన్ని!)




### బి హెచ్ కె ఆర్ నర్సారావుపేట

★ మొదటసారిగా మి శ్రివారితో కలసి వున్న పోటో చూసినాను ఎందుకో విజయలక్ష్మి పండిట్ ఇందిరాగాంధి గుర్తుకు వచ్చారు

● అని మిరంటున్నారు భూత ప్రేత పిశాచా లెలావుంటాయో ఇప్పుడు తెలిసిందంటున్నారు కొందరు! అందుకే అంటాను- అందరి చేతా మెచ్చుకోబడడం కష్టం అని!!

### ఎమ్ కె ఆర్ విశాఖ

★ వాండూ మన వైశాల్యాన్ని చాలా చక్కగా చెప్పారు ఎంతైనా శ్లాఘనీయులు యీ విషయంలో

● థాంక్స్ నేను నవలల కంటె జీవిత చరిత్రలు మత గ్రంథాలు కాలక్షేపానిక చదువుతాను

★ ఉచ్చారణ తపిదనంలో గొప్పదనం శ్రీకాకుళ్ళ విశాఖ విజయనగర జిల్లాలకె చెందుతుందంటారు ఒప్పుకోక తప్పదండి?

● ఎలా వాళ్ళు మాట్లాడే దాల్లో సగం అర్థం కాదే నాకు! అయినా ఎలా మాట్లాడినా తెలుగు నా ఇష్టమే- నేనూ బాగా మాట్లాడాలని ప్రయత్నిస్తాను- ఇంగ్లీషు ముక్కలు అరవ కన్నడ వాంది ముక్కలు రాకుండా కాని నా బాష మరి సంకరం అయిపోయిందని- కావలిస్తె ఒప్పుకుంటా

### ఎం ఆర్ బి కాశీబుగ్గ

★ ఉద్యోగం సంపాదించాలంటె ఎలాంటి చదువు కావాలి?

● చదువుకున్న చదువుకి వచ్చే ఉద్యోగానికి సంబంధం లేదు కనుకనె ఎలాటి చదువు కావాలో చెప్పలేం

★ అధికారులు లంచం పుచ్చుకోకుండా వుండడానికి మనం ఏం చెయ్యాలి?

● మనం ఎం చెయ్యక్కరలేదు వాళ్ళు పుచ్చుకోకుండా వుండాలంతే!

### ఏ ఎస్ జగిత్యాల

★ రామారావు మికు అన్న మరి మి ఎల్లలకి? మి భర్తకి?

● రామారావు నాకు అన్న కాదు ఎవరిని పడితే వారిని వరసలు కలిపి పిలవడం నాకసలు అలవాటులేదు

### వి ఎమ్ వడ్లమూడి

★ సినరంగానికి రాజకీయరంగానికి తేడా?

● ఎంలేదు వీళ్ళు ఎదుటరిని మంచి చేసుకుని ఇతరుల రోల్సు రూపుమాపాలని చూసి వాళ్ళు ఓటర్లను మంచి చేసుకుని ప్రత్యర్థులని సైజుకి కట్ చెయాలని తాపత్రయ పడతారని అంటారు □

రిపబ్లిక్ దినోత్సవం నాడు విజయవాడలోని ప్రభుత్వ ఆసుపత్రిలో భారత మహిళా మండలి సభ్యులు పళ్ళు రొట్టె స్వీలు పాత్రలు రోగులకి పంచి పెట్టారు అధ్యక్షులు శ్రీమతి ఇందుమతి కార్యదర్శి శ్రీమతి అన్నపూర్ణ ప్రత్యేకంగా కుష్టు రోగుల వార్డు శ . చికిత్స అయిన రోగుల వార్డు ఎల్లల వార్డులకి వెళ్ళి పంచి పెట్టారు



# సాక్షి

[illegible]

శర్వరమణప్రసాద్

(గత సంచిక తరువాయి)

"విజయ్ విజయ్ తలుపుమీద దబదబలాడుతున్న చప్పుడు విని తుళ్ళిపడి లేచాడు విజయ్ ఒక్క ఉదుటున మంచంమీంచి ఉరికి టవర్‌బొల్టు తీసి తలుపు తెరిచాడు

ఎదురుగా కల్యాణ్!

విజయ్ ఓమారు అర్జంటుగా నాతో రా అన్నాడు కల్యాణ్ ఆందోళనగా అతని ముఖ కవళికలబట్టి ఏదో అవాంచనీయ సంఘటన జరిగి వుంటుందని ఊహించాడు విజయ్ అందుకే మరేమీ అడక్కుండా పద అన్నాడు కల్యాణ్‌తో

ఇద్దరూ కిందకి దిగేరు డైనింగ్ హాల్లో తెరిచి వున్న తలుపుగుండా పెరట్లోకి నడిచాడు కల్యాణ్ కిచెన్ పక్కకి వచ్చారిద్దరూ

ఒక్కసారిగా అదిరిపడ్డాడు విజయ్ అంత పోలీసాఫీసరూ క్షణకాలం స్తంభించిపోయాడు అక్కడి దృశ్యం చూసి!

కిచెన్ పక్క గచ్చుమీద రక్తపు మడుగులో పడివున్నాడు డాక్టర్ ఆనంద్! కపాలం బద్దలైనట్టుంది తల చుట్టూ రెండు మూడడుగుల మేర ప్రవహించి గడ్డకట్టివుంది రక్తం!

ఎలా జరిగిందిది? అడిగాడు కల్యాణ్‌ని

తెలీదు నేనూ యిప్పుడే చూసాను మార్నింగ్'వాక్ కని బయటికి వచ్చినప్పుడు అన్నాడు కల్యాణ్

చుట్టూ పరికించి చూసాడు విజయ్ రాత్రి కొద్దిగా వర్షం కురిసినట్టుంది నేలంతా యింకా తడితడిగా వుంది తల పైకెత్తి పిట్టగోడ వైపు చూసాడు ప్రత్యేకతేమీ కనబడలేదు

మిగిలిన వాళ్ళెవరికీ తెలీదా? మళ్ళీ ప్రశ్నించాడు కల్యాణ్‌ని

ఊహుఁ యింకా ఎవర్నీ నిద్రలేపలేదు ఒక్క మైత్రేయిని మాత్రం లేపి చెప్పాను స్లీపింగ్ పిల్స్ వేసుకుని పడుకోవడం వల్ల ఆమెకి కూడ చాలసేపటి వరకూ తెలివి రాలేదు తెలివొచ్చాక ఈ సంగతి విన్న వెంటనే స్పృహ తప్పి పడిపోయింది

మైత్రేయి స్లీపింగ్ పిల్స్ వేసుకుని పడుకుందన్న విషయం వినేసరికి కొద్దిగా ఆశ్చర్యమేసింది విజయ్‌కి అయినా, ఆశ్చర్యాన్నణుచుకుంటూ

జరిగిన కథ– 1 కళ్యాణ్ పెద్ద జమిందార్ అతని భార్య మైత్రేయి ఆమె చాలా అందగత్తె కళ్యాణ్ ఏదో అర్జంటు విషయం చర్చించటానికి రమ్మంటే కళ్యాణ్ ఉండే గ్రామానికి వస్తాడు డి ఎస్ పి విజయ్ విజయ్ వచ్చేటప్పటికే డాక్టర్ ఆనంద్ లాయర్ ప్రకాష్ బ్యాంకు మేనేజరు శామ్యూల్ కూడా అక్కడికి వచ్చి ఉంటారు లాయర్ ప్రకాష్ మంచి ఆర్టిస్టు అందరూ కలసి సరదాగా కాలక్షేపం చేస్తారు మాటల మధ్యలో మర్నాడు ఏదో ఆశ్చర్యకరమైన సంఘటన జరగబోతోందని చెప్తాడు కళ్యాణ్ అర్జంటుగా ఏదో మాట్లాడాలని రాసిన కళ్యాణ్ ఆ విషయం ఏం చర్చించక పోవడం విచిత్రంగా ఉంటుంది విజయ్‌కి అతను రాత్రి పడుకోబోయే ముందు మర్నాడు కల్యాణ్‌తో చెప్పి తిరుగు ప్రయాణమై వెళ్ళిపోదామనుకుంటాడు

ఇప్పుడెలా వుందామెకి? అంటూ మామూలుగా అడిగాడు

కొద్దిగా కోలుకుంది పర్వాలేదు జవాబిచ్చాడు కల్యాణ్

విజయ్ చాలసేపు ఏదో దీర్ఘంగా ఆలోచిస్తూ వుండిపోయాడు పోలీసాఫీసరుగా యిటువంటి దృశ్యాలు చూడ్డం కొత్త కాదు విజయ్‌కి కాని ముందురోజు వరకూ తమతో హాయిగా నవ్వుతూ తుళ్ళుతూ గడిపిన డాక్టర్ యిలా దుర్మరణం పాలవడం అతని హృదయాన్ని కలచి వేసింది దీన్ని ఆత్మహత్య అనుకోవాలా, ఏక్సిడెంటల్ డెత్ అనుకోవాలా లేక హత్యనుకోవాలా కారణమేదైనా దీని వెనుక ఏదో పెద్దకథే వుండి వుండాలి అనుకున్నాడు మనసులో

ఇప్పుడేం చేద్దాం' అతని ఆలోచనలకి భంగం కలిగిస్తూ అడిగాడు కల్యాణ్ ఆదుర్దాగా

ఇతని బంధువులెవరైనా దగ్గర్లో వున్నారా? అడిగాడు విజయ్

లేరు పేరెంట్సెప్పుడో పోయారు తోబుట్టువులు కూడ ఎవరూ లేరని చెప్పాడు ఇక్కడికి దగ్గర్లోనే పట్నంలో తన స్నేహితులు నడుపుతున్న ప్రైవేట్ నర్సింగ్‌హోమ్‌లో పని చేస్తున్నాడు

అయితే ఆ హాస్పిటల్‌కి ఫోన్ చేసి ఈ విషయం చెప్పు వీలైతే అతని ఫోటో అక్కడి పత్రికాఫీసుకి పంపి రేపు ఉదయానికల్లా పేపర్లో వచ్చేటట్టు చూడమను లోకల్ పోలీస్టేషనుకి ఫోన్‌చేసి చెప్పు వాళ్ళొచ్చి ఫార్మాలిటీస్ పూర్తి చేసుకుంటారు అలవాటయిన రీతిలో ఆదేశాలిచ్చేశాడు విజయ్

పోలీసులకి తెలియబర్చాలంటావా? అనుమానంగా అడిగాడు కల్యాణ్

తప్పదు యిది నేచురల్ డెత్ కాదుకద నువ్వు నేను చెప్పిన రెండు పన్లూ ఎటెండవు నేనీలోగా కొంత ఇన్వెస్టిగేషన్ చేస్తాను క్విక్ అంటూ పరుగులాంటి నడకతో యింట్లోకి దారితీసాడు విజయ్ విస్మయంగా అతన్ననుసరించాడు కల్యాణ్

లోపలికొచ్చిన విజయ్ మూడు అంగల్లో మేడమీదకి వెళ్ళాడు వరండాలోంచి డాబామీదకి వెళ్ళే తలుపు పూర్తిగా తెరిచివుంది డాబా పిట్టగోడ దగ్గిరి కెళ్ళి డాక్టర్ పడిన స్థలాన్ని గమనించాడు విజయ్ నేలమీదనించి డాబా పిట్టగోడ వరకూ గల ఎత్తు సుమారు పదిహేనడుగు లుంటుంది డాబామీద ఆనంద్‌కి చెందిన ఒక స్లిప్పర్ పడివుంది మరొకటి కిందన అతని శవం వున్న చోటికి రెండడుగుల దూరంలో గడ్డి మధ్య పడివుంది రాత్రి పడిన వర్షానికి డాబాకూడ ఇంకా తడితడిగా వుంది చుట్టూ పరికిస్తున్న విజయ్ దృష్టి అకస్మాత్తుగా పిట్టగోడ మీదున్న ఒక వస్తువుమీద పడింది దగ్గరికెళ్ళి చూసాడు సందేహం లేదు! డాక్టర్ మరణం వెనుక ఏదో పెద్ద కథే వుంది కారణం ఆ వస్తువు ఒక కత్తి!

దాన్ని జాగ్రత్తగా గమనించాడు విజయ్ పెద్ద కష్టపడక్కర్లేకుండానే దాన్ని గుర్తు పట్టాడు కూడ! క్రితం రాత్రి ఏపిల్ ఎళ్ళు కోయడానికి కల్యాణ్ ఉపయోగించిన కత్తి అది చాల ఖరీదైన కత్తి వాడిగా ఆరంగుళాల పొడవుండి వెండిపిడితో తళతళా మెరుస్తున్నది కత్తి వున్న స్థలానికి దగ్గర్లో డాబామీదున్న మరో వస్తువు కూడ విజయ్ దృష్టి నాకర్షించింది అది ఒక నాప్‌కిన్ రాత్రి డైనింగ్ టేబిల్ దగ్గర తామందరూ వాడిన నాప్‌కిన్స్‌లో ఒకటి

మరో మారు డాబా అంతా కలియజూసి వెనక్కి తిరిగాడు విజయ్ గుమ్మం దాటుతూ డాబా మీదకి తెరచివున్న తలుపువంక చూసాడు పూర్తి సన్‌మైకాతో చేసిన డోర్ అది గుమ్మం దాటి వరండాలోకి ప్రవేశించాడు విజయ్ వరండా అంతా నిశ్శబ్దంగా వుంది డాక్టర్ రూమ్‌కి పైన మామూలుగా గడియపెట్టబడి వుంది శామ్యూల్ వెల్లకిలా పడుక్కుని నిద్రపోతున్నాడు శామ్యూల్ బెడ్‌రూం ముందున్న డస్ట్‌బిన్‌లో మళ్ళీ నాలుగైదు డజన్ల డన్‌హిల్ పీకలు ప్రత్యక్షమయ్యాయి డస్ట్‌బిన్ వంక చూస్తున్న విజయ్ దృష్టి అకస్మాత్తుగా ఫ్లోర్‌మీద పడింది ఇటీవలే పాలిష్ పెట్టిన షాబాద్ పలకలతో అద్దంలా మెరుస్తున్న ఫ్లోరది ఆసక్తిగా చూసాడు ఆ ఫ్లోర్‌వంక

పాదాల గుర్తులు!

రాత్రి ఎవరో డాబామీదకి వెళ్ళినట్టున్నారు రాత్రిపడిన వర్షం వల్ల డాబామీదుండే దూళి వారి పాదాల కంటుకుని అద్దంలా మెరుస్తున్న ఆ

ఫ్లోర్‌మీద అస్పష్టంగా ముద్రలు వేసింది మరింత జాగ్రత్తగా గమనించాడు విజయ్ ఆ గుర్తులు డాబా గుమ్మం నించి మొదలయి శామ్యూల్ గదివరకూ వున్నాయ్!

పాదాల గుర్తులు కనబడడంతో విజయ్‌లో రకరకాల అనుమానాలు మొలకెత్తాయి మరింత జాగ్రత్తగా ప్రతి విషయాన్ని పరిశీలించాలనుకున్నాడు ముందుగా డాబా గుమ్మం దగ్గర ఫ్లోర్‌ని పరిశీలించాడు

ఆశ్చర్యం!

డాబా గుమ్మం దగ్గర్నించి మెట్ల వైపు వెళ్ళిన మరో జత అడుగు జాడలు కనిపించాయి అవి ఆకు చెప్పుల జాడలు విజయ్ వాటి ననుసరించాడు అవి గోడవారగా మెట్లు దిగి డ్రాయింగ్‌హాల్‌ని అడ్డంగా క్రాస్ చేసి సింహ ద్వారం పక్కన నేలకి ఆరంగుళాల ఎత్తులో వున్న చిన్న షెల్ఫ్ దగ్గర ఆగాయి

విజయ్ ఆ షెల్ఫ్ తెరిచి చూసాడు చెప్పులు పెట్టుకునే షెల్ఫది అందులో వున్న అన్ని చెప్పుల జతల్ని వెనక్కి తిప్పి చూసాడు ఒక జత చెప్పులు కొద్దిగా తడిసినట్టున్నాయి మెట్లమీద నించి వచ్చిన జాడగుర్తులకి అవి సరిపోయాయి

ఆ చెప్పులు కల్యాణ్‌వి!

ముందురోజు తామందరూ బయటికి వెళ్ళినప్పుడు తనేసుకున్న స్లిప్పర్స్‌ని అందులో పడేసి ఆ ఆకు చెప్పులు వేసుకుని వచ్చాడు కల్యాణ్ పులిచర్మంతో చేయబడ్డ చెప్పులవి

విజయ్ వెనక్కి తిరిగి వచ్చాడు కల్యాణ్ తన బెడ్‌రూంలోంచి పోలీ స్టేషనుకి ఫోన్ చేస్తున్నాడు అతని రూం మెట్ల పక్కనే వుంది కల్యాణ్ రాకకోసం నిరీక్షిస్తూ మెట్లపక్కనే నిలబడ్డ విజయ్ దృష్టి ఆ మెట్లెక్కడానికి వేసిన అల్యూమినియం రెయిలింగ్‌పై పడింది

అతని భృకుటి ముడిపడింది

ఆ రెయిలింగ్ మీద పెయింట్ మరకలు! అక్కడక్కడ వేలిముద్రలు కూడ వున్నాయి విజయ్ మెట్లెక్కుతూ ఆ పెయింట్ మరకల్ని గమనించసాగాడు నాలుగు మెట్లవరకే ఉన్నాయవి ఆ తర్వాత లేవు ముందురోజు తను మెట్లెక్కినప్పుడు ఎటువంటి మరకలూ లేకుండా తళతళలాడుతోంది ఆ రెయిలింగ్ ఉదయానికల్లా ప్రత్యక్షమయ్యాయి ఈ మరకలు అంటే దీన్నిబట్టి గడచిన రాత్రి ప్రకాష్ కూడ మేడమీదకి వచ్చి వుండాలి! కాని సగం వరకే ఎక్కి ఎందుకు దిగివాయినట్టు?



## సాక్షి

విజయ్ యిలా ఆలోచిస్తుండగానే కల్యాణ్ ఫోన్ చెయ్యడం ముగించి బయటికి వచ్చాడు

'హాస్పిటల్ స్టాఫ్ అంబులెన్స్ తీసుకుని వస్తున్నారు పేపరు ఎడ్వర్‌టైజ్‌మెంటు కూడ యిస్తామన్నారు రేపు సాయంత్రం వరకు హాస్పిటల్లోనే శవాన్ని వుంచి చూడవలసిన వాళ్ళందరూ చూసేక సాయంత్రం క్రిమేట్ చేస్తామన్నారు పోలీస్‌స్టేషనుకి ఫోన్ చేసాను ఇన్‌స్పెక్టర్ జీపేసుకుని యింకేదో పనిమీద వెళ్ళాట్ట అరగంటలో వస్తామన్నారు అంతవరకూ ఎవర్ని ఏది టచ్ చెయ్యొద్దన్నారు పై ఆఫీసర్‌కి రిపోర్టిస్తున్న ఉద్యోగిలా అన్ని వివరాలు చెప్పాడు కల్యాణ్

అతను మాట్లాడుతున్నప్పుడే అతని పాదాల వంక చూసాడు విజయ్

కల్యాణ్ స్లిప్పర్స్ వేసుకుని వున్నాడు

రాత్రి నువుకాని మేడమీదకి వచ్చావా? యదాలాపంగా అడిగాడు కల్యాణ్‌ని

అబ్బే! లేదే! అన్నాడు కల్యాణ్

మైత్రేయి ఎక్కడ?

ఆ బెడ్‌రూంలో వుంది మధ్య బెడ్‌రూం వంక చూపించాడు కల్యాణ్ తన బెడ్‌రూం కాకుండా మైత్రేయి కోసం ప్రత్యేకంగా మరో బెడ్‌రూం కేటాయించాడు కల్యాణ్ దాని పక్కన ప్రకాష్ వుంటున్న బెడ్‌రూం వుంది

పోలీసు లొచ్చేలోపల నేనందరితో విడివిడిగా మాట్లాడాలనుకుంటున్నాను అన్నాడు విజయ్

కల్యాణ్ ముఖం అదోలా అయిపోయింది అయినా దాన్ని కనబడనియకుండా ష్యూర్ ష్యూర్ అన్నాడు

విజయ్ మైత్రేయి గదివైపు దారితీసాడు

మైత్రేయి గది తలుపు తెరిచే వుంది విజయ్ ప్రవేశించేసరికి ఆమె కిటికీ దగ్గర కుర్చీలో ఉదాసీనంగా కూర్చుని వుంది

గదిలో ప్రవేశించి చిన్నగా దగ్గాడు విజయ్ మైత్రేయి తల తిప్పి చూసింది విజయ్‌ని చూడగానే లేచి నించుంది ఆమె చాలసేపుబట్టి ఏడుస్తున్నట్టు ఆమె కళ్ళే చెబుతున్నాయి కలువల మధ్య ఎర్ర గులాబీల్లా వున్నాయవి ఆ కళ్ళతో విజయ్ మొహంలోకి ఒక్కక్షణం సూటిగా చూసి తిరిగి కిటికీ వైపు దృష్టి సారించిందామె

మీరెందుకొచ్చారో నాకు తెలుసు ఆనంద్ చావుకి కారణం నేనే మీ చట్ట ప్రకారం ఏ శిక్ష విధించినా అనుభవించడానికి సిద్ధంగా వున్నాను కిటికీ బయట కనిపిస్తున్న పూలమొక్కల వంక చూస్తూ నెమ్మదిగా అంది

నా కర్థమయ్యేలా చెప్పండి నిదానంగా అన్నాడు విజయ్

తిరిగి తల తిప్పి విజయ్ కళ్ళలోకి విషాదంగా చూసింది మైత్రేయి

చెప్పడం వల్ల ప్రయోజనం? అడిగిందతన్ని

తర్వాత తెలుస్తుంది మీరే చూస్తారు అన్నాడు విజయ్

అయితే చెప్తా వినండి తిరిగి కిటికీలోంచి దృష్టి సారిస్తూ అంది మైత్రేయి

"దాదాపు రెండు నెలలక్రితం మా మేరేజికి వచ్చారు మీరు గుర్తుంది కదా ఆ మేరేజి ఏ పరిస్థితుల్లో జరిగిందో యిప్పుడు చెప్తా వినండి

-- మైత్రేయి చెప్పసాగింది విజయ్ మౌనంగా వింటున్నాడు

నేను యూనివర్సిటీలో చదువుతున్నప్పుడే ఆనంద్‌తో పరిచయమయింది ఆ యేడు మిక్స్‌డ్ డబుల్స్‌లో మేమిద్దరం చాంపియన్‌షిప్ గెల్చుకున్నాం అప్పుడయిన పరిచయమే మమ్మల్ని మరింత సన్నిహితులుగా చేసింది ఆ సంవత్సరమే మెడిసిన్ పూర్తి చేసిన ఆనంద్ తన స్నేహితులూ సీనియర్సూ అయిన యిద్దరు డాక్టర్లు స్థాపించిన ఒక ప్రైవేట్ నర్సింగ్‌హోమ్‌లో డాక్టరుగా జీవితం ప్రారంభించేడు మరుసటి సంవత్సరం ఎం ఏ పూర్తి చేసిన నేను కాలక్షేపానికి ఆ నర్సింగ్‌హోమ్‌లో నర్సుగా పని చేస్తానన్నాను ఆనంద్ మొదట్లో నా ఉద్దేశాన్ని వ్యతిరేకించినా, నా పట్టుదల చూసి తర్వాత వప్పుకున్నాడు నర్సులు నిర్వర్తించాల్సిన విధులన్నీ రెండు నెలల యింటెన్సివ్ ట్రైనింగ్ ద్వారా నేర్పాడు నాకు మా పరిచయం మరింత బలపడింది ఉత్తరాలు రాసుకోడం కవితలు అల్లుకోడం మొదలు పెట్టాం త్వరలో వివాహం చేసుకోవాలని కూడ నిర్ణయించుకున్నాం సరిగ్గా ఆ సమయంలోనే మా క్లినిక్‌లో జాయినయ్యాడు కల్యాణ్ వంటికి ఏమి పడటంలేదని చాల నీరసంగా వుంటోందని చెప్పాడు పరీక్షలు జరిపాం పరీక్షల్లో అతి భయంకరమైన విషయ మొకటి వెలుగులోకి వచ్చింది కల్యాణ్ మరో మూడు నెలలకన్నా ఎక్కువ బ్రతకడు! అతనికి సంక్రమించింది సామాన్యమైన జబ్బు కాదు! ల్యూకేమియా అంటే బ్లడ్‌కాన్సర్ అనే అత్యంత ప్రమాదకరమైన వ్యాధని మాకు తెలిసింది ఆనంద్ ఈ విషయం నాకు చెప్తున్నప్పుడు లాబ్ పక్కగా వచ్చిన కల్యాణ్ మా సంభాషణ వినడం తటస్థించింది దాంతో అతను మానసికంగా మరింత కృంగిపోయాడు ఆనంద్ మాత్రం అతనికి పూర్తి భరోసా యిచ్చాడు అందరూ ఊహించుకుంటున్నంత ప్రమాదకరమైన వ్యాధేమి కాదని మూడు నెలల కాలంలో తను చికిత్స చేసి ఈ వ్యాధిని పూర్తిగా నయం చేస్తానని అలా చెయ్యలేకపోతే డాక్టరుగా యికముందు ప్రాక్టీసు చెయ్యబోనని ప్రమాణం చేసాడు అతనిచ్చిన భరోసాతో కల్యాణ్‌లో కొద్దిగా ఆశ చిగురించింది ఆనంద్ ట్రీట్‌మెంట్ ప్రారంభించాడు కల్యాణ్ బెడ్ దగ్గర నన్ను పెర్మనెంట్ ఎటెండర్‌గా నియమించాడు అతనికే సమయంలో ఏఏ మందు లివ్వాలి ఏఏ సమయంలో ఆహారం యివ్వాలి అనే విషయాలతో బాటు అతని స్నానానికి ఏర్పాట్లు చెయ్యడం సాయం వేళల్లో షికారు తిప్పడం వంటి సాధారణ విషయాలు కూడ ఆనంద్ ఆదేశంమీద నేనే చేసేదాన్ని ఆ సమయంలోనే మీ అందరి గురించి చెప్పేవాడు కల్యాణ్ మీరతని ప్రాణ స్నేహితుడని డ్యూటీ విషయంలో చాల నిక్కచ్చిగా వుంటారని చెప్పేవాడు కాని తనీ విధమైన జబ్బుకి లోనైనట్టు తెలిస్తే మీరు తట్టుకోలేరని ఎన్నాళ్ళైనా సరే శెలవుపెట్టి తన దగ్గర వుండిపోతారని దానివల్ల మీ అమూల్యమైన కాలం వృధా అయిపోతుందని చెప్పి మీకు ఉత్తరం రాయలేదని చెప్పేవాడు నన్ను ఎదురుగా కూర్చోమని చెప్పి యింకా ఎవేవో విషయాలు గంటల తరబడి మాట్లాడేవాడు ట్రీట్‌మెంట్ జరుగుతున్న సమయంలో ఓ రోజు నా బర్త్‌డే వస్తే ఆ విషయం తెలిసి కానుకగా ఒక కాస్ట్లీ నక్లెస్ బహూకరించాడు నాకు అతనంత విపరీతంగా ప్రవర్తించడం యిబ్బందిగా వుండేది నాకు అయినా ఆనంద్ హెచ్చరించడం వల్ల ఏమీ అనలేకపోయేదాన్ని

మూడు నెలలు గడిచాయి ఓ రోజు లాబ్‌లో కల్యాణ్ రక్తం పరీక్షిస్తున్న ఆనంద్ నన్ను దగ్గరకి రమ్మని కేకేశాడు మైత్రీ గ్రాండ్ సక్సెస్ టెన్నిస్ ఆటలోనే కాదు ట్రీట్‌మెంటులో కూడ మనిద్దరం కలిస్తే అపజయమన్నది లేదు వెళ్ళి కల్యాణ్‌తో చెప్పు అతని వ్యాధి పూర్తిగా నయమైపోయిందని అన్నాడు ఉత్సాహంగా నాతో చేయి కలుపుతూ నేను కూడ ఉత్సాహం పట్టలేకపోయాను ఈజిట్ అంటూ అతని చేతినుండి విడిపించుకుని కల్యాణ్ రూంలోకి పరిగెత్తి ఆయాసపడుతూ చెప్పాని శుభవార్త అతనికి అప్పుడే నేనూహించని సంఘట నొకటి జరిగిపోయింది చెప్పడానికి సంశయిస్తున్నట్టుగా ఆగిపోయింది మైత్రేయి.

చెప్పండి ఏమీ దాచొద్దు నన్ను మీ స్నేహితుడిగా గుర్తించుకోండి మృదువుగా అన్నాడు విజయ్. (ఇంకాఉంది)

## పాళీ-పడతి

పాళీ వంటిది పడతి జీవితం
పేనాలాంటి వాడు పురుషుడు
నేల జారితే చిట్లేది పాళీ బ్రతుకే
పేనాకేం!
మరో పాళీని ధరిస్తుంది''

- అనంత వేంకటేశన్

ఫ్లోర్‌మీద అస్పష్టంగా ముద్రలు వేసింది మరింత జాగ్రత్తగా గమనించాడు విజయ్ ఆ గుర్తులు డాబా గుమ్మం నించి మొదలయి శామ్యూల్ గదివరకూ వున్నాయ్'

పాదాల గుర్తులు కనబడడంతో విజయ్‌లో రకరకాల అనుమానాలు మొలకెత్తాయి మరింత జాగ్రత్తగా ప్రతి విషయాన్ని పరిశీలించాలనుకున్నాడు ముందుగా డాబా గుమ్మం దగ్గర ఫ్లోర్‌ని పరిశీలించాడు

ఆశ్చర్యం'

డాబా గుమ్మం దగ్గర్నించి మెట్ల వైపు వెళ్ళిన మరో జత అడుగు జాడలు కనిపించాయి అవి ఆకు చెప్పుల జాడలు విజయ్ వాటి ననుసరించాడు అవి గోడవారగా మెట్లు దిగి డ్రాయింగ్‌హాల్‌ని అడ్డంగా క్రాస్ చేసి సింహ ద్వారం పక్కన నేలకి అరంగుళాల ఎత్తులో వున్న చిన్న షెల్ఫ్ దగ్గర ఆగాయి

విజయ్ ఆ షెల్ఫ్ తెరిచి చూసాడు చెప్పులు పెట్టుకునే షెల్ఫది అందులో వున్న అన్ని చెప్పుల జతల్ని వెనక్కి తిప్పి చూసాడు ఒక జత చెప్పులు కొద్దిగా తడిసినట్టున్నాయి మెట్లమీద నించి వచ్చిన జాడగుర్తులకి అవి సరిపోయాయి

అందులో పడేసి ఆ ఆకు చెప్పులు వేసుకుని వచ్చాడు కల్యాణ్ పులిచర్మంతో చేయబడ్డ చెప్పులవి

విజయ్ వెనక్కి తిరిగి వచ్చాడు కల్యాణ్ తన బెడ్‌రూంలోంచి పోలీ స్టేషనుకి ఫోన్ చేస్తున్నాడు అతని రూం మెట్ల పక్కనే వుంది కల్యాణ్ రాకకోసం నిరీక్షిస్తూ మెట్లపక్కనే నిలబడ్డ విజయ్ దృష్టి ఆ మెట్లెక్కడానికి వేసిన అల్యూమినియం రైలింగ్‌పై పడింది

అతని భృకుటి ముడిపడింది

ఆ రైలింగ్ మీద పెయింట్ మరకలు' అక్కడక్కడ వేలిముద్రలు కూడ వున్నాయి విజయ్ మెట్లెక్కుతూ ఆ పెయింట్ మరకల్ని గమనించసాగాడు నాలుగు మెట్లవరకే ఉన్నాయవి ఆ తర్వాత లేవు ముందురోజు తను మెట్లెక్కినప్పుడు ఎటువంటి మరకలూ లేకుండా తళతళలాడుతోంది ఆ రైలింగ్ ఉదయానికల్లా ప్రత్యక్షమయ్యాయి ఈ మరకలు అంటే దీన్నిబట్టి గడచిన రాత్రి ప్రకాష్ కూడ మేడమీదకి వచ్చి వుండాలి' కాని సగం వరకే ఎక్కి ఎందుకు దిగిపోయినట్టు?



## సాక్షి

విజయ్ యిలా ఆలోచిస్తుండగానే కల్యాణ్ ఫోన్ చెయ్యడం ముగించి బయటికి వచ్చాడు

హాస్పిటల్ స్టాఫ్ అంబులెన్స్ తీసుకుని వస్తున్నారు పేపరు ఎడ్వర్టైజ్మెంటు కూడ యిస్తామన్నారు రేపు సాయంత్రం వరకు హాస్పిటల్లోనే శవాన్ని వుంచి చూడవలసిన వాళ్ళందరూ చూసేక సాయంత్రం క్రిమేట్ చేస్తామన్నారు పోలీస్‌స్టేషనుకి ఫోన్ చేసాను ఇన్స్పెక్టర్ జీపేసుకుని యింకేదో పనిమీద వెళ్ళాట్ట అరగంటలో వస్తామన్నారు అంతవరకూ ఎవర్నీ ఏదీ టచ్ చెయ్యొద్దన్నారు పై ఆఫీసర్‌కి రిపోర్టిస్తున్న ఉద్యోగిలా అన్ని వివరాలు చెప్పాడు కల్యాణ్

అతను మాట్లాడుతున్నప్పుడే అతని పాదాల వంక చూసాడు విజయ్

కల్యాణ్ స్లిప్పర్స్ వేసుకుని వున్నాడు

రాత్రి నువుకాని మేడమీదకి వచ్చావా? యదాలాపంగా అడిగాడు కల్యాణ్‌ని

అబ్బే! లేదే! అన్నాడు కల్యాణ్

మైత్రేయి ఎక్కడ?

ఆ బెడ్‌రూంలో వుంది మధ్య బెడ్‌రూం వంక చూపించాడు కల్యాణ్ తన బెడ్‌రూం కాకుండా మైత్రేయి కోసం ప్రత్యేకంగా మరో బెడ్‌రూం కేటాయించాడు కల్యాణ్ దాని పక్కన ప్రకాష్ వుంటున్న బెడ్‌రూం వుంది

పోలీసు లొచ్చేలోపల నేనందరితో విడివిడిగా మాట్లాడాలనుకుంటున్నాను అన్నాడు విజయ్

కల్యాణ్ ముఖం అదోలా అయిపోయింది అయినా దాన్ని కనబడనియకుండా ష్యూర్ ష్యూర్ అన్నాడు

విజయ్ మైత్రేయి గదివైపు దారితీసాడు

మైత్రేయి గది తలుపు తెరిచే వుంది విజయ్ ప్రవేశించేసరికి ఆమె కిటికీ దగ్గర కుర్చీలో ఉదాసీనంగా కూర్చుని వుంది

గదిలో ప్రవేశించి చిన్నగా దగ్గాడు విజయ్ మైత్రేయి తల తిప్పి చూసింది విజయ్‌ని చూడగానే లేచి నించుంది ఆమె చాలసేపుబట్టీ ఏడుస్తున్నట్టు ఆమె కళ్ళే చెబుతున్నాయి కలువల మధ్య ఎర్ర గులాబీల్లా వున్నాయవి ఆ కళ్ళతో విజయ్ మొహంలోకి ఒక్కక్షణం సూటిగా చూసి తిరిగి కిటికీ వైపు దృష్టి సారించిందామె

మీరెందుకొచ్చారో నాకు తెలుసు ఆనంద్ చావుకి కారణం నేనే మీ చట్ట ప్రకారం ఏ శిక్ష విధించినా అనుభవించడానికి సిద్ధంగా వున్నాను కిటికీ బయట కనిపిస్తున్న పూలమొక్కల వంక చూస్తూ నెమ్మదిగా అంది

నా కర్థమయ్యేలా చెప్పండి నిదానంగా అన్నాడు విజయ్

తిరిగి తల తిప్పి విజయ్ కళ్ళలోకి విషాదంగా చూసింది మైత్రేయి

చెప్పడం వల్ల ప్రయోజనం? అడిగిందతన్ని

తర్వాత తెలుస్తుంది మీరే చూస్తారు అన్నాడు విజయ్

అయితే చెప్తా వినండి తిరిగి కిటికీలోంచి దృష్టి సారిస్తూ అంది మైత్రేయి

"దాదాపు రెండు నెలల క్రితం మా మేరేజికి వచ్చారు మీరు గుర్తుంది కదా ఆ మేరేజి ఏ పరిస్థితుల్లో జరిగిందో యిప్పుడు చెప్తా వినండి

మైత్రేయి చెప్పసాగింది విజయ్ మౌనంగా వింటున్నాడు

నేను యూనివర్సిటీలో చదువుతున్నప్పుడే ఆనంద్‌తో పరిచయమయింది ఆ యేడు మిక్స్‌డ్ డబుల్స్‌లో మేమిద్దరం చాంపియన్‌షిప్ గెల్చుకున్నాం అప్పుడయిన పరిచయమే మమ్మల్ని మరింత సన్నిహితులుగా చేసింది ఆ సంవత్సరమే మెడిసన్ పూర్తి చేసిన ఆనంద్ తన స్నేహితులూ సీనియర్సూ అయిన యిద్దరు డాక్టర్లు స్థాపించిన ఒక ప్రైవేట్ నర్సింగ్‌హోమ్‌లో డాక్టరుగా జీవితం ప్రారంభించేడు మరుసటి సంవత్సరం ఎం ఏ పూర్తి చేసిన నేను కాలక్షేపానికి ఆ నర్సింగ్‌హోమ్‌లో నర్సుగా పని చేస్తున్నాను ఆనంద్ మొదట్లో నా ఉద్దేశాన్ని వ్యతిరేకించినా, నా పట్టుదల చూసి తర్వాత వప్పుకున్నాడు నర్సులు నిర్వర్తించాల్సిన విధులన్నీ రెండు నెలల యింటెన్సివ్ ట్రైనింగ్ ద్వారా నేర్పాడు నాకు మా పరిచయం మరింత బలపడింది ఉత్తరాలు రాసుకోడం కవితలు అల్లుకోడం మొదలు పెట్టాం త్వరలో వివాహం చేసుకోవాలని కూడ నిర్ణయించుకున్నాం సరిగ్గా ఆ సమయంలోనే మా క్లినిక్‌లో జాయినయ్యాడు కల్యాణ్ వంటికి ఏమి పడటంలేదని చాల నీరసంగా వుంటోందని చెప్పాడు పరీక్షలు జరిపాం పరీక్షల్లో అతి భయంకరమైన విషయమొకటి వెలుగులోకి వచ్చింది కల్యాణ్ మరో మూడు నెలలకన్నా ఎక్కువ బ్రతకడు! అతనికి సంక్రమించింది సామాన్యమైన జబ్బు కాదు! ల్యూకేమియా అంటే బ్లడ్‌కాన్సర్ అనే అత్యంత ప్రమాదకరమైన వ్యాధని మాకు తెలిసింది ఆనంద్ ఈ విషయం నాకు చెప్తున్నప్పుడు లాబ్ పక్కగా వచ్చిన కల్యాణ్ మా సంభాషణ వినడం తటస్థించింది దాంతో అతను మానసికంగా మరింత కృంగిపోయాడు ఆనంద్ మాత్రం అతనికి పూర్తి భరోసా యిచ్చాడు అందరూ ఊహించుకుంటున్నంత ప్రమాదకరమైన వ్యాధేమి కాదని మూడు నెలల కాలంలో తను చికిత్స చేసి ఈ వ్యాధిని పూర్తిగా నయం చేస్తానని అలా చెయ్యలేకపోతే డాక్టరుగా యికముందు ప్రాక్టీసు చెయ్యబోనని ప్రమాణం చేసాడు అతనిచ్చిన భరోసాతో కల్యాణ్‌లో కొద్దిగా ఆశ చిగురించింది ఆనంద్ ట్రీట్‌మెంట్ ప్రారంభించాడు కల్యాణ్ బెడ్ దగ్గర నన్ను పెర్మనెంట్ ఎటెండర్‌గా నియమించాడు అతనికే సమయంలో ఏఏ మందులివ్వాలి ఏఏ సమయంలో ఆహారం యివ్వాలి అనే విషయాలతో బాటు అతని స్నానానికి ఏర్పాట్లు చెయ్యడం సాయం వేళల్లో షికారు తిప్పడం వంటి సాధారణ విషయాలు కూడ ఆనంద్ ఆదేశంమీద నేనే చేసేదాన్ని ఆ సమయంలోనే మీ అందరి గురించి చెప్పేవాడు కల్యాణ్ మీరతని ప్రాణ స్నేహితుడని డ్యూటీ విషయంలో చాల నిక్కచ్చిగా వుంటారని చెప్పేవాడు కాని తని విధమైన జబ్బుకి లోనైనట్టు తెలిస్తే మీరు తట్టుకోలేరని ఎన్నాళ్ళైనా సరే శెలవుపెట్టి తన దగ్గర వుండిపోతారని దానివల్ల మీ అమూల్యమైన కాలం వృధా అయిపోతుందని చెప్పి మీకు ఉత్తరం రాయలేదని చెప్పేవాడు నన్ను ఎదురుగా కూర్చోమని చెప్పి యింకా ఏవేవో విషయాలు గంటల తరబడి మాట్లాడేవాడు ట్రీట్‌మెంట్ జరుగుతున్న సమయంలో ఓ రోజు నా బర్త్‌డే వస్తే ఆ విషయం తెలిసి కానుకగా ఒక కాస్ట్లీ నక్లేస్ బహూకరించాడు నాకు అతనంత విపరీతంగా ప్రవర్తించడం యిబ్బందిగా వుండేది నాకు అయినా ఆనంద్ హెచ్చరించడం వల్ల ఏమీ అనలేకపోయేదాన్ని

మూడు నెలలు గడిచాయి ఓ రోజు లాబ్‌లో కల్యాణ్ రక్తం పరీక్షిస్తున్న ఆనంద్ నన్ను దగ్గరకి రమ్మని కేకేశాడు మైత్రీ గ్రాండ్ సక్సెస్ టెన్నిస్ ఆటలోనే కాదు ట్రీట్‌మెంటులో కూడ మనిద్దరం కలిస్తే అపజయమన్నది లేదు వెళ్ళి కల్యాణ్‌తో చెప్పు అతని వ్యాధి పూర్తిగా నయమైపోయిందని అన్నాడు ఉత్సాహంగా నాతో చేయి కలుపుతూ నేను కూడ ఉత్సాహం పట్టలేకపోయాను ఈజిట్ అంటూ అతని చేతినుండి విడిపించుకుని కల్యాణ్ రూంలోకి పరిగెత్తి ఆయాసపడుతూ చెప్పాని శుభవార్త అతనికి అప్పుడే నేనూహించని సంఘటనొకటి జరిగిపోయింది చెప్పడానికి సంశయిస్తున్నట్టుగా ఆగిపోయింది మైత్రేయి.

చెప్పండి ఏమీ దాచొద్దు నన్ను మీ స్నేహితుడిగా గుర్తించుకోండి మృదువుగా అన్నాడు విజయ్ (ఇంకావుంది)

## పాళీ-పడతి

పాళీ వంటిది పడతి జీవితం
పేనాలాంటి వాడు పురుషుడు
నేల జారితే చిట్లేది పాళీ బ్రతుకే
పేనాకేం!
మరో పాళీని దరిస్తుంది"

- అనంత వేంకటేశన్






# గోపి

## వంటింటి మర

జీవితకాలం ఉచిత సర్వీసు



మర వేసిన పదార్థాన్ని సేకరించేందుకు గుండ్రని పాత్ర అదనం.

"వంటింట్లో గోపీ నాకెదురుగా వుంటే కష్టం తెలీకుండా పనిని చకచకా చేసుకుపోగల్ను! ఎందుకో తెల్సా? మూడు జార్లు, ఒక మెషీన్‌తో బాటు ఆధునిక సాంకేతిక పరిజ్ఞానంతో గోపీ వుంటాడు – వీటన్నిటికీ అదనంగా ఖర్చు పెట్టాల్సిందేమీ లేదు.

పొడులు చేసుకోవాలనుకున్నా, పిండి రుబ్బుకోవాలనుకున్నా, క్షణాల్లో అందుకనుగుణంగా మార్చగల సౌకర్యం గోపీ దగ్గరే వుంది.

ఇంతేకాక కొన్ని ప్రత్యేకమైన పనులకు అవసరమైన అనుబంధ పరికరాలు చాలా వున్నాయి గోపీ దగ్గర. ప్రతిదీ విడివిడిగానే వుంటుంది. వాటిని విడివిడిగా కొంటే నాకెంత ఖర్చవుతుందో, గోపీవల్ల నాకెంత డబ్బు ఆదానో ఒకసారి ఆలోచించండి!

గోపీకున్న భారీ సామర్థ్యంగల మోటారును నేను ఎంతసేపైనా నిర్భయంగా ఉపయోగిస్తాను. వంటింట్లో గోపీవుంటే చాలు. వంటింట్లో పని రాకెట్ స్పీడుతో జరిగిపోతుంది నాకు.

కొత్తమార్పులతో రూపొందించిన లాకెట్టి సిస్టం, స్క్రూపర్ లిడ్, మరియు బహు విధాలుగ వుపయోగించే అందమైన థర్మోకోల్ ప్యాకింగుతో లభ్యమయ్యే గోపీ నిస్సందేహంగా మిక్సీల రాజే!

కొత్తమార్పులతో రూపొందించిన లాకెట్టి సిస్టం, స్క్రూపర్ లిడ్, మరియు బహు విధాలుగ వుపయోగించే అందమైన థర్మోకోల్ ప్యాకింగుతో లభ్యమయ్యే గోపీ నిస్సందేహంగా మిక్సీల రాజే!

ఉచితం! నిర్లిప్




ఆంధ్రప్రదేశ్, కర్నాటక, తమిళనాడులలో విక్రయదారులు:

**త్రిష్ట మార్కెటింగ్ ప్రయివేట్ లిమిటెడ్**

బెంగుళూరు, ఫోన్: 563322 హైద్రాబాద్, ఫోన్: 221224 మద్రాసు, ఫోన్: 88599

## వ్యక్తిగతం



'నాసా'కి చెందిన అమెరికన్ స్పేస్ షటిల్ 'ఛాలెంజర్' జనవరి 28న కేప్ కానవెరాల్ నించి రోదసి యాత్రకి బయలుదేరిన 75 సెకన్లలోపే ప్రమాద వశాత్తు ఆకాశంలో పేలిపోయింది లోప భూయిష్టమైన బూస్టర్ రాకెట్ కారణంగానే ఈ ఘోర ప్రమాదం జరిగి ఉండవచ్చని భావిస్తున్నారు. దారుణమైన ఈ దుర్ఘటనలో ఛాలెంజర్‌లో అంతరిక్ష యాత్రకి బయలుదేరి వెళ్ళిన ఏడుగురు వ్యోమగాములు దుర్మరణం పాలైనారు. వీరిలో ఇద్దరు మహిళలు కూడా ఉన్నారు.....



బాషామ్ అంటే 'భాష్యా'నికి పట్టిన గతి అని కీ. శే. ఆర్థర్ లూవిన్ బాషామ్ పుస్తకాలు చదివిన వారికి ఎవరి కయినా అనిపించినా ఆశ్చర్యం లేదు!

భారతీయులకి తను గత చరిత్ర ఎక్కువగా పాశ్చాత్యుల ద్వారా, ఇంగ్లీషు భాషలో చదివి తెలుసుకోవటం అలవాటయి పోయింది. భారతీయులు సైతం ఇంగ్లీషులోనే అధికంగా రాస్తున్నారు.....

భారతదేశంలో (కనీసం పంజాబులో) ఒకప్పటి పరిస్థితి నేడు దక్షిణ ఆఫ్రికాలో కొనసాగుతున్నటువంటి దానిని పోలి ఉండేదని బాషామ్ ఒకసారి (ఫాదర్ హెరాస్ సంస్మరణ ఉపన్యాసంలో) అన్నారు. ఇది ఒక గమనించ తగిన వ్యాఖ్య......

# వారఫలం

**28-2-1986 శుక్రవారం నుండి 6-3-1986 గురువారం వరకు**

★ **మేషం** ఏది అనుకుంటారో అది చేయగలరు సాటివారి పోటిని ఎదుర్కొనగల సామర్థ్యం ఏర్పడుతుంది భూముల వలన వ్యాపార మూలాన అంతో యింతో నష్ఠి ఏర్పడే అవకాశమున్నది రాజకీయాలు ఏమాత్రం కలసి రావు స్త్రీలకు కుటుంబానందం ద్రవ్య లాభం

★ **వృషభం** ఇంట జరగవలసిన శుభ కార్యం వెనుకకు నెట్టబడుతుంది కార్యం జరిగినట్లే ఉండి చేయి జారిపోతుంది వాహన సంపాదన యందు కొంత జాప్యం జరగవచ్చు రాజకియంగా మి ఎత్తుగడలు సాగవు స్త్రీలకు ఉద్యోగమందు మేలు స్థలార్థ రిత్యా లాభం

★ **మిధునం** ఇతరుల కొరకు శ్రమించవలసిన సమయం అధిక శ్రమకు గురికావలసిన కాలం ఇంట శుభం జరుగుటకు యిప్పట్లో అవకాశంలేదు సాటివారి పోటిని ఎదుర్కొనవలసిన అగత్యమున్నది జాగ్రత్తగా సంచరించుట అవసరం స్త్రీలకు నూతన వ్యక్తుల పరిచయం వాహనం సంపాదించుకొనే అవకాశం

★ **కర్కాటకం** మి మూలంగా ఇతరులకు యిబ్బంది కలిగిందని శాంతి లోపించిందని వారి పనులు చెడిపోయాయనే నింద మోయవలసి రావచ్చు ఓర్మితో సంచరించటం ఎంతైనా న్యాయం రాత్రింబవళ్ళు శ్రమించినా ఒకానొక వ్యవహారం తేలదు స్త్రీలకు రాజకియంగా ఏమాత్రం కలసిరాని కాలం వ్యాపారం కూడా అంతంత మాత్రమే

★ **సింహం** ఉద్యోగ యత్నాలు త్వరలో నెరవేరగలవని గ్రహించుకోగలుగుతారు ఆశ్రయించినవారు చేయి వదలరు రాజకియంగా మి శ్రమ వృధా గాదు యత్నించండి వస్తుసేకరణకు అనువైన కాలం స్త్రీలకు స్థితిగతులయందు అభివృద్ధి చెప్పవచ్చు ఉత్తమ మిత్ర సంపద అమరుట వార విశేషం

★ **కన్య** పరుల చేత చిక్కిన డబ్బు ఎంతో శ్రమ మిదగాని చేతికి అందదు అయినా ప్రయోజనం? అందినది అలాగే ఖర్చు కావడం కూడా గమనిస్తారు స్థిరచరాస్తులందు అభివృద్ధి కనిపిస్తుంది రాజకియంగా మేలైన కాలమని చెప్ప వీలులేదు స్త్రీలకు ఉద్యోగమందు ప్రగతి లేక కొందరకు ప్రమోషన్ లభ్యం కాగలదు గ్రహించాలి

★ **తుల** మాటల ప్రకారం చేతలుండవలె ఏదో చెప్పి ఏదో చేయరాదు వ్యవహారరిత్యా యిబ్బందులు రాగలవు వ్యాపారమందు ప్రగతి చెప్ప వీలులేదు ఇరుగుపొరుగు వారి వలన ఇబ్బందులు రాగలవు స్త్రీలకు అనుకోనిది ఒకటి అయెడిది ఒకటి డబ్బుకు కటకట ఉన్నది

★ **వృశ్చికం** పోగొట్టుకున్న లాంటి వస్తువులు సేకరించుకొనుటకు తాపత్రయ పడుతుంటారు ఇరుగు పొరుగువారిచే మాటలు తినవలసిన యిబ్బంది ఏర్పడుతుంది వ్యాపారం కలసిరాదు చేసిన పనినే మరలా చేయవలసి రావచ్చు స్త్రీలకు ఆదాయం ఇతరుల సహాయం క్రయ విక్రయ లాభానికి అనుగుణ్యమైన గ్రహస్థితి

★ **ధనుస్సు** నూతనాంశాలు గ్రహిస్తారు ఏనాడో విబేదాలతో వదలిన బంధుసమాగమానికి ఆస్కారమున్నది శుభకార్యం తలపెట్టి వదులుకొంటారు కారణం ఏమయినా బంధు మిత్రుల నుండి రావల్సిన డబ్బు అందిరాదు ఎది ఎలాగైనా నిత్యకృత్యానికి యిబ్బందిరాదు స్త్రీలకు అకారణ వైరం ఆదాయ లోపం

★ **మకరం** అన్నివిధాలా మేలైన సమయం వస్తువాహనాలు సమకూర్చుకొనుటకు పాత అప్పులు తీర్చుటకు బాకీలు అతి కష్టం మిద వసూలు చేసుకొనుటకు అనుకూలం మాట మంచితనంతో పరులకు ఉపకరించటంతో కాలం వ్యయించుగలరు స్త్రీలకు చేసిన ఉద్యోగ యత్నాలు సఫలం చేసికొగలరు

★ **కుంభం** గ్రహానుకూలం చెప్ప వీలులేదు అనవసరపు తగాదాలు మనస్తాపాలు ఒకవేళ వ్యాపారాన యిబ్బందులు అధిక వ్యయం అడుగడుగునా కనిపిస్తాయి మి ఆశ్రయం కోరి కొందరు దగ్గరకు రానున్నారు సహాయం చేయవచ్చు కాని వృధా కాలక్షేపం చేయరాదు స్త్రీలకు దనలబ్ధి కొందరకు గౌరవార్హత

★ **మీనం** అనుకొన్న విధాన జరిగితే యికనేం? అలా జరగటం అసాధ్యం వ్యాపారమందు ఉద్యోగమందు మికు ఉత్సాహం ఆనందం కనిపించగల వారం అధిక వ్యయం సూచించబడే సమయం శుభకార్య నిమిత్తమే కావచ్చు స్త్రీలకు తలంచినంతకన్న ఆదాయం సాహితి మార్గాన ఆదాయం గౌరవం అభివృద్ధి చేకూరగలదు గత కొన్ని వారాలకన్నా మేలే గమనించాలి

-విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి

# మువ్వల సవ్వడి

మడత మంచం మీద ఆలోచనలతో ఇటునటు ఊగిసలాడుతున్న సీతారామయ్య- మంచం చేసే కరకర శబ్దానికి దగ్గర సావచ్చి పారి పోతున్న పిల్లిపిల్లలు ఒకదానినొకటి తేలికగా కరచుకుంటూ తులసి కోట చుట్టూ తిరుగుతున్నాయి ఎక్కడో చూలుకట్టి తన పంచ పురుడు పోసుకోవడానికి వచ్చిన పెద్ద ఎల్లి కడుపుతో వున్న కాంతం ఎన్నెన్నో చిలిపి కోర్కెలు కొబ్బరికోరుతో చేసిన పాయసం పరువు జామకాయలు ఇత్యాదులు

ఏవేం కావాలో చెప్పమ్మా! అత్తమ్మ చేసె పెడుతుంది కడుపుతో వున్న వారి కోర్కెలు ఇలానే వుంటాయని అమ్మ చెపుతుండేది అమ్మ లేక పోయినా నే వున్నానుగా? నాతో నేరుగా చెప్పలేక పోతే ఇదిగో డబ్బు

సీతారామయ్య కండ్ల వెంబడి నీళ్ళు మొదటి పురుడు పురుడు సులువుగా ఏ ప్రమాదం లేకుండ జరిగి పోయేటట్టు చేయి భగవంతుడా అని మ్రొక్కుకుంటున్నాడు

మడత మంచం పై నుంచి క్రిందికి వ్రేలాడుతున్న సీతారామయ్య చేతిని పిల్లి పిల్లలు కాలితో గోకి సంజ్ఞ చేస్తున్నాయి

కాంతం! అన్నంలో కొద్దిగా మజ్జిగ పోసి యీ



కొయిలి అప్పారావు

పిల్లి పిల్లలకు పెట్టమ్మా

తింటూనే వుంటాయి మళ్ళీ మ్యావ్ మ్యావ్ మని అరుస్తూనే వుంటాయి

సీతారామయ్య పకపక నవ్వుతూ అడక్క పోతే మనం పెట్టం కదమ్మా! ఆ ఎలుపు జాగ్రత్తగావిను ఆ ఎలుపు నీకు ఎలా వినిపిస్తుందో కాని నాకు మాత్రం అమ్మా అన్నట్టుందమ్మా అంటూ గోడనున్న బార్య ఫోటో ను చూశాడు అప్రయత్నంగా వస్తున్న కన్నీటిని తుడుచుకున్నాడు ఇంతలో కాంతం తెచ్చిన అన్నాన్ని ఎల్లి ఎల్లలు పోటీపడుతూ తింటున్నాయి

అవి అడక్కపోయినా కనిపెట్టి పెడు తుండాలమ్మా! పెట్టకపోతే చాటు మాటుగా పోయి తినడానికి ప్రయత్నిస్తాయి నీకూ నాకూ అది మానవ బాషలో దొంగతనం కాని వాటి బాషలో అది అవసరం ఆకలితీరే విదానం కొద్ది పాటి ఎంగిలి ముద్దచాలు తిని ఎ అరుగు మీదో పడుకుంటాయి ఎంత చిదరించు– తరిమికొట్టు– మళ్ళి చిన్న జాలి ఎలుపు పట్టెడు మెతుకులు చాలు తోకాడిస్తూ వస్తాయి పాత విషయాలు తృటిలో మరచి పోతాయి మనిషన్న వాడికి కిట్టనిది వాడి మంచికోసం చెప్పామనుకో! విరిగిపోతాడు మరి సందికి రాడు

కాంతం వింటూ కూర్చుంది

అత్తమ్మ చూడు తన బ్రతుకెలా ఐపోయిందో! అమ్మ పోయిన బాదలో నేనున్నాను అదే సమయంలో దాని భర్త దానిని విడిచి పెట్టాడు నేనంటూ వుండబట్టి గాని దాని బ్రతుకేం కాను? బాధల్ని తనలో ఇముడ్చుకుంటూ సంతోషంగా వున్నట్టు నటిస్తుంటుంది నీ పురిటి సమయంలో అత్తమ్మ అమ్మలానే చూసుకుంటుంది కాంతం

ఏం చేస్తాం నాన్నా! అంతే పెట్టి పుట్టాము మిరైనా వుండబట్టి నన్ను రమ్మన్నారు అది లేక మొదటి పురుడు అక్కడే పోసుకుంటే వాళ్లతో దెప్పుడు మాటలు పడటం మొదటి పురుడుకైనా అమ్మ గారిల్లు నోచుకో లేకపోయిందే అని ఎ ఒక్కరి నోటనైనా రాకమానదు

ఇంతలో సూరమ్మ బజారు నుంచి కూరగాయలు తీసుకు వచ్చింది సూరమ్మను చూడటమే తడవు పిల్లి ఎల్లలు మ్యావ్ మ్యావ్ మంటూ చుట్టు ముట్టాయి

ఎప్పుడు చూస్తే అప్పుడే ఆ కలాకలని అరుస్తుంటాయి పిల్లి పిల్లలు కాంతం అంది సూరమ్మ

కాంతం మాత్రం – డబ్బా పాలు అమ్మ పాలు ఇవి చాలవన్నట్టు ఇంకాకింక పెట్టేది వాళ్లమ్మ విసుగు ఇంతింత కాదు ఇది మనిషి పిల్లకాదు బూతం అనేది

అందరి నవ్వుల మధ్య కాంతం సిగ్గుపడుతూ ప్రక్కకుపోయింధి

ఇదిగో వేడివేడి జీడిపప్పు పకోడీ హల్వా – పెద్ద పొట్లాలు కట్టించి తీసుకొచ్చాను అంటూ సూరమ్మ కాంతానికి పొట్లాలిచ్చింది

పొట్లాలు విప్పి పిల్లి పిల్లలకు రెండు విసిరి

## బాగుపడేదెప్పుడు?

అష్ట కష్టాలు పడి
అందరిని కూడగట్టి
మానవత్వం మొక్క నాటి

ఆశయాల పందిరి వేసి
అశాంతిని తరిమికొట్టి
ప్రశాంత దీపం పెట్టి
నడుం కట్టి ముందుకు
అందరిని నడపబోతే
డబ్బు పురుగు ఎట్టి
మొక్క చచ్చిపోయింది
నాటు సారా గాలి కొట్టి
పందిరి పడిపోయింది
అధికార వాన కురిసి
దీప మారిపోయింది

-మంతెన విజయలక్ష్మి

## "మువ్వల సవ్వడి"

అత్తమ్మకూ తండ్రికి కొన్ని పెట్టి మిగిలినవి ఒంటరిగా కూర్చుని తింటూ పుట్టబోయే పాపాయి గురించి శ్రీవారు రాసే ప్రేమలేఖల గురించో ఆలోచిస్తోంది కులాసాగా గెంతుతున్న పిల్లి పిల్లల్ని చూస్తూ సీతారామయ్య కూతుర్ని కొడుకుని తలచుకుంటున్నాడు

ఆదరణతో చూసే భర్త కాంతానికి దొరికాడు కాని గోపి చదువు మాని విలాసంగా తిరగడాని కలవాటు పడ్డాడు ఇంట్లో కొన్ని వస్తువులు మాయమవడానికి వాడి దురలవాట్లు కారణమనుకుంటాను ఏ ఉద్యోగం చేస్తాడు ఎలా బ్రతుకుతాడు ఆ ఆలోచనల మధ్యలోనికి సుడిగాలిలా వచ్చాడు గోపి విపరీతంగా చికాకుపడి పోతున్నాడు ఎవేవో వింత కోర్కెలు అవి తీరక ఆరాటపడి పోతున్న మనసుతో వున్నాడు

కాసేపు అక్కదగ్గర కూర్చోరా గోపీ

నువ్వు చెపుతున్న నీతి పాఠాలు చాలక దాని దగ్గర కూడ నేర్చుకోవాలా నాన్నా!

ఎంత చెపుతున్నా మంచి మాటలు నీ చెవికెక్కడం లేదురా గోపి! ప్రస్తుత నీ ప్రవర్తన ఆదే మంచిదనుకుంటున్నావు యువక రక్తం పెద్దల మాటలు కాస్త వెగటుగానే వుంటాయి

కాసేపు మౌనం

లంచం కడితే ఒకాయన ఉద్యోగమిప్పిస్తా మన్నారు

ఆ మధ్య కట్టావుగా

వాడు నన్ను మోసం చేశాడు

మరి నీవు నన్ను మోసం చేస్తేనో?

గోపీ మండిపడి పోతున్నాడు కాంతం కలుగ చేసుకుందామని పైకి వచ్చింది ఇంతలో వీధిలోని పిల్లలు ఒకాయనను ఎల్లులున్న చోటికి తీసుకువచ్చారు

ఆ ఎల్లేనోయ్! మా కోడి పిల్లల్ని తినేసింది ఇంట్లో రోజూ మూతలు తీసి అన్నం తినేస్తోంది గోనె సంచిలో పట్టుకో

కర్ర పట్టుకుని దబీమని లేచాడు సీతారామయ్య పిల్లలతో పాటు పిల్లుల్ని పట్టేవాడు కూడ వెనుకకు తగ్గారు

ఇంతకూ ఎం చేస్తావేం ఎల్లుల్ని?

మెడికల్ కాలేజీకి అమ్ముకుంటాను

అబద్ధమెందుకు? నువ్వు కోసుకు తినడానికి కదూ!

తింటే తింటాడు మధ్యను ఊరి మీద బ్రతికే పిల్లుల సంగతి మీకెందుకు! రాత్రిం పగళ్ళు ఒకటే గొడవ నిద్ర పట్టదు వాడి వృత్తది

గోపి మాటలకు సీతారామయ్య కొడుకు వైపు మొదట జాలిగా చూశాడు తర్వాత కళ్ళెర్ర చేశాడు

వాటితో ఆడుకోవడం నాకలవాటైపోయిందిరా

నాతో చెలగాట మాడటం మీ కలవాటై పోయింది

అవి నన్ను పెంచి పోషిస్తాయని వాటి మీద జాలి ప్రేమ చూపిస్తున్నానురా గోపి! అమాయకంగా ఆడుకుంటున్న వాటిని నేనెంత సంతోషంతో చూస్తుంటానో నీకు తెలుసా! నీ మెడలో గొలుసు పైకి పోతే ఎవరైనా తస్కరిస్తారని అమ్మ బూచిరా గోపి అనేసరికి నీవు లోనికి పారిపోతుండే వాడివి అలానే అవి కూడ బయంతో వాడి వైపు నక్కినక్కి చూస్తున్నాయి

సీతారామయ్య కసిరి వాళ్లను తరిమాడు ఎలాగైనా సాధిస్తానని కోర మీసం తిప్పుకుంటూ వెళ్ళిపోయాడు పిల్లుల ఆదెయ్య

బాబూ గోపి! ఇంటి పరిస్థితులన్నీ నీకు తెలుసును మంచి మార్గం వెతుక్కో! విరక్తితో గాలివాటు జీవితం గడుపు దామనుకుంటూ సిగరెట్లు పేకాట దొంగతనం

గోపి మండిపోతూ చెప్పుడు మాటలు నేను సహించలేను నాన్నా అన్నాడు

అవును బాబూ! ఒకాయన నాకు చెప్పాడు ఆయన కొడుకు నీతో తిరిగి చెడిపోతున్నాడని చాల బాధ పడుతూ చెప్పాడు మగవాడు పుట్టగానే వంశాన్ని ఉద్ధరిస్తాడని ప్రతి కుటుంబం మురిసిపోతుంది అలా కాక అక్కడితోనే వంశాన్ని నిర్మూలిస్తుంటే చూస్తూ ఎలా ఊరుకునేది గోపీ

ఇంతలో అరుగు మీది నుంచి క్రిందికి దిగి వచ్చిన ఎల్లి పిల్లలు సీతారామయ్య చేతిని అందుకోడానికి ప్రయత్నిస్తున్నాయి తండ్రి మీది కోపం పిల్లుల మీద చూపించబోయి గోపి చేతికర్రతో గట్టిగా పిల్లుల్ని కొట్టబోవడము సీతారామయ్య అడ్డుకుని ఆ దెబ్బ భరించడమూ ఆ మూలుగుకు కాంతం సూరమ్మ పైకి రావడం అన్నీ తృటిలో జరిగిపోయాయి

సూరమ్మ గోపిని లోనికి బలవంతంగా

తీసుకుపోయింది

చేతికి తడిగుడ్డ కడుతున్న కొంతంతో అమ్మా! వీడు బాగుపడతాడా? అని కన్నీరు పెట్టాడు

ఎందుకు కావాలని తప్పు త్రోవ తొక్కుతున్నాడో నాకర్థం కావడం లేదమ్మా! అన్నాడు మళ్లీ

అడుగుతున్నప్పుడు అవసేరానికి మించిన డబ్బివ్వడం చాల అనర్థం నాన్నా! మా ఊర్లో ఒకబ్బాయిని ఇలానే అతిముద్దు చేశారు చేతికందిన డబ్బుతో మద్రాసు పారిపోయాడు అది కాస్తా హరించుకు పోగానే చిల్లర వేషాలు ఇప్పుడు చిన్నఎల్లల జైల్లో వున్నాడు

సీతారామయ్య వణికి పోతున్నాడు

గోపి కది ప్రాప్తించదు కదా! కుటుంబ గౌరవం మీద ఆ నల్లముద్రలు

తండ్రి ముఖం చూడలేక గోపి పైకి పోయాడు పిల్లులు దిమ్మెక్కి నక్కి నక్కి చూస్తున్నాయి

బాగు చేయాలని ఎంత ప్రయత్నించినా బాగుపడటం లేదు ఉడుకు రక్తం – వాడికి పుట్టిన బుద్ధేకాని పెద్దల మాట పెడచెవిని పెడుతున్నాడు నోరు లేనిది పాపం పిల్లిని కొట్టబోయాడు అదృష్టంకొద్దీ ఆ దెబ్బ నాకు తగిలంది దానికి తగిలి ఏ ఎముకైనా విరిగితే ఎంత బాధ పడుతుంది పాప పుణ్యాలకు బేదం తెలిసికోలేక పోతున్నాడు గోపి

సహవాస దోషం మీరన్నట్టు వాడింటికి చెడ్డ పేరు తెచ్చే సూచనలు కనుఎస్తున్నాయి నాన్నా

పైకి పోయిన గోపి వేప చెట్టు దగ్గర నిల్చున్నాడు ఆదెయ్య మరో చోట పిల్లిని పట్టిన గోనె సంచితో కనుపించాడు గోపి వాడిని దగ్గరకు ఎలిచి వీటిని తింటావని అంతా అంటారు అన్నాడు

అప్పుడప్పుడు తింటుంటాం తింటే మరొదిలి పెట్టరు ఆ పెద్ద పిల్లి బాగా బలిసింది ఆ ముసలాయన కర్రెత్తేసరికి తగ్గాను

అయన మా నాన్నేలే! సమయం కనిపెట్టి సంచిలో మూట కట్టుకుందువుగాని అప్పుడప్పుడొస్తుండు

అలాగే బాబూ!

కొంతానికి పురుటి నొప్పులు సూరమ్మ సీతారామయ్య ఇంటికి పూర్తిగా తాళాలు వేసి హాస్పిటల్‌కు పరుగెత్తారు లోన లేబర్ రూమ్ వద్ద సూరమ్మ పై వరండాలో బల్ల మీద కూర్చున్న సీతారామయ్యకు వివిధాలోచనలు ఎక్కడో చూలు కట్టి నా పంచను పురుడు పోసుకున్న పెద్ద పిల్లి పెళ్లి చేసుకోలేదు పిల్లల్ని కన్నది కనిన రోజు మంచి చెడ్డలు చూపించి శాంతులు చేయించుకోలేదు కడుపుతో వున్నప్పుడు ఏ కోర్కెలూ కోరలేదు పిల్లల్ని కని స్నానం చెయ్యలేదు నాలుక తోనే నాకి శుభ్రం చేసింది శరీరం కప్పుకోవటానికి గుడ్డలు లేవు మూడు నెలలకు ఎదిగి ఆరోగ్యంగా గెంతుతూ తిరుగుతున్నాయి మరి మనిషి? హాస్పిటల్‌లో పురుడు పదిమంది సహాయం కావాలి అడుగడుగున లంచాలు ఎన్ని పాల డబ్బాలు దిష్టి తగిలిందని రకరకాల చాదస్తపు పనులు కన్నవారికున్నా లేకపోయినా బంగారు గొలుసు చేతికి మురుగులు సిగ్గు బిళ్ళ ఇంతలో సూరమ్మ మరో గంటలో పురుడు రావచ్చంటున్నారు నీ వింటికి పోయి కావలసినవన్నీ తీసుకురా అన్నయ్యా! అంది

సుఖ ప్రసవం అయేటట్టు చేయి బగవంతుడా! అని ఇంటికి బయలుదేరాడు

ఇక్కడ ఇంటికి వచ్చిన గోపి తాళాలు చూసి విసుగెత్తి పోతూ ప్రక్కవారి నడిగాడు లేవనగానే కోపంతో చిందులు తొక్కాడు

కొంతమక్క వచ్చింవగ్గర నుండి డబ్బులవీ చేతిలో ఆడటములేదు ప్రతిదానికి వీళ్ళను చేతులు చాచి యాచించడంకాదు పెద్ద మొత్తంతో పరారై పోవాలి అనుకుంటుండగా అరుగు మీదున్న అన్ని పిల్లులూ ఆకలితో అరుస్తున్నాయి మెల్లగా తలుపు తాళం మేకుతో తీసి లోన దూరాడు అన్ని పిల్లులూ ఒకే మారు దూరి నానా హంగామా చేసి పెద్ద బీరువా మీదున్న అన్నం పెరుగు మున్నగు వాటిని పడగొట్టటం ప్రక్కింటివారా శబ్దానికి రావడం జరిగింది

తాళం లేకుండా వేసిన తాళం ఎలా తీశావు గోపి?

గోపి క్రోధంతో పైకి వచ్చి నిల్చున్నాడు ఇంతలో సీతారామయ్య రిక్షాలో ఇల్లు చేరుకున్నాడు పెద్ద శబ్దం చేసి తన పాచిక పారనివ్వని ఎల్లుల మీద మహా కోపంగా వున్నాడు గోపి

వేసిన తలుపులు బలవంతంగా తీయడానికి ప్రయత్నించావు కదూ

ఆ పిల్లులే గాని నానా హంగామా చెయ్యకపోతే ఇప్పటికేదైనా విలువైన వస్తువు తస్కరించే వాడేనేమో అన్నయ్యా! అంది పొరుగావిడ

స్వంత ఇంటిదైతే మాత్రం తాళం మేకులతో తీయడం ఎంత నేరం నయం సమయానికి శబ్దం విని రాబట్టిగాని ఏం చేసేవాడో ఏమో! ఆ పిల్లులదే ఆ పుణ్యమంతాను

గోపి ఎల్లుల మీద మండి పడిపోతున్నాడు ఎలాగైనా పిల్లుల వాడి కప్పు చెప్పు ప్రతీకారం తీర్చుకుంటానంటున్నాడు

నేరం నేరమే బాబూ! ఇదే పని పై వారింట్లో చేస్తేనో! జైలు శిక్ష తప్పదు అమ్మ ఫోటో చూడు బాబూ! నిన్ను చేతులు పట్టుకుని ప్రార్థిస్తున్నాను మంచి మార్గాన నడుచుకో ఇంట్లో అన్నమదీ వుంది వెంటనే తిను నేను తలుపులు మూసి హాస్పిటల్‌కు పోవాలి

గోపి బోంచేస్తున్నాడు పిల్లులు మారాం చేస్తున్నాయి నీ చేత్తో రెండు ముద్దలు వాటికి పెట్టరా గోపి తండ్రి మాట పెడ చెవిని పెట్టి విడిచి పెట్టకుండ తిన్నాడు సీతారామయ్య కొద్దిగా ఎల్లులకు వేసి తాను కూడ బోజనం చేసి తలుపులు బిగించి రెండు తాళాలు వేస బట్టలవీ పట్టుకొని హాస్పిటల్‌కు బయలుదేరాడు

ఎంత సేపని జాగరణ? తలుపులు తీసి ఉంచకూడదూ!

వేసినా నీకు తీసే సామర్థ్యముందిగా!

పైని ఒంటరిగా కూర్చున్న గోపికి పిల్లుల వెంట వస్తున్న ఆదెయ్య కనుఎంచాడు రావోయ్ రా! అక్కడే వుండు ఆ పెద్ద పిల్లిని ముందు పట్టుకో పీడ విరగడైపోతుంది అని అన్నం వేస్తున్నట్టు గిన్నె చప్పుడు చేసి పిలిచాడు తోకాడిస్తూ ఆనందంతో వచ్చిన ఎల్లిని ఆదెయ్య పట్టుకున్నాడు తన పథకం పాడు చేసిన పెద్ద పిల్లి ఆదెయ్య కాహారం ఆ యువక రక్తం అదే ఘనకార్యమనుకుని మురిసిపోతున్నాడు పిల్లులు తల్లి కోసం అరుస్తూ తిరుగుతున్నాయి

ఇక్కడ కొంతానికి కొడుకు పుట్టాడు సీతారామయ్య అల్లుడికి తంతి పంపాడు తల్లీ బిడ్డ క్షేమమని ఇంటికి హాస్పిటల్‌కి తిరగడంలో సీతారామయ్య వున్నాడు ఆ రెండు రోజుల్లో గోపి



మరో రెండు ఎల్లి పిల్లల్ని ఆదెయ్య కప్పచెప్పాడు మర్నాడు కాంతం హాస్పిటల్ నుంచి బాబుతో ఇంటికి వచ్చింది ఎకాకిగా మిగిలిన ఒకే ఒక పిల్లి ఎల్ల తల్లి కోసం తోడబుట్టిన వారి కోసం అరచి అరచి ఆఖరి అరుపు ఎంగిలి ముద్ద కన్నట్లు అరుస్తోంది తమ పరోక్షంలో గోపి దగ్గరుండి చేయించిన పనికి కాంతం సీతారామయ్య బాధపడుతూ ఎల్లికూనను బుజ్జగిస్తున్నారు ఇంతలో కాంతం అత్త మామలు బర్త తక్కిన బంధువులు వచ్చి బాబుకి నామకరణం చేశారు బాబుకి బంగారు గొలుసు ఆంజనేయస్వామి లాకెట్‌తో వున్నది చేయించి మెడలో వేశాడు సీతారామయ్య మరో రెండు రోజుల్లో ఎవరిళ్లకు వారు పోయారు

దగ్గర సావచ్చిన ఎల్లి ఎల్లను ప్రేమతో నిమిరి ఎర్ర రిబ్బనును దాని మెడలో బెల్టులా కట్టాడు సీతారామయ్య

యీ వేళ నుంచి ఇది నాది నా పెంపుడు ఎల్లి ఎవరైనా చేయి వేశారో అక్కడికక్కడే ఘోరం జరిగిపోకమానదు అంటూ గోపి వైపు చూశాడు చేతిలో డబ్బుల్లేని గోపి తనలో తానే బాధపడుతూ ఇటునటు తిరుగుతున్నాడు గుండెల మీద ఎల్లి ఎల్లను పెట్టి ఆడుకుంటున్న సీతారామయ్య చూడు పుస్సి! మా వాడు గోపి మీ అమ్మను ఇద్దరు తోడబుట్టిన వాళ్లను ఆదెయ్య కప్పచెప్పాడు కొద్ది రోజులు బ్రతికి మరొకడి కాహారమైపోయాయి మీ జన్మలు నిజంగా దన్యం మానవజన్మ తలంచుకుంటే నవ్వొస్తుంది డబ్బుల్లేక ఎలా తిరుగుతున్నాడో చూడు గోపి అన్నాడు

ఎదురుగా వున్న కాంతం నవ్వడంతో గోపి మరి విసిగిపోతున్నాడు

నాన్నా! బాబు మెడలో గొలుసు?

ఆఁ అనుకుంటూనే వున్నాను వాడింత పని చేస్తాడని ఇక వారం రోజులు ఇంటి పట్టు పట్టడు

దొంగ వస్తువైతేనేం? కొనే వారెందరు లేరు పొరపాటున పట్టుబడితేనో? పలాన సీతారామయ్య కొడుకు దొంగన్న ముద్ర చిరస్థాయిగా పడిపోతుంది అమ్మా కాంతం ఇక్కడున్న రెండురోజులైనా నీకు మనఃశాంతి లేకుండా పోయిందమ్మా! అని కండువా

# "మువ్వల సవ్వడి"

బుజాన వేసుకుని వీదిలోనికి బయలుదేరబోయి ఆగిపోయాడు తానే దొంగతనం చేసిన వాడిలా బయపడి పోతున్నాడు

అమ్ముకుంటే ఎన్నాళ్లొస్తుంది? పట్టుమని నెలరోజులు మళ్లీ పెరటి గుమ్మాన ముఖం వాల్చి రావటం నాలుగు రోజులు మంచివాడిలా కపట నాటకం అలాంటి ఆలోచనలతో రాత్రి తొమ్మిదిగంటల వరకూ గడిచిపోయింది సివిల్ డ్రెస్‌లో వున్న జవాన్ చిన్న చీటి సీతారామయ్య పేరనున్నది తీసుకు వచ్చాడు

నాన్నా నేను పట్టుబడి స్టేషన్‌లో వున్నాను విడిపించడానికి ప్రయత్నించండి

సీతారామయ్య బోరున ఏడ్చాడు ఎంత చెడ్డవాడైనా కొడుకుపై మమకారం ఉరకలు వేసింది.

ఈ ఒక్క తప్పు క్షమించండి నాన్నా! వెళ్లి ఎంత డబ్బయినా విడిపించండి లేదా వాడి ఖర్మ

సీతారామయ్య వెళ్లి రాత్రి పన్నెండు గంటల వరకూ విశ్వప్రయత్నం చేసి గోపీని విడిపించుకు వచ్చాడు

సీతారామయ్య దూరంగా నిల్చుని ఏడుస్తున్నాడు పెరటి వైపున్న గోపికి తానే స్వయంగా గిన్నెలో అన్నం వడ్డించి తీసుకు వెళ్లాడు పిల్లి ఎల్ల మ్యావ్ మ్యావ్‌మంటూ గోపి దగ్గరకు చేరింది ఎడం చేత్తో దానిని దగ్గరకు తీసుకున్నాడు కలిపిన అన్నం ముద్దలు వేశాడు కొద్దిగా ఎంగిలిపడి లేచి ఎవరి ముఖమూ చూడలేక అక్కడే దుప్పటి పరుచుకుని పడుకున్నాడు కలత నిదురలో బాబు గొలుసు దొంగిలించడం అమ్మ చూపడం అనుమానమొచ్చి కొట్టువాడు పోలీసులకు ఫోన్ చేయడము పట్టుబడి వంటరి గదిలో బందించబడి గుచ్చి గుచ్చి ప్రశ్నలు వేసి చావగొట్టడం భయంతో ప్రక్కకు తిరిగి అక్కడే కూర్చున్న తండ్రిని చూశాడు

ఈ ఒక్క ఉదంతం చాలు బాబూ నువ్వు బాగుపడడానికి ఏ త్రోవ వెతుక్కుంటావో బాగా ఆలోచించు పూల బాట ముళ్ల బాట ఎన్నుకోవడం మనలోనే ఉంది నేనిక్కడుండటం నీకిబ్బందిగానే ఉంటుంది కారణం తప్పు చేసినవాడివి కనుక నేను వీది గుమ్మం వైపు పోతున్నాను అని సీతారామయ్య పైకి వచ్చాడు

తెల్లవారింది దెబ్బల బాధ భరిస్తూనే గోపి ఇటు నటు తిరుగుతున్నాడు

ఈ గొలుసు బాబు మెడలో వేసి రా అనగానే బిడియపడుతూ గొలుసు చంటివాడి మెడలో వేశాడు గోపి

గోపి ఆదరణతో పిల్లి ఎల్ల ఉల్లాసంగా ఇల్లంతా తిరుగుతోంది తాతలనాటివి చెంబులో పడున్న సిరి మువ్వల్ని పైకి తీసి సూది దారంతో ఎల్లి మెడలో తండ్రి కట్టిన ఎర్ర రిబ్బనుకు జాగ్రత్తగా కుట్టాడు గోపి పిల్లి ఎల్ల సిరి మువ్వల్ని శబ్దం చేసుకుంటూ విచ్చలవిడిగా ఇల్లంతాతిరుగుతోంది

ఆ దృశ్యాన్ని చూసిన సీతారామయ్య ఆనందానికి హద్దుల్లేవు

ఇంతలో వీదిలో ఎల్లలు పరుగు నడకల మీద వస్తూ ఎల్లులు ఆదెయ్యొస్తున్నాడు అని అరిచారు

గోపి పిల్లి పిల్లతో వాడి కెదురుగా వెళ్లి ఇది మా పెంపుడు పిల్లి చెయ్యి వేశావో మర్యాద దక్కదు ఆదెయ్యా! అని హుంకరించాడు

ఆ మధ్య పిల్లుల్ని సీవేగా బాబూ దగ్గరుండి పట్టించింది

అవి పాత రోజులు రోజులు మారాయి త్వరగా పోవాలి ఎప్పుడూ ఈ ప్రక్కకు రాకూడదు తెలిసిందా! అని ఎల్లి ఎల్లను మరి దగ్గరగా అదిమి పట్టుకునిలోనికి వచ్చి ఊయలలో నున్న బాబుతో ఆడుకుంటున్నాడు

పూల బాటలో అడుగులు వేసిన గోపిని
ఊయలలో ఊకొడుతున్న బుల్లి బాబుని
సర్వ స్వతంత్రురాలైన పిల్లి పిల్లనూ

చూస్తున్న సీతారామయ్య మనసులో సిరిమువ్వలు మృదు మదురంగా సవ్వడి చేస్తున్నాయి








సీరియల్

# మనసుకు సంకెళ్ళు

ప్రమీలా జనార్దన్



(గత సంచిక తరువాయి)

సుద హాస్పిటల్ నుండి ఇంటికి వచ్చేస్తోందా రోజు

రవి ఆమెను భోజనానికి పిలిచాడు సుదకు ప్రతిమతో స్నేహం కలపాలని అతడి ఉద్దేశ్యం

సుద తనతో అన్ని విషయాలు మాట్లాడుతుంది కాని ప్రతిమ పేరు కూడా ఎత్తదు తన ఇంటికి ఆమెను అదే పనిగా ఆహ్వానిస్తే విడిగా ప్రతిమతో మాట్లాడుతుంది ప్రతిమ మంచితనం తెలుసుకుంటుంది స్నేహం పెంచుకుటుంది వారిద్దరి విషయంలో తనకింక దిగులుండదు అనుకున్నాడు

రవి భోజనానికి రమ్మనగానే సంతోషంగా ఒప్పుకుంది సుద

రవి తన గురించి భార్యకేం చెప్పాడో తెలుసుకోవాలని ఉత్సాహంగా ఉంది

తన ముందు ఆమె దేనికి పనికి రాదని తెలుసుకోవాలి సుదలో రగులుతున్న ద్వేషం అసూయ పొంగి పొరలుతున్నాయి అవి ప్రతిమను చూడగానే మరింత ఉధృతమయ్యాయి

రండి మీ కోసమే చూస్తున్నాను రవి సుద కారు దిగి ఇంట్లోకి వస్తుంటే హాల్లో గుమ్మం దగ్గరే నిల్చొని వున్న ప్రతిమ చిరునవ్వుతో ఆహ్వానించింది

సుద ఆమె నవ్వులో మధురిమలు చూసే స్థితిలో లేదు ఆమె మాటల్లో అభిమానం అంతకన్నా గుర్తించలేదు

రవి తండ్రి కాబోతున్నాడు కారు దిగగానే ప్రతిమ మీద చూపు పడటంతో విషయం తెలిసి గుండె గుబగుబ మంది

ఎత్తుగా వున్న కడుపు పసి నిమ్మపండు దేహచ్ఛాయలో కళకళలాడుతోంది ప్రతిమ

'రవి తండ్రయ్యాక తననిక చూడను గూడా చూడడేమో!' అనుకుంటే భయంగా వుంది

తను రవిని చూడకుండా వుండలేదు

**జరిగిన కథ –8** సుద పరిస్థితి రవికి ఆందోళన కలిగిస్తుంది సుద భయంతో హాస్పటల్ నుంచి పార్కుకి పరుగు తీసింది అక్కడ ఆమెకు ఒక యువకుడు తటస్థ పడతాడు భయంతో ఆమె అతని చేతులలో స్పృహ కోల్పోతుంది అతని పేరు చంద్రం పోస్ట్ గ్రాడ్యుయేట్ చంద్రంకి మానసిక రుగ్మత పూర్తిగా తగ్గిపోయినందుకు డాక్టర్ కిశోర్ ఆనంద పడ్డాడు రవి సహకరిస్తే సుదకి మానసికరుగ్మత పూర్తిగా నయమవుతుందని చెప్తాడు డాక్టర్ రవి అంగీకరిస్తాడు సుద చంద్రం స్నేహంగా ఉంటున్నారు సుద తండ్రితో చెప్పి చంద్రంకు ఉద్యోగం ఇప్పిస్తుంది ప్రతిమ గర్భవతయింది

"ఏమిటి ఆలోచిస్తున్నారు?" సోఫాలో కూర్చుని ఎటో చూస్తున్న సుదను చూసి అంది ప్రతిమ

నీ గురించే రక్కున అంది సుద ఆ మాటల్లో కరుకుదనం ప్రతిమనే కాదు రవిని కూడా విచలితుడ్ని చేసింది

నా గురించి ఆలోచించేందుకేముంది? నేను పెద్దగా చదువుకోలేదు పల్లెటూర్లో పుట్టి పెరిగినదాన్ని

అదే ఆ విషయమే ఆలోచిస్తున్నాను అక్కడదానివి ఇక్కడకెలా వచ్చావు? చురచుర చూసింది సుద ఆమెకేదైనా శక్తి వుంటే ప్రతిమను అక్కడికక్కడే భస్మం చేసి వుండేది పుట్టి పెరిగిన వాతావరణం చదువు సంస్కారాన్నే నేర్పకపోతే గొంతు నులిమేసేది

మీరంటున్నదేమిటో నా కర్థం కావటంలేదు ప్రతిమకు ఆమె తనను కించపరుస్తూ మాట్లాడుతోందనిపించడం లేదు ఆమె మానసిక స్థితి పూర్తిగా బాగవ్వలేదనిపిస్తోంది

ఏముంది? రవికి నువ్వెలా దొరికావో ననుకుంటున్నాను ఈసారి ఆమె గొంతులో రోగ లక్షణాలేమీ కనిపించక పోవడంతో తెల్లబోయి చూసింది ప్రతిమ

సుదా కోపాన్ని నిగ్రహించుకోలేక పోయాడు రవి

ప్రతిమ మా మాష్టారుగారి అమ్మాయి నేను కోరి పెండ్లి చేసుకున్నాను

మంచి పని చేశారు వ్యంగ్యంగా అంది సుద

అదేం గమనించని వాడిలా నేనూ అలాగే అనుకుంటున్నాను అన్నాడు రవి

సుద అతడ్ని తేరిపార చూసి మౌనంగా కూర్చుంది

నాయర్ వడ్డించాననగానే ముగ్గురు లేచి వచ్చారు

రవి మీరు పెండ్లి చేసుకోవడం మంచి పనయిందనే అనుకుంటున్నారా? సుద ఇంకా అదే విషయం ఆలోచిస్తున్నట్లుంది అన్నం కలుపుతూ నీరసంగా అడిగింది

రవి పలకలేదు సుదను చూస్తుంటే భయంగా ఉందతడికి 'ఆమె ఏం చెయ్యాలనుకుంటున్నదో!'

మంచో చెడ్డో చేసుకోవాలనుకున్నారు చేసుకున్నారు సర్ది చెబుతున్నట్లుగా అంది ప్రతిమ

నేను నిన్నడగలేదు ప్రతిమను చూస్తే కోపంగా వుంది సుదకు తనేం మాట్లాడుతున్నదో తనకే తెలియడంలేదు

ఆమె మాటలు ప్రతిమకు కొరడా ఝుళిపించినట్లయింది

సుద జబ్బు సంస్కారాన్ని తినేసిందా? అనిపించింది

సుదా ముందు భోజనం చెయ్యి ఆమె మాటలు పెంచడం భరించలేకపోతున్నాడు రవి

మాట్లాడకుండా తినమనా మీరు చెప్పడం? అలాగే నేను మీ భార్యనేం అనను లెండి ప్రతిమ ముఖంలో బాధ సంతోషం కలిగించినట్లుంది నవ్వుతూ

అంది సుద

ప్రతిమతో స్నేహం కలుపుకుంటుందనుకున్నాడే కాని సుద ఆమెనలా అవమానిస్తుందనుకోలేదు రవి

ఆమె తినడం ముగించగానే ఇక వెళ్దామా? అన్నాడు ఆమె ఇంకాసేపు వుంటే ఇంకేం మాట్లాడుతుందోనని అతడి బయం

సుద అతడి అంతరంగం అవగతం అయినట్లుగా నవ్వి పదండి అంది వెళ్లేటప్పుడు వెళ్లొస్తానని ప్రతిమకు మర్యాదకైనా చెప్పలేదు

కారు కొంత దూరం వచ్చాక రవి మీకు నా మీద కోపం వచ్చింది కదూ' అంది సుద రవి అంతవరకు ఆమెతో ఒక్క మాటకూడా మాట్లాడలేదు ఆమెవైపు చూడలేదు ఆమె మాట వినగానే ఏదో అనబోయాడు గాని ఆమె ముఖం చూసి ఆగిపోయాడు అతి దీనంగా చూస్తోందామె తనకు కోపం వచ్చిందంటే ఏడ్చేందుకు సిద్ధంగా వున్నట్లున్నాయా కండ్లు

నేను తప్పుగా మాట్లాడలేదు ఆమెను మీరెందుకు చేసుకున్నారో తెలుసుకుందామని

సుదా తన పెండ్లి గురించి మాటలు సాగడం అతడికిష్టంలేక పోయింది

తనెందుకు చేసుకున్నది చెప్పగలిగితే తనకే బాదా వుండేదికాదు

నువ్వు తప్పుగా మాట్లాడావని కాదు హోటల్ నర్తకిలో డాన్సు ప్రోగ్రామ్ వుంది అక్కడికి వెళ్లాలని నిన్ను తొందరగా తినమన్నాను సమయానికి ఆ డాన్సు ప్రోగ్రాం గుర్తొచ్చింది మొన్ననే ఇన్విటేషన్ వచ్చిందతడికి

సుద ఆనందంతో తలమునకలయింది

బార్యతో ఆ మాట గూడా చెప్పలేదు రవి తననొక్కదాన్నే ఎలుచుకొస్తున్నాడంటే అతడికి ఆమెను కట్టుకున్న నేరానికి ఇంట్లో వుంచుకోవడం తప్ప ప్రేమాదరాలు లేవన్న మాట రవి అనుకున్న దానికి విరుద్ధంగా జరిగేలా చేసిందతడు ఆమెనలా లాక్కెళ్ళడం

రవి అబిమానించని మనిషిని తను అబిమానించనక్కర్లేదు అనుకుంది అతడి బార్యగా ఆమెను లోకం గౌరవిస్తున్నా అతడి హృదయంలో స్థానం తనదే గర్వంగా వుంది

సుద ప్రవర్తన రవికేం అంతు పట్టడం లేదు ఆమె ఇదివరకులాగే తనకోసం వస్తోంది సినిమాకు రమ్మంటుంది షికారుకు వెళ్దామంటుంది ప్రతిమ వుందన్న విషయమే మరిచినట్లుగా వుంటోంది

పని వుందని కొన్ని సార్లు తప్పించుకుంటున్నాడు కాని పూర్తిగా మానెయ్యలేకపోతున్నాడు

ఆమెనిక తనను కలుసుకోవద్దని చెప్పాలని చాలా సార్లు అనుకున్నా ఆమెను చూడగానే మనసు మెత్తబడుతుంది ఆ మాట బైటకి రావడం లేదు

ఆశలు పెంచిన తనే అలా చెప్పడమూ ఆమెకో తోడు దొరికాక తను రమ్మన్నా రాదు అనుకున్నాడు

రవి తన రాకను హర్షించడం లేదని తను ఎక్కడికి రమ్మన్నా బాధపడుతున్నాడని గ్రహించక పోలేదు సుద

'అతడిప్పటికీ ఏం జరిగిందో చెప్పడం లేదు ప్రతిమను పెండ్లి చేసుకొనేందు కేదో కారణం వుంది తన దగ్గర అతడు రహస్యం దాచడం



## మనసుకు సంకెళ్ళు

భరించలేకపోతోంది      ఆ కారణం ఏదైనా తను రవిని క్షమించగలదు  అతడికి తన గుండెలో స్థానం అలాంటిది

మనం ఇలా వెళ్ళడం బాగుండదు  సినిమాకు వెళుతూ అన్నాడో సారి రవి

ఎందుకు? అడిగింది సుధ

నేను పెండ్లయిన వాడ్ని

అంత మాత్రాన స్నేహాలు వదులుకో నక్కర్లేదు

కాని హద్దులు తెలుసుకొని మసలడం అవసరం  ముఖ్యంగా పురుషులు స్త్రీ స్నేహితులతో, స్త్రీలు పురుష స్నేహితులతో

మీరే శతాబ్దంలో వున్నారు?  నవ్వుతూ  అతడి అభిప్రాయాన్ని కొట్టి పారేసింది  ఈ కాలంలో గూడా ఏమిటి ఆలోచన్లు?

ఏ కాలమైనా హద్దులు అవసరమే

నేను ఒప్పుకోనని మీకిది వరకే చెప్పాను

మన కోసం మనకేమి అవసరం లేకపోవచ్చు  కాని సమాజం వూరుకోదు మనం సంఘజీవులం

సుద అతడి వైపు చూసింది  ఆ చూపుల్లో కోపం

ఏం ప్రతిమ మిమ్మల్ని అనుమానిస్తూ మాట్లాడుతోందా?  ఆమె అలా మాట్లాడిందంటే తను  వెళ్ళి దులిపేస్తానన్నట్లు అంది

రవి చిన్నగా నవ్వాడు

ప్రతిమ అలాంటి మనిషి కాదు

మరింకేం?  అంత  గొప్ప  మనసున్న  భార్య  వున్నప్పుడు  ఎవరికి బయపడక్కర్లేధు  అంది సుద

రవి ప్రతిమ గురించి వున్నతంగా మాట్లాడడం ఆగ్రహం కలిగించిందామెకు విదిలేని పరిస్థితిలో  ఆమెను  చేసుకున్నానని  చెబుతాడనుకున్న ఆమె కామాటలు తీవ్ర ఆశాబంగం కలిగించి పాతాళానికి తోసేసినట్లనిపించాయి

నే నెవ్వరికీ బయపడడం లేదు కాబట్టే నీతో  రాగలుగుతున్నాను  నా అబిప్రాయం నీకు చెప్పానంతే  అన్నాడు రవి

మీ  అబిప్రాయం  అర్ధరహితం  హద్దులు  అవసరం  లేదని  మనం నిరూపిస్తున్నాము  అంది సుద

ఆమె  అలా  అన్నా  లోకం  గురించి  ఆలోచించకుండా  వుండదని  రవికి తెలుసు  అతడితో ఇదివరకు తిరగడం వేరు  ఇప్పుడు తిరగడం వేరు

'ఆమెను చేసుకోలేదన్న కోపం కొద్దీ అలా అంటోంది  ఆమెకేం చెప్పగలడు తను?  అనుకున్నాడు రవి

సుధ ప్రతిమ వంక చూడదు  మాట్లాడదు  రెండు మూడు సార్లు చూసి ప్రతిమ సుధ రాగానే లోపలికి వెళ్ళి పోతోంది

'భార్యను అవమానించిన మనిషితో అతడెలా మాట్లాడగలుగుతున్నాడో!' సుద భోజనానికి వచ్చిన రోజున ఆమెతో పాటు రవి గూడా వెళ్ళడం ప్రతిమకు కోపం తెప్పించింది  కాని ఆమెను ఇంటి దగ్గర వదిలి వచ్చాక  ప్రతిమా ఆమె ఆరోగ్య కారణంగా ఆమెను బాద పెట్టడం మంచిది కాదు  ఆమె గురించి నువ్వు మరోలా అనుకోకు  అన్న అతడి మాటలు ఆ కోపాన్ని పోగొట్టాయి

సుద  అలా  మాట్లాడుతుందనుకోలేదు  నేను  నిన్నింకా  బాద పెడుతుందని వెంటనే తీసుకెళ్ళాను

దానికామె బాద పడదా?  అంది ప్రతిమ

లేదు  త్రోవలో గుర్తొచ్చింది హోటల్ నర్తకిలో డాన్సు ప్రోగ్రామ్ వుందని అక్కడికి తీసుకెళ్ళాను  ఆమె చాలా సంతోషంగా వుంది  అన్నాడు రవి

'రవి తనను నిర్లక్ష్యం చెయ్యడం లేదు ' తను బాద పడుతుందని సుదను తీసుకెళ్ళాననడంతో ఆమెలో నిరాశ దూరమౌతోంది

రవిలో మార్పు వస్తుంది ' ఆశలు చిగుర్లు తొడుగుతున్నాయి

'బాబు పుట్టాక రవి సుధ విషయంలో శ్రద్ధ చూపలేదు ' అనుకుంది

*　*　*　*　*

ప్రతిమను పురిటికి పిలుచు కెళతానని వచ్చాడు పరంధామయ్య

వద్దు మాష్టారు ప్రతిమను ఇక్కడే వుండనివ్వండి అవసరమంటే డాక్టర్లు లేరక్కడ' అన్నాడు రవి

కాని మొదటి కాన్పు పుట్టింట్లో జరగడం ఆచారం బాబూ

ఆచారమంటూ ఆరోగ్య విషయం ఆలోచించకపోతే ఎలా? అన్నాడు రవి

అది నిజమే ననిపించింది మరేం మాట్లాడలేకపోయాడు పరంధామయ్య

ఆ రాత్రి ప్రతిమా నేను నిన్ను శాసిస్తున్నాననుకోకు నా అభిప్రాయం చెప్పాను నీకు వెళ్ళాలని వుంటే వెళ్ళు అన్నాడు రవి

ప్రతిమకు అతడలా అనడం చాలా సంతోషం కలిగించింది 'భార్య అంటే తన మాటే విని తీరాలనుకోడం లేదతడు '

మీరు చెప్పడం నా మంచికేనని తెలుసుకోలేనంత మూర్ఖురాలిని కాదు నాకూ వెళ్ళాలని లేదు అంది ప్రతిమ

సుధ గురించి ఆమె ఆలోచించడం లేదిప్పుడు 'తను ఆమెకు కనిపించకుండా వుంటే తనకూ ఆమెకూ గూడా బాధ వుండదు రవితో స్నేహానికి తను అడ్డు పడతాననుకుంటున్నదేమో సుద' నవ్వుకుంది ప్రతిమ

*　*　*　*　*

తను ప్రతిమను లెక్క చెయ్యడం లేదని రవికి తెలుసు ప్రతిమకు తెలుసు అయినా వాళ్ళు తనతో ఆ మాటే అనలేదు రవి తనకు దూరమవ్వాలని ప్రయత్నిస్తున్నా తను అతడి వెంటపడుతోంది అతడ్ని చూడనిదే తను వుండలేదు ఇలా ఎన్నాళ్ళు జరుగుతుంది? లాన్‌లో కూర్చుని శూన్యంలోకి చూస్తున్న సుద ఏమిటండీ అంతగా ఆలోచిస్తున్నారు? అన్న చంద్రం గొంతు విని యదా జగత్తుకు వచ్చింది

మీరేమైనా ప్రకృతి గురించి కవితలల్లుతున్నారా? ఆమె కెదురుగా కుర్చీలో కూర్చుంటూ అన్నాడు చంద్రం

కవితలా! నవ్వింది సుద

ఎవరో వ్రాసినవి చదవాలంటేనే కష్టం నేనేం వ్రాస్తాను?

మీరలా చూస్తూ ఆలోచిస్తోంటే అడిగాను మీరు అమాంతంగా కవయిత్రులైపోతారేమోనని అతడి మాటల్లో హాస్యం తొణికిసలాడతూ ఎదుటి మనిషిలో బాదను తీసేస్తుంది

మీకా భయం అక్కర్లేదు నేను కవయిత్రిని కాను రవి వస్తానన్నారు అతడికోసం ఎదురు చూస్తున్నాను

చంద్రం ఆమె వైపొక్క క్షణం చూశాడు 'ఏమిటీమె తత్వం? రవితో ఇంకా సన్నిహితంగా వుంటోంది అతడి జీవిత దారి వేరయిందని తెలిసీ ఎందుకిలా చేస్తున్నది? ఆమెతో ఆ మాట అనలేకపోయాడు కాని మనసూరుకోలేదు స్నేహితుడిగా ఆమెకు హితవు చెప్పడం ధర్మమన్నది

సుదాదేవి ఆలోచిస్తూనే మాట్లాడుతున్నాడు

రవి బందం పడ్డ వ్యక్తి మనలా స్వేచ్ఛగా వుండమంటే అతడికి కష్టం

బందాన్ని బాధ్యతల్ని త్రెంచుకుని స్నేహం చెయ్యమని ఎవరైనా కోరతారా? అంది సుద

స్నేహితుడిగా అనుకుంటున్నానంటూ అతడి మీద మమత పెంచుకున్న ఆమెకు ఎవరేం చెప్పగలరు?

చంద్రం నిట్టూర్చాడు ఈ స్నేహ ఫలితం ఎలా వుంటుందో!' రవి ఆమెకు దూరంగా వుండాలనుకుంటున్నాడని అతడికి తెలుసు

రవితో స్నేహంగా తిరుగుతోందే కాని తను అతడి నుండి ఏదో ఆశించడం లేదు భార్యను వదిలెయ్యమని చెప్పడంలేదు ' సుధ ఆలోచన అది

(ఇంకా ఉంది)






# దూరదర్శన్ కార్యక్రమాలు





"వింధ్యవాసిని"

"ఉపగ్రహం ద్వారా విద్యా సంబంద దూరదర్శన్ ప్రయోగం (శాటిలైట్ ఇన్‌స్ట్రక్షనల్ టెలివిషన్ ఎక్స్‌పెరిమెంట్) పేరున ఒకేసారి 2,400 గ్రామాలకు టెలివిషన్ ప్రసారాలను చేసిన మొదటి దేశంగా ఆసియా ఖండంలోనే పేరు తెచ్చుకున్న మన దూరదర్శన్ కార్యక్రమాల ప్రస్తుత స్థాయి చెప్పుకోదగినంత సంతృప్తికరంగా లేదు

ప్రాంతీయ బాషా ప్రసారాలకి, ప్రత్యేకస్థాయి అంటూ లేనేలేదు ఆయా కేంద్రాల వనరులు, వసతులు పెరిగి, కార్యక్రమాలు అబివృద్ధి అయేవరకూ టీవీ అనగానే అందరూ గుర్తుగా చెప్పుకునేది రాష్ట్రీయ కార్యక్రమాలను గురించే

జాతీయ సమైక్యతను పెంపొందించుకోవటానికి దూరదర్శన్ వారి రాష్ట్రీయ కార్యక్రమాన్ని మించిన ఉత్తమ సాదనం మరేది లేదు కానీ దీని ప్రయోజనాన్ని మనం ఇంకా పూర్తిగా వినియోగించుకున్నట్లు తోచటం లేదు

దూరదర్శన్ కార్యక్రమాలు క్రమం తప్పకుండా చూసే ప్రేక్షకుల్లో హెచ్చుశాతం పది పన్నెండు సంవత్సరాల లోపు వయసు పిల్లలే కానీ ఏది చూపినా చూడటం తప్ప, వారి కంటూ ప్రత్యేకించి కార్యక్రమాలేవీ రూపొందించి చూపటం లేదు

దూరదర్శన్ ఆర్థిక వనరుల కోసం కొంతవరకూ వ్యాపార ప్రకటనల మీద ఆదారపడటం న్యాయమే! కానీ వారు తయారు చేసి అందించిన కార్యక్రమాలను మాత్రమే దూరదర్శన్ ప్రసారం చేయటం ఎంత వరకు సమంజసం? ముఖ్యంగా పిల్లల కోసం కార్యక్రమాలు రూపొందించే బాద్యత దూరదర్శన్ వారు స్వయంగా చేపడితే బాగుంటుంది ఆయా కార్యక్రమాలు, నిజంగా మనోరంజకంగా తయారు అయితే వాటికి వ్యాపార ప్రకటనల సహాయం దానంతట అదే అందుతుంది

వ్యాపార సంస్థల సౌజన్యంతో కాకుండా దూరదర్శన్ మరే కార్యక్రమాన్ని రూపొందించి చూపినా, అది అనాసక్తంగా ఉండి తీరుతుందన్న జనాబిప్రాయాన్ని దూరదర్శన్ వారు మొదటి నుంచీ నిజం చేస్తూ వస్తున్నారు వార్తగా విలువ, తాజాతనం కలిగి ఉండే కొన్ని కార్యక్రమాలు తప్ప (ప్రదాన మంత్రి దేశీయ, విదేశ పర్యటనలు, పత్రికా ప్రతినిదులతో సమావేశాలు, వంటివి) మరే కార్యక్రమం ప్రసారం అయినా ఆ సమయంలో, సాదారణంగా, టి వి ఆఫ్ చేయటం జరుగుతుంది ఇందుక్కారణం, ఆయా కార్యక్రమాలు చాలావరకు, వార్తా వ్యాఖ్యలు, చర్చలు (సామాన్యంగా అన్ని రకాల వార్తా పత్రికలు, దిన పత్రికలు, అనుదినం ప్రచురించేవే!) అయివుండటం కావచ్చు ముద్రణ మాధ్యమాలు (ప్రింట్ మీడియా) అనుసరించే పద్ధతులు, వాటికన్నా హెచ్చు ప్రతిబావంతమయిన, దూరదర్శన్‌కు సరిపడవు ఈ పద్ధతి మారాలి! ఎక్కువ జనాన్ని, ఒకే సమయంలో ఆకర్షించి, ఆకట్టుకోగల ఈ సాదనాన్ని సరీయయిన పద్ధతిలో వినియోగించుకునే ప్రయత్నం జరగాలి □



ఒక ఇంట్లోనే
నాలుగు రకాల
మనుషులుంటారు
కదా- అందుకే
నాలుగు రకాల ప్రోగ్రాంలు
ఒకేసారి చూడ్డానికి
ఇట్లా తయారు చేస్తున్నాం



శ్రీరస్తు - శ్రీ త్రిపురసుందరీ పరశివాభ్యాంనమః

త్వరలో వెలువడుతుంది

త్వరలో వెలువడుతుంది

# ఆంధ్రపత్రిక

## శ్రీ క్రోధ నామ సంవత్సర పూర్ణశాస్త్రీయ పంచాంగము



'దైవజ్ఞచిన్తామణి' శ్రీ పిడపర్తి చినకృష్ణమూర్తిశాస్త్రి,

'భాషాప్రవీణ' శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రి సిద్ధాన్తి సోదరులచే గుణింపబడినది.


ఆంధ్రపత్రికా కార్యాలయము ప్రతి 1-కి రూ: 5.00

గాంధీనగరం. విజయవాడ - 3. బషీర్‌బాగ్, హైదరాబాద్-29

## విదేశీయుని వితండవాదం!

ఢిల్లీలోని అతి పెద్ద ఐదుచుక్కల (ఫైవ్‌స్టార్స్) హోటళ్ళలో ఒకటయిన హోటల్ సిద్ధార్థ కాంటినెంటల్‌లో 22వ తేది అర్ధరాత్రి ఒకటిన్నరకు మంటలులేచి, గంటసేపట్లో కారుచిచ్చులా ఆ హోటలును చుట్టుముట్టి, అగ్నిమాపక దళంవారు హోరాహోరి చేసిన యుద్ధంలో 23వ తేదీ వుదయం ఆరున్నరకు ఆరింది ఈ అగ్నికి 38 మంది దేశ విదేశీయులు బలిఅయిపోయారు మరో 46 మంది ప్రమాద స్థితిలో ఆసుపత్రిలో చేర్చబడ్డారు ఇంత జరుగుతున్నా సమయంలో 611వ నెంబరు సూట్ తీసుకునివున్న వో విదేశీయుడు తను హోటలు తగులబడినా బయటికి వచ్చేదిలేదని, తనకు వుదయం టిఫిను, కాఫీ తనరూములోనే సర్వే చేయాలని డిమాండ్ చేశాడట ఎన్ని చెప్పినా ససేమిరా అన్నాడట

## తల్లీ కొడుకులకు భరణం !

బోపాలుకు చెందిన గునా జుడిషియల్ మేజిస్ట్రేటు వో ముస్లిమ్ యువతి బరణం కేసులో తీర్పునిస్తూ అమెబర్త బపతిఖాన్ తనభార్య 25 ఏళ్ళ హసీనాబానుకు నెలకు 250 రూపాయలు ఆమెతో వుంటున్న వారి కొడుకు ఏడేళ్ళ చున్నుకు నెలకు వందరూపాయలు యివ్వాలని అజ్ఞనిచ్చాడట

## పిల్లాడిపై కోతికి మమకారం !

కైకలూరుకు చెందిన ఇమ్మడి కృష్ణమూర్తి అనే ఆయన పద్మానుగో సంతానం చిరంజీవి అనే రెండు నెల పిల్లాడు డాబామీద గుక్కపట్టి ఏడవడం ఎవరూ వినిపించుకోక పోయినా వేరే పనిమీద అక్కడకు వచ్చిన వో కోతి పట్టించుకుని, ఆ పిల్లాడి పక్కనున్న పాలసీసా తీసి అది ఆ కుర్రాడి నోట్లోపెట్టి పట్టుకుని పాలు త్రాగాక, తీసి పక్కన పెట్టి చక్కా పోయిందట ఇది జరిగి 14 నెలలయిందట. ఆ రోజునుంచి ఆ కోతి వీలుచిక్కినప్పుడల్లా వచ్చి ఆ పిల్లాడిని చూసి పరామర్శించి మరి వెళ్తోందట



## హత్యా ? ఆత్మహత్యా ?

ఢిల్లీ రాజౌరి గార్డెన్ ప్రాంతానికి చెందిన పురుషోత్తమ్ అనే ఆయనబార్య 22 ఏళ్ళ కాంత మొన్న జనవరి 14వ తేదీన ఇంట్లోని సీలింగ్ ఫ్యానుకు వురిపోసుకుని, చనిపోయిందని పోలీసులు రిపోర్టు నమోదు చేస్తే, ఆమె తండ్రి అది చావుకాదని హత్య అనీ నవంబరు 28వ తేదీన ఆమెకు వివాహ మయ్యిందనీ కోర్టులో ఫిర్యాదు చేశాడట పురుషోత్తమ్ తమ్మునితో ఆమెకి అక్రమ సంబంధం వున్నట్లు అనుమానించి, పురుషోత్తమ్ ఆమెను చంపేసి వుండుండాలని అతన్ని అరెస్టు చేస్తే, బెయిలు నిరాకరించిందట కోర్టు

## సినిమా హాలులో బాంబు ప్రేలుడు !

బెల్గామ్‌కు చెందిన ఒక సినిమా ధియేటర్‌లో జనవరి 22వ తేదీన సినిమా జరుగుతూండగా వో బాంబు ధుమిల్ల ప్రేలి దియేటరు గోడలో ఒకబాగం కూలిపోయిందట ఎవరికి తీవ్రంగా గాయాలవలేదట అంతకు క్రితంవారం బెల్గామ్ హర్తాళ్‌లో ఆ దియేటరు యజమాని పాల్గొనలేదని బహుశా యీ పని చేసి వుండుండచ్చని పోలీసు అనుమానిస్తోందట

## టి.వి. చూసి నేత్రదానం !

బిలాయ్‌కు చెందిన నీరజ్ అనే వో యువకుడు టి వి లో హమ్‌లోగ్ చూసి తానుకూడా తన కళ్ళను వో అంధునికి దానం చేయాలని సరదాపడి, తన తల్లిదండ్రులతో చెప్పి, వారివద్ద వాగ్దానం తీసుకున్నాడట తరువాత అతను వో రైలు ప్రమాదంలో ఆసుపత్రిలో చనిపోయాడట ఈ సంఘటన అతను వూహించుకునే యీ వాగ్దానం తీసుకుని వుంటాడనీ, తన మరణాన్ని తాను కనిపెట్టాడనీ, అతని తలిదండ్రులు అతని కోర్కె ప్రకారం అతని కన్నులు దానం చేశారట బిలాయ్ స్టీల్‌కంపెనీలో పనిచేసే యోగిందర్‌సింగ్ అనే అందునికి ఆ నీరజ్ కార్నియా అమర్చి అపరేషను చేస్తే యోగిందర్‌సింగ్ చక్కగా చూడ గలుగుతున్నాడట

## కుమార్తెని బంధించిన మంత్రి !

రాజస్థాన్‌లోఓమంత్రిగారి కూతురు వొకామె తన తండ్రికి తెలియకుండా తన మనోహరుణ్ణి వివాహంచేసేసుకున్నదట దానికి కోపగించి ఆయనా, ఆయన పుత్రుడూ కలిసి ఆమెను గదిలో బంధించి, చితక బాదుతున్నారని విదాన సబలో ఒక యం యల్ ఏ ఆరోపించారట అవునో కాదో చెప్పడానికా మంత్రిగారపుడు అక్కడ లేనేలేరట–

## గౌహతి విశ్వ విద్యాలయంలో గోల్‌మాల్ !

గౌహతి విశ్వవిద్యాలయపు అధికారులంతా కుమ్మక్కయి గత ఏడు సంవత్సరాలుగా లెక్కలు చూపటంలేదట యూనివర్సిటీ గ్రాంట్స్ కమిషను ప్రతి ఏడూ ప్రయోగశాలల్లో పరికరాలూ, తదితరాలూ కొనుక్కోడానికి యిచ్చేడబ్బుకు కూడా లెక్కలు చెప్పనందువల్ల గతఏడాది ఆ కమిషను డబ్బివ్వడం నిలిపేసిందట ఏటికి 2 43 కోట్లు జీతాలకి ఖర్చవుతుందట తనకొచ్చే ఆదాయంగాని ఖర్చుల వివరాలుగాని ఈ విశ్వవిద్యాలయం బయట పెట్టటంలేదట ☐




# ప్లే

రావినూతల సువర్ణా కన్నన్

రాజా బాబు అందగాడు!

కిరీటం లేదుగాని నిజంగా రాజే బాబే!

అతను రావుబహద్దూర్ రంగనాయకులు గారి కోట్ల సంపదకి ఏకైక వారసుడు

అతనిలాగే అతని బావాలు కూడా బహుగొప్పవి లంకంత బవనంలోని హాల్లో మెట్లకెదురుగా తగిలించిని చిత్రపటం అంటే అతనికి చచ్చే ఇష్టం పసితనం నుంచి కూడా

పెద్ద పెద్ద సింహాలు రెండు ఓ ఎనుబోతుని పొట్ట చీల్చి, పేగులు లాగి, మాంసాన్ని అరగించే అదృశ్యాన్ని చూస్తూ ఎంత సేపైనా గడిపెయ్య గలడు!

ఆరోజు రాజాబాబు విశాలమైన తమ బవన ప్రాంగణంలో ఉన్న లాన్‌లో కూర్చుని క్రీమ్ బిస్కెట్స్ తింటున్నాడు

కావ్! కావ్!

ఏదో ఆలోచిస్తూ తింటున్న రాజా బాబు తృళ్ళిపడి చూశాడు

అతని వెనగ్గా రెండు కాకులు! ఒకటి పెద్దది రెండోది పిల్లకాకి రెండూ, అతను తినే బిస్కెట్స్‌కేసి ఆశగా చూస్తున్నాయి

ఆరేళ్ళ రాజాబాబు వాటికళ్ళలోని ఆకలిని గుర్తించాడో, సరదా అనో ఓ బిస్కెట్ తుంచి విసిరాడు విలాసంగా

అంతే! అతని కళ్ళు ఆశ్చర్యంతో పెద్ద వయ్యాయి అందులోని పెద్దకాకి అతను విసిరిన బిస్కెట్ ముక్కని చక్కగా పట్టుకుంది

రాజాబాబు మరోముక్క విసిరాడు మరి కాస్త ఎత్తునించి

అదీ అందుకుంది కాకి

ఈసారి ఆముక్కని చిన్నకాకి నోటికందించింది రాజాబాబు కళ్ళు తళుక్కుమన్నాయి

పక్షులు అంత తెలివిగా పట్టుకోవడం చిత్రంగా తోచిందతనికి చాలా సరదాగా కూడా అనిపించింది

ఉత్సాహంగా బిస్కెట్స్ అన్నీ వాటికి ముక్కలుగా చేసి విసిరాడు అవి కేచ్ చేశాయి!

అది చూసిన మరికొన్ని కాకులు అతని చుట్టూ చేరాయి

గబగబా లోపలికెళ్ళి మరికొన్ని బిస్కెట్స్ తెచ్చి

వాటికి వేసి అవి పట్టుకుంటే ఆశ్చర్యంగానూ, ఒక తుంపుకోసం, అన్ని కాకులూ వచ్చి, ఏకాకి అందుకోలేక అది మట్టిపాలైతే దానికోసం ఆశగా మళ్ళీ పరుగులు తియ్యడం ఆనందంగానూ చూస్తూ, చప్పట్లు కొడుతూ చాలా సేపు గడిపాడతను

ఏనాడూ, ఏ ఆటా ఇవ్వనంత ఆనందాన్నీ, ఉత్సాహాన్నీ ఇచ్చిందా ఆట రాజాబాబుకి

అంతే! ఆ ఆట అతనికి అలవాటుగా మారింది

ప్రతిరోజూ ఏదో ఓ తిండి తెచ్చి రకరకాలుగా ఎగరేసి వాటితో కాలక్షేపం చెయ్యడం మొదలు పెట్టాడు

రాజాబాబుకి పదిహేనేళ్ళు వచ్చాయి! అతని ఆట మానలేదు తల్లితండ్రులు అతని ఆనందానికడ్డు రానూలేదు

* * *

ఆ రోజు రాజాబాబు పదహారో పుట్టినరోజు! అతని కెందుకో కాకుల ఆట మీద కాస్త విరక్తి పుట్టింది

కొత్త ఆటకోసం వెతికాడు

బర్త్‌డే పార్టీ అది అయిపోయాక అతని దృష్టి ఎంగిలి ఆకులకోసం కొట్లాడుకునే ఊరికుక్కల మీద పడింది

అంతే! అతని మనసులో కూడా కొత్త ఊహ తళుక్కుమంది!

నౌకర్లని పిలిపించి తిండి తెప్పించాడు

తినుబండారాలు వెదజల్లాడు

అతను ఊహించిందే జరిగింది!

అన్ని కుక్కలూ ఒక్కసారిగా వాటి మీద పడిపోయాయి కొట్లాడుకున్నాయి బలంగా ఉన్నవి గెల్చాయి!

బలహీనంగా ఉన్నవి తోకముడిచాయి!

బావుంది! ఈ ఆట మరీ బావుంది! అనుకున్నాడు రాజాబాబు

అంతే! మళ్ళీ ఆట మొదలు!

అయితే ఈసారి తమ ఆవరణలోనే తమ కుక్కలతోటే ఆట ప్రారంభించాడు

జాగ్రత్త! అవికుక్కలు! . కోపం వస్తే మనల్నే కరుస్తాయ్! తల్లి వారించింది సున్నితంగా

అతను పెద్దగా నవ్వాడు

మన తిండి తిని మనల్నే కరిస్తే అవి కుక్కలు కావమ్మా! అన్నాడు

నిజమే! అవి అతన్ని ఏనాడూ కరవలేదు అతను విసిరిన తిండి కేచ్ చెయ్యడంలో మాత్రం మంచి అనుబవం సంపాదించాయి

స్కూల్ నించి వచ్చే రాజా బాబుకోసం ఆరాటంగా ఎదురు చూసేవి నౌకర్లు కూడా ఆ వినోదాన్ని సరదాగా చూసేవారు

మరి కొన్నాళ్ళు గడిచాక రాజా బాబుకి ఆ ఆటమీదా విసుగు పుట్టింది!

మళ్ళీ ఆలోచనలో పడ్డాడు!

ఈసారి గతనికి ఏ జంతువూ అనలేదు

# ఓయీ! నేస్తం!

ఓయీ!
నేస్తం!
రిక్త హస్తాలతో
చెదరిన గుండెతో
నీ వాకిట ముందు
నేను నిలిస్తే
ఒక్క ఉదుటున లేచి వచ్చి ఆర్తిగా
హర్షామోదాలతో నీ వందించిన
ఆ స్నేహ హస్తాలు!
నేనెలా మరువను?
అవి చాలు నేస్తం!
ఆ హస్తాలే ఆ స్నేహ హస్తాలే
ఎప్పుడూ
నను వెన్నంటి వుంటే చాలు
గడిపేస్తాను జీవితం అంతా!

\- గిడుగు లక్ష్మీదత్

## "ప్లే"

నౌకర్ల మీద పడింది

అతని ఉత్సాహం రెట్టింపయింది

అరేయ్! దర్మయ్యా! అన్నాడు

ఏటి బాబుగారూ? అంటూ వచ్చాడు దర్మయ్య

అతనా ఇంట్లో చాలా ఏళ్ళుగా నౌకరు

నీ షర్ట్ మరి ఇంత చిరిగిపోయిందేం దర్మయ్యా? ఎన్నడూ లేనంత సౌమ్యంగా అడిగాడు రాజాబాబు

దర్మయ్య బిత్తరపోయాడు

మిగతా నౌకర్లు తెల్లబోయారు

కొత్తది కుట్టించుకో కూడదూ? మళ్ళీ అన్నాడు రాజాబాబు

డబ్బులు ఎక్కడియ్ బాబూ! ఈ మాత్రంగా ఉంటే శాన! బాదగా అన్నాడు దర్మయ్య

ఈ ఇంట్లో పని చేస్తున్న ఇన్నాళ్ళుగా అతను ఇంత అనునయపు మాట విన్నట్టు అతనికి గుర్తే లేదు

చ! చ! అలాకాదు! నేన్నీకు డబ్బిస్తాను! కుట్టించుకో! అతని కళ్ళలోకి చూస్తూ అన్నాడు రాజాబాబు

ఈసారి మరీ బిత్తర పోయాడు దర్మయ్య

అవును దర్మయ్యా! నేన్నీకు డబ్బిస్తాను నీకే కాదు వీళ్ళందరికీ డబ్బిస్తాను కానీ

సెప్పండి బాబూ! ఏటి సెయ్యాలి? బక్కచిక్కిన నౌకర్లు ఆశగా అడిగారు

నాతో కాస్సేపు ఆడాలి! మెల్లగా అన్నాడు రాజాబాబు

అంటే ? అర్థం కానట్టు చూశారంతా

మరేం లేదు! నేను మేడమీద నించి పట్టుకోవాలి!

మొహాలు చూసుకున్నారంతా!

బయపడకండి! మీకు దెబ్బ తగిలేవిగా వెయ్యను! తినేవి మాత్రమే వేస్తాను నవ్వుతూ అన్నాడు రాజాబాబు

క్షణం మౌనం వహించారంతా

ఏమిటంతా ఆలోచిస్తున్నారు? మీరు నేను ఆడే ఆట కొన్ని ఏళ్ళుగా చూస్తున్నారు! ఆనందిస్తున్నారు! అదే ఆట మనుష్యులతో ఆడితే ఇంకా థ్రిల్లింగా వుండదూ? గబగబా అన్నాడతను

ఈసారి వాళ్ళు మాట్లాడలేదు

మీ ఇష్టం! ఆలోచించుకోండి! మీ కష్టం నేనుంచుకోను! మీకు తగినంత ముట్ట చెప్తాను! చేతిలోని లడ్డూని ఎగరేసి పట్టుకుంటూ అన్నాడు రాజాబాబు

నౌకర్ల కళ్ళల్లో ఆశ తొంగిచూసింది

సరే! అన్నాడో యువకుడు

అంతే ఆట మొదలైంది

మండు టెండలో తను వేసే వస్తువుకోసం నోళ్ళు తెరిచి ఆశగా చూసే మనుష్యులతో ఆట ప్రారంభమైంది

ఈ ఆటలో అతనికి ఎంతో తృప్తి కనిపించింది అందుకయ్యే ఖర్చు అతనికి కనిపించలేదు

నౌకర్లు మంచి బట్టలు కడుతున్నారు

మంచి తిండి తింటున్నారు!

మనసులో బాదగా ఉన్నా రాబడి బానే ఉండడం మూలాన సంతోషంగానే ఆటలో పాల్గొంటున్నారు

కొందరు ముసలాళ్ళు పరుగులు తియ్యలేకా పట్టుకోవాలనే ఆరాటాన్ని వదులుకోలేకా పడుతూ లేస్తూ అవస్త పడుతుంటే పడి పడి నవ్వేవాడు రాజాబాబు

రోజు రోజుకి రాజాబాబు దగ్గరి నోట్లు గాల్లో ఎగిరి పోతున్నాయి!

నౌకర్లందరూ అలా కాచ్ చెయ్యడంలో మంచి ప్రావీణ్యం సంపాదించారు కూడా

అయితే వాళ్ళు కరెక్ట్‌గా అందుకోవడం రాజాబాబుకి నచ్చడం లేదు

నౌకర్లకి అలవాటయి పోయింది కాబట్టి వాళ్ళ పిల్లల్ని తెమ్మన్నాడు

వాళ్ళతోనూ ఆడాడు!

పసివాళ్ళు యువకులు, వృద్ధులు రకరకాల వాళ్ళతో ఇలా కేచింగ్‌ప్లే ఆడాడు

రకరకాలుగా ఆట మార్చాడు

వాళ్ళు అందుకోలేక అవస్తలు పడుతుంటే మామూలుగానే పగలబడి నవ్వేవాడు

అలా కాలం గడిచిపోతూనే ఉంది!

రాజాబాబు కాలేజీ చదువు సాగిస్తున్నాడు

అతని సంపద అతన్ని ప్రోత్సహిస్తూనే ఉంది! నేర్చుకుంటే రానిదేముంది?

అతను విసిరిన వస్తువు ఒక్కటీ నేలపాలు కావడం లేదు!

అతనిలో నిరాశ, చిరాకు ఎక్కువయ్యాయి!

అయినా ఆట మానలేదు!

కొత్తరకాల కోసం అన్వేషిస్తూనే ఉన్నాడు

★ ★ ★ ★

రాజాబాబుకి పెళ్ళయింది!

మరో యువరాణి భార్యగా వచ్చింది!

అతను ఆడిన ఆటలన్నీ ఆమెకి ఆడి చూపించాడు!

అతనికన్నా మురిసి పోయిందామె!

ఆ రోజు పది మంది నౌకర్లతో మొదలైన ఆట వినోదంగా చూస్తోంది అతని భార్య రేవతి

చాలా మంది నోటితో వస్తువుల్ని తేలిగ్గా అందుకుంటున్నారు

ఆమె ఓసారి కళ్ళు చిట్లించి భర్త చెవిలో ఏదో ఊదింది

అంతే! అతని కళ్ళు తళుక్కుమన్నాయి!

భార్య కళ్ళల్లోకి ఆరాధనగా చూశాడు

దర్మయ్యా! అన్నాడు గంభీరంగా

ధర్మయ్య ముందుకొచ్చాడు

అతనిలో మునుపటి ధారుఢ్యం లేదు వార్ధక్యం అతన్ని కృంగ దీస్తోంది

ఈ ఆట బోర్‌గా ఉంది! ఎలాటి ఉపోద్ఘాతమూ లేకుండానే అన్నాడు రాజాబాబు

చెప్పండి బాబూ! ఇంకెలాంటి ఆట ఆడదాం? అతని కంఠంలో వ్యంగ్యమో, వినయమో అర్థం కాలేదు రాజాబాబుకి

ఇలా కాచ్ చెయ్యడం మీ అందరికీ అలవాటయి పోయింది! ఏదో ఆలోచిస్తూ అన్నాడతను

అవును! శానాళ్ళమట్టి ఆడతన్నాంగందా! వినయంగా అన్నాడు దర్మయ్య

అందుకే ఒకలా చేద్దాం!

చెప్పండి బాబూ!

ఇంకాస్త ఎత్తునుంచి వస్తువులు పడేస్తాను!

సరే! అన్నట్టు తల ఊపాడు దర్మయ్య

పట్టుకుంటే పది రూపాయలు!

ఊఁ!

లేకపోతే

అందరూ భయంగా చూశారతని కేసి

ఒక కొరడా దెబ్బ!

తృళ్ళిపడ్డారంతా

ఏం? భయంగా ఉందా?

అదికాదు బాబూ! ఏదో చెప్పబోయాడు దర్మయ్య

ఏం? డబ్బనగానే బావుంది గానీ కొరడా దెబ్బనగానే అంత హడలి చస్తారెందుకు? చిరాగ్గా అన్నాడు రాజాబాబు

ఎవరూ మాట్లాడ లేదు

వాళ్ళకి తెలుసు! ఆ ఇంట్లో ఓ కొరడా వుందనీ, దాంతో దెబ్బతినడం అంటే నరకాన్ని స్వయంగా చూడ్డమే అనీ అందుకే అంతా మౌనంగా నిల్చుండి పోయారు

ఏం? ఎవరూ ముందుకు రారా? గంభీరంగా అన్నాడు రాజాబాబు

బయంగా చూశారంతా

ఒకసారికి ఇరవై రూపాయలు! రేటు పెంచాడతను

కొంతమంది ధైర్యంగా ముందుకొచ్చారు

రాజాబాబు రెండో అంతస్తు మీది కెళ్ళాడు

ఓ యువకుడు ఆశగా, బయంగా ముందుకొచ్చాడు

ఎన్నడూ లేనిది అతనికి దడగా వుంది బహుశా కొరడా దెబ్బ గుర్తొచ్చి కావచ్చు

రాజాబాబు పైనించి ఓ లడ్డూ జారవిడిచాడు సూటిగానే

యువకుడు నోటితో పట్టుకున్నాడు

అందరూ ఆనందంగా చప్పట్లు కొట్టారు

రాజాబాబు, అతని భార్యా కూడా ప్రశంశాపూర్వకంగా చూశారతనికేసి

రాజాబాబు మళ్ళీ వేశాడు

అయితే ఈసారి కాస్త వంకరగా వేశాడు అంతే! అది జారి మట్టిలో పడింది

హడలిపోయాడా యువకుడు

వెలిగిపోయింది రాజాబాబు మొహం

నెక్స్ట్? అన్నాడు రెట్టించిన ఉత్సాహంతో

అతను పక్కకి తప్పుకున్నాడు

ఊఁ! రండి! అరిచి నట్టే అన్నాడు రాజాబాబు

బయంగా మరొక అతను వచ్చాడు

అతని చేతులు, కాళ్ళూ మరి ఒణికి పోతున్నాయి బయంతో

అయినా ఆట ప్రారంభించాడు

కానీ ఓడిపోయాడు!

ఓ కొరడా దెబ్బని గెల్చుకున్నాడు!

అలా అందరూ ప్రయత్నించారు

ప్రతిసారీ రాజాబాబుదే విజయం అయింది

మెల్లగా కిందికి దిగొచ్చాడతను

అందరి మొహాల్లోనూ భీతి కనిపిస్తోంది

అతనో సారి భార్యకేసి చూశాడు

ఆవిడ ఉత్సాహంగా కొరడా తెచ్చి భర్త చేతికిచ్చింది

అంతే!

అందరూ తలో కొరడా దెబ్బ అందుకున్నారు ఒక్క మొదటి యువకుడు మాత్రం దెబ్బతో పాటు ఇరవై రూపాయల నోటు కూడా అందుకున్నాడు

రాజాబాబు, ఆనందానికి అవదులు లేవు! అయితే ఆ ఆనందం ఎక్కువ రోజులు నిలవలేదు

కారణం

క్రమేపీ అతను ఆడే ఆటలో పాల్గొనే వాళ్ళు కరువై పోయారు చాలామంది నౌకర్లు మొహం చాటేస్తున్నారు ఇది పిచ్చెక్కినట్టుందతనికి

నయానా బయానా చెప్పి చూశాడు అయితే ససేమిరా అన్నారంతా అవసరం అయితే పనికూడా మానుకుపోతావన్నారు

దిక్కుతోచలేదు అతనికి

డబ్బు రేటు పెంచి, మరేదో ఆశ చూపించి మరి కొన్నాళ్ళు ఆడాడు

అయితే ఈ ఆట గురించి తెలిసిన చాలా మంది రాజాబాబంటే ఓ రాక్షసుడిలా చిత్రించుకో సాగారు

వాళ్ళల్లో ముఖ్యుడు రాంబాబు

రాంబాబు దర్మయ్య చివరి కొడుకు!

ఆత్మ గౌరవమే కాదు ఆత్మ విశ్వాసం కూడా ఉందతనికి

శరీర దారుఢ్యం గల పాతికేళ్ళ యువకుడు తను అడపా దడపా తండ్రి నోట రాజాబాబు ఆటల గురించి వింటూనే ఉన్నాడు అసలక్కడ కొలువే మానమని కూడా చెప్పాడు తండ్రికి అయితే తరతరాలుగా ఆ ఇంటినంటి పెట్టుకు బ్రతుకుతున్న విశ్వాసం దర్మయ్య నరనరాల్లోనూ జీర్ణించుకు పోవడం వల్ల కొడుకు మాటలు పట్టించుకోలేదు

అదిగాక కూటికి పేదైన దర్మయ్య అస్పమ పుత్రుడైన రాంబాబుకి , ఏనాటి కానాడు తెచ్చుకుని పొట్టపోసుకునే తమలాంటి బ్రతుకుల్లో ఇలాంటి ఆవేశాలు కూడు పెట్టవని సర్ది చెప్పాడు

అందుకే తన బాదని కడుపులో నే దాచుకున్నాడు రాంబాబు

అయితే ఏనాడూ రాజాబాబు గారింటి చాయలక్కూడా అతను వెళ్ళే వాడేకాదు!

అయితే ఓరోజు అక్కడికి వెళ్ళక తప్పలేదు

★ ★ ★

ఆ రోజుకి వారం రోజుల్నించి దర్మయ్యకి విషజ్వరం! పనిలోకి రావడం లేదు

దర్మయ్య లేనందున రాజాబాబు ఆట మరి కుంటు పడింది

కాలు కాలిన పిల్లిలా ఇటు అటు తిరిగాడు అతని చాయల కెవరూ రాలేదు

అతనికి తిండి తినబుద్ధి కాలేదు నిద్రరాలేదు అతని అలవాటుకి మొదటిసారిగా కాస్త విసుకున్నారు తల్లిదండ్రులు అయినా అతని దొరణి మారలేదు

అలాంటి సమయంలో వచ్చాడు రాంబాబు

ఎవరు? అన్నట్టు చూశాడు రాజాబాబు

మన దర్మయ్య కొడుకు! పేరు రాంబాబు! అతన్ని లోపలికి తీసుకొచ్చిన మరో నౌకరు చెప్పాడు

రాంబాబు వినయంగా నమస్కరించాడు

అతన్ని చూడగానే రాజాబాబు మొహంలోకి కొత్త కాంతి వచ్చింది

ఓరగా చూశాడు అతనికేసి

రాంబాబు బలంగా అందంగా, ఆకర్షణీయంగా వున్నాడు కళ్ళల్లో ఆత్మస్థైర్యం కనిపిస్తోంది

ఇతనితో ఆట ప్రారంభిస్తే? అనుకున్న రాజాబాబులో ఉత్సాహం కట్టలు తెంచుకుంది

రా! రా! – ఏమిటి? అన్నాడు ఆప్యాయంగా

'మానాన్నకి సుస్తీగా వుంది! మొహానికి పట్టిన చెమటని తుడుచుకుంటూ అన్నాడు రాంబాబు

అవునవును! విన్నాను! ఎలా వుంది?

'చాలా ప్రమాదంగా ఉంది! ఆస్పత్రిలో చేర్పించాం మందులు కావాలన్నారు కానీ రాంబాబు గొంతు ఒణికింది

రాజాబాబు కళ్ళు మరింత కాంతులీనాయి!

డబ్బు కావాలా? అనునయంగా అన్నాడు

అవును అన్నట్టు తల వూపాడు రాంబాబు

ఎంత!



**ఇటీవల ప్రఖ్యాత మిమిక్రీ కళాకారుడు 'ధ్వని బ్రహ్మ" శ్రీ చిట్టూరి గోపీచంద్ (గుంటూరు)ని డెహరాడూన్ఆంధ్ర సమితి తరపున శ్రీమతి వి. భ్రమరాంబ ఘనంగా సన్మానించారు**

'స్పోర్ట్స్"

రెండు వందలు! జీతంలో కట్టుకోండి బాబూ ! అతి వినయంగా అన్నాడు రాంబాబు

రెండు వందలు కాదు! నాలుగు వందలిస్తాను! ఈసారి రాంబాబు కళ్ళు తళుక్కుమన్నాయి

చేతులెత్తి నమస్కరిస్తూ అస్పష్టంగా ఏదో అన్నాడు

కానీ

చెప్పండిబాబూ? ఉద్వేగంగా అన్నాడు రాంబాబు

చెప్పాడు రాజాబాబు

అవాక్కయి పోయాడు రాంబాబు

ఇప్పుడా? అన్నాడు ఆశ్చర్యంగా

అవును ! ఈ ఎండలోనే సరదాగా ఉంటుంది! ఉత్సాహంగా అన్నాడు రాజాబాబు

వద్దు బాబుగారూ? మరో సారి తప్పకుండా ఆడతాను కానీ – ఇప్పుడు కాదు! ఇప్పుడు మానాన్నకి చాలా ప్రమాదంగా ఉంది! అంటూ బ్రతిమాలాడు అయినా యజమానిని కరిగించ లేక పోయాడు రాంబాబు

సరే! అన్నాడు

అతనికి చావుబ్రతుకుల్లో వున్న తండ్రి గుర్తొచ్చాడు తీసికెళ్ళాల్సిన మందులు గుర్తొచ్చాయి! దానికావల్సిన డబ్బు గుర్తొచ్చింది అందుకే – తన మనసునే కాసేపు అవతలికి నెట్టి ఆట ప్రారంభించాడు

రోహిణీ కార్తె!

మిట్టమధ్యాన్నం ఎండ!

అరికాళ్ళు ఇసుకలో బొబ్బలెక్కుతున్నాయి

అయినా అవేం అతన్ని బాదించడం లేదు

పది సార్లూ తానే గెల్చాడు!

అయితే రాజాబాబులో చిరాకు ఎక్కువైంది అతన్ని ఓడించాలన్న తపన ఎక్కువైంది

అలా రెండుమూడు గంటలు ఆడుతూనే వున్నారు

బాబూ! నేనింక వెళ్ళాలి, 'బ్రతిమాలాడు రాంబాబు అంగీకరించ లేదు రాజాబాబు

రాంబాబు కళ్ళు తిరుగుతున్నాయి ఆవేశం నిస్సహాయత్వం, కోపం దుఃఖం అన్నీ నేనంటే నేనంటూ ముందుకొచ్చాయి!

అయినా ఆడుతున్నాడు గెలుస్తున్నాడు

రాజాబాబు లోనూ ఆవేశం కట్టలు తెంచుకుంటోంది

ఎడాపెడా వేస్తున్నాడు

చివరికి అతని చేతిలోని వస్తువులు నేల పాలయ్యాయి!

రాజాబాబు గెల్చాడు!

తలెత్తి రాంబాబు ఓ సారి అతనికేసి చూశాడు

మూడో అంతస్తు మీద పగలబడి నవ్వుతూన్న రాజాబాబు!

రాంబాబు గిరుక్కున తిరిగి మెట్లకేసి నడిచాడు

గబగబా మేడ ఎక్కేశాడు

ఏం జరుగుతుందో ఊహించకముందే రాజాబాబు దబాల్న నేల కూలాడు

అంతే!

రాంబాబు కాళ్ళూ, చేతులూ అతన్ని ముట్టగించేశాయి! అతను వారించే లోపలే పిడుగుల్లాంటి దెబ్బలు పడి ముక్కులోంచి రక్తం చిమ్మింది

అలా రాజాబాబుని పిచ్చిగా బాత్తున్నాడు రాంబాబు

నౌకర్లంతా ఏం చెయ్యాలో అర్థంకానట్టు, మంత్రించిన ప్రతిమల్లా అలా నిల్చుండి పోయారు

అంతవరకు నిర్ఘాంతపోయి చూస్తున్న రాజాబాబు భార్య వాస్తవంలో కొచ్చి కెవ్వున అరిచింది

అంతా వాస్తవంలో కొచ్చారు

ఇలాంటి ఆటలు ఇంక నీ జీవితంలో ఆడకు! బతికుండగా మళ్ళీ ఇలాంటి ఆట జోలికి పోయావో నీ అంతు తేలుస్తాను! చివరిసారిగా రాజాబాబు జుట్టు పట్టి బలంగా గుంజి అతని ముఖం మీద కాండ్రించి ఉమ్మి బాణంలా దూసుకు పోయాడు రాంబాబు

స్పృహలో కొచ్చిన నౌకర్లు కదిలారు!

అందర్నీ తప్పించుకుని అతి లాఘవంగా వీదిలో కొచ్చాడు

అందరూ అతని వెంట పడ్డారు

అతను పరుగు మొదలు పెట్టాడు

పట్టుకోండి! పట్టుకోండి!

పరుగులు! అరుపులు! కేకలు!

అయినా అతని పరుగు వేగం తగ్గించలేదు రాంబాబు

అలా సందుల్లో, గొందుల్లో తోటల్లో, దొడ్లల్లో పడి పరుగుతీస్తూనే ఉన్నాడు 

ఆంధ్రపత్రిక పాఠకులక్కి చక్కటి అవకాశం!



# కళ్యాణవేదిక

ఉచిత సమాచారం



వధూవరుల సమాచారము వుచితంగా
ప్రతి బుధవారం ప్రకటిస్తాము.
సమాచారం పంపేవారు
ఈ దిగువ నిబంధనలు పాటించాలి.

★ వధువు / వరునికి సంబంధించిన వివరాలు సమగ్రంగా, అచ్చులో 150 అక్షరాలకు మించనట్లుగా తెలుగులోనే స్పష్టంగా వ్రాసి పంపాలి.

★ వధువు / వరుని తల్లిదండ్రులు, సంరక్షకులు తాము యిచ్చే సమాచారము వాస్తవమని, ఎవరినీ కించపర్చే విషయము అందులో లేదని హామీ ఇవ్వాలి.

★ సమాచారం పంపేవారి పేర్లు వగైరా రహస్యంగానే వుంచబడతాయి. ప్రతి ప్రకటనకు ఒక బాక్సు నెంబరు కేటాయించి, వచ్చిన జవాబులు **వుచితంగానే** వాటికి సంబంధించినవారికి నెలరోజులలోపు పంపడం జరుగుతుంది.

★ ఈ శీర్షికను కుల మత వర్గ భేదాలు లేకుండా అందరూ వుపయోగించుకోవచ్చును.

★ అందిన సమాచారము ప్రతి బుధవారం అవి అందిన వరుస క్రమంలో ప్రకటించబడుతుంది. వీటిని తిప్పి పంపే ప్రసక్తి లేదు. కావున స్వంత అడ్రసు గల కవర్లు, లేదా స్టాంపులు జతపర్చకూడదు.

★ ప్రకటనను ఏదైన అనర్హమైనదిగా తోచినపుడు దానిని వెయ్యకుండా ఆపుచేసే హక్కు పత్రికకు వుంటుంది.

★ ఇతర విధములైన వుత్తరప్రత్యుత్తరములకు అవకాశం లేదు. ఫోటోలు పంపకూడదు.

★ సమాచారము పంపేవారు ఈదిగువ కూపను పూర్తిచేసి, స్థానిక ఏజెంటుచే సంతకం చేయించి పంపాలి. కూపను జతపర్చనియెడల పరిశీలించబడవు.

★ కళ్యాణవేదిక శీర్షికద్వారా సంబంధం కుదిరి వివాహం జరిగిన వధూవరుల ఫోటోలు ఉచితంగా ఆంధ్రపత్రికలో ప్రకటించగలము. ఏ తేదీన ప్రకటన వడినది తెలియచేస్తూ ఫోటోలు జతపర్చి "కళ్యాణ వేదిక ఫోటో ప్రచురణార్థం" అని వ్రాసి పంపవలెను.

## కళ్యాణవేదిక ఉచిత సమాచార కూపను

పేరు... ... ... ... ... ... ... ... ...

చిరునామా ... ... ... ... ... ... ... ...

... ... ... ... ...పిన్‌కోడ్... ... ...

స్థానిక ఆంధ్రపత్రిక ఏజెంటుసంతకం..............

## శ్రీ ఎమ్వియల్ మృతి

ప్రముఖ రచయిత, కవి ముత్యాలముగ్గు తదితర చలన చిత్రాల నిర్మాత శ్రీ ఎమ్వియల్ (ముద్దాలి వెంకట లక్ష్మినారాయణ) జనవరి 23న కాలేయ సంబంధమైన అస్వస్థత కారణంగా నూజివీడులో మరణించారు ఈయన వయస్సు 40



సంవత్సరాలు నూజివీడులోని దర్మా అప్పారావు కళాశాలలో ఆయన తెలుగు శాఖాదిపతిగా పని చేసారు

శ్రీ ఎమ్వియల్ అభ్యుదయ రచయితల సంఘంలో పని చేసారు పిన్న వయసులోనే అభ్యుదయ సాహిత్యకారుడిగా విమర్శకుడిగా మంచి గుర్తింపు పొందారు ప్రఖ్యాత చిత్రకారుడు సినీ దర్శకుడు శ్రీ బాపు, సుప్రసిద్ధ రచయిత శ్రీ ముళ్ళపూడి వెంకటరమణలతో కలిసి సినిమారంగంలో పలు రచనలు చేసారు

శ్రీ ఎమ్వియల్‌కి భార్య, ఒక కుమారుడు, కుమార్తె ఉన్నారు

## నెఫ్జా నాటకోత్సవాలు

నెల్లూరు ఫిలిం జర్నలిస్టుల సంఘం నాటకోత్సవాలు మార్చి 5 నుండి 9 వరకు నెల్లూరు, టౌన్ హాలులో జరుగుతాయి ఈ సందర్భంగా జర్నలిస్టులను సినీ దర్శకులను సత్కరిస్తారు సినీ నటులు నటీమణులు ముఖ్య అతిథులుగా పాల్గొంటారు అని నెఫ్జా అధ్యక్షుడు శ్రీ సుందర రామిరెడ్డి తెలియ చేస్తున్నారు

# అవీ ఇవీ అన్నీ

## మహిళా లలిత కళాకారుల పరిచయ సమాచార గ్రంథం

క్రెసెంట్ ఇంటర్ నేషనల్ కౌన్సిలువారు భారత మహిళా లలిత కళాకారుల పరిచయ సమాచార గ్రంథమును ప్రచురింప నున్నారు

నాట్యం సంగీతం, గానం చిత్రలేఖనం, కార్టూన్ చిత్ర లేఖనం, సినిమా నాటక నటనం, శిల్పం మొదలైన లలిత కళలలో ప్రవేశం– అనుభవం ఉన్న మహిళలు ప్రతి ఒక్కరు తమ పూర్తిపేరు, చిరునామా, పుట్టిన తేది, స్థలము విద్యార్హతలు వివిద లలిత కళలలో తాము సాదించిన నైపుణ్యము మున్నగు వివరాలు తమ కార్డు సైజు ఫొటోతో పాటు కౌన్సిలువారి క్రింది చిరునామాకు పంపవలెను నాట్య కళాకారిణులు తమ ఫొటోతో, తామిచ్చిన నాట్య ప్రదర్శనల సందర్భాన తీసిన కార్డు సైజు ఫొటోలు కూడ పంపవలెను ఫొటోలు గ్లేజ్ ప్రింటు అయిఉండవలెను

ఫొటోలు వివరాలు క్రెసెంట్ ఇంటర్ నేషనల్ కౌన్సిలు, పి బి నెం 36 సికింద్రాబాద్– 500003 అను చిరునామాకు పంపగోరు తున్నారు

## సంతాన నిరోధానికి 'టుడే'

**డిన్‌కెమికల్స్ ఎండ్ ఫార్మసూటికల్స్ ఇండియా లిమిటెడ్‌వారు "టుడే" అనే సంతాననిరోధకపు మందుని ప్రవేశ పెడుతున్నారు.**

**టుడే వనితల అంతర్యోనిలో అమర్చితే వీర్యకణాలని నిరపాయకరంగా నాశనంచేస్తాయి వీటి వాడకం వలన హాని ఏమీ కలుగదని అమెరికాసంయుక్త రాష్ట్రాల ప్రభుత్వంవారు నిర్ణయించారు**

## డాక్టర్ కొర్రపాటి గంగాధరరావు మృతి

ప్రముఖ నాటక నవలా రచయిత డాక్టర్ కొర్రపాటి గంగాదరరావు (66) 1986 జనవరి 27వ తేది బాపట్లలో మరణించారు



డా కొర్రపాటి పంచకు పైగా నాటకాలు నాటికలు వ్యాసాలు రచించారు వాటిలో యదారాజా–తథాప్రజా, పెండింగు ఫైలు, విషకుంబాలు నిజ రూపాలు గుడ్డిలోకం నిర్మల మొదలైనవి చాల పేరు పొందాయి ఇద్దరు మిత్రులు మొదలైన సినిమాలకు ఆయన సంబాషణలు రాసారు ఆయన రాసిన లంబాడోళ్ల రాందాసు నవల సినిమా తియడం జరిగింది కొంత కాలంగా ఆయన నాటకాల కంటే నవలలే ఎక్కువ రాస్తున్నారు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమి అవార్డు గ్రహిత డా కొర్రపాటి గత 30 ఏండ్లుగా కళావని అనే సాంస్కృతిక సంస్థని నడుపుతున్నారు రచయితగానే గాక వైద్యుడిగా కూడా శ్రీ కొర్రపాటి పేరు ప్రఖ్యాతులు సంపాదించారు

ఆయనకు భార్య నలుగురు కుమారులు, ముగ్గురు కుమార్తెలు ఉన్నారు

## విజ్ఞప్తి

సంప్రదాయ అభ్యుదయ కవులను ప్రోత్సహించేందుకు శ్రీ కాటగడ్డ సాహిత్య అవార్డులు (1986) మూడు కావ్యాలకు ప్రదానం చేయు నిమిత్తం నలుబది పేజీలకు మించని లిఖితప్రతులు పరిశీలనార్థం ఆహ్వానింపబడు చున్నవి కవి పేరు చిరునామా, స్వంత రచనగా హామీ పత్రం జతచేసి రిజిస్టర్డు పోస్టులో శ్రీ కాటగడ్డ ఏలూరు– 534002 అన్న చిరునామాకు పంపవచ్చు

విజయవాడలోని డి సి యం డిగ్‌జామ్ జి యా జీ మిల్స్ ప్రెస్టేజియస్ షోరూమ్ సుమంగళిలో బంపర్ డ్రా కు విచ్చేసిన ప్రముఖులతో షోరూమ్ అదినేత శ్రీ బి రాజారావు గార్ని ఈ చిత్రంలో చూడవచ్చు



# హైదరాబాదు నోట్‌బుక్

## తెలుగు విశ్వవిద్యాలయం తొలి వైస్ ఛాన్సలర్ డాక్టర్ దోణప్ప :

మన రాష్ట్రంలోని ఇతర విశ్వవిద్యాలయాల వైస్ చాన్సలర్లకులేని విశిష్టత తెలుగు విశ్వ విద్యాలయం తొలివైస్ ఛాన్సలర్ డాక్టర్ తూమాటి దోణప్పకు ఉన్నది నా చిన్ననాటి చదువు సాల్లాపురంలో అమరం శబ్దాలు, మేఘసందేశం రఘు వంశంలతో ప్రారంభమయింది మా పినతాత బీమప్పగారు గొప్ప పౌరాణికులు సంస్కృతాంధ్రాలలో మహావిద్వాంసులు ఆయన పంచపంచ ఉషఃకాలంలో నే కాల్యకృత్యాలు తీర్చుకొని పొలానికి బయలుదేరేవారు తమవెంట నన్ను పిలుచుకొని వెళ్లేవారు తాము పనిచేస్తూ, నాకూ ఏవో పనులు పురమాయించేవారు అప్పుడు జరిగేది పాఠం ఇలా పనిపాట్లతోను ఇంటికీ పొలానికి రాకపోకలలోను నా చదువు సాగింది వైయాకరణలు చెబుతారే క్రోశం పరతి అని, దానికి నా చదువు ఉదాహరణం ఇలాగే ఆయన యోగ వాసిష్ఠం వివేకచూడామణి, బాగవతం మున్నగు ఆంధ్ర సంస్కృత గ్రందాలు చెప్పారు అవి నేను ఎన్నటికీ మరువను ఆయన పురాణ ప్రవచనంలో నేను వాచకుడిని నేను బారత బాగవతాలు, గోపీనాద రామాయణం చదివేవాడిని ఊరి రచ్చకట్టమీద కూర్చునిగాని మా యింటి అరుగుమీద కూర్చునిగాని ఆయన ప్రవచనం చేసేవారు ఒకొకప్పుడు నాతోకూడ ప్రవచనం చేయించేవారు ఇలా సంస్కృతాంధ్రాలలో గట్టి మూలబందం పడింది– అన్నారు డాక్టర్ దోణప్ప అందువల్ల డాక్టర్ దోణప్పకు 10 సంవత్సరాల వరకు ఏ బి సి డీలు కూడరావు వజ్రకరూరులో మేనమామ శ్రీ బొబ్బూరి చినతిమ్మప్పగారి యింట్లో వుంటూ ఏ బి సి డీలు దిద్దుకుని అక్కడి హైయర్ సెకండరీ స్కూలులో 6వ క్లాసులో చేరి ఎనిమిదవ క్లాసుముగించారు పిదప ఉరవకొండ హైస్కూలులో మూడవఫారంలో చేరారు అక్కడ తెలుగు పండితులు సుప్రసిద్ధ విద్వాంసులు చరిత్రకారులు నూతలపాటి పేర్రాజుగారు ఆయన విద్యార్ధులను బాగా ప్రోత్సాహించేవారు. ఆయన విద్యార్ధులతో కవిత్వాస్పర్ధలు కూడ జరిపించేవారు విద్యార్ధులను వెంట పిలుచుకొని వెళ్లి ప్రకృతి సౌందర్యాన్ని పుస్తకాలను మానవస్వబావాన్ని వర్ణించమనేవారు ఒకసారి ఆయన డాక్టర్ దోణప్పను ఏది సాయం సంద్యను వర్ణించు– అని ఒక సాయంత్రం కోరారు

సాంద్య ల లనా లలామంబు సంతసమున
కట్టుకొన్నట్టి హెంబట్టు పుట్టమనగ
సంజకెంజాయ తెల్లెడ

అని డాక్టర్ దోణప్ప ఆశువుగా చెప్పారు పారిజాతాపహరణం గురించి చెప్పమనగా,

పలుకు పలుకున తేనియ లొలుకునట్లు
అరణపుంగది ముక్కుతిమ్మన్నగారు
పారిజాతాపహరణమ్ము పాడినట్టి
కూరుచున్నారు ముత్యాల గొడుగునీడ

అని వర్ణించారట డాక్టర్ దోణప్ప. చిన్ననాటి నుంచి నాటకాలలోను, అభినయంలోను ఆయనకు అభిరుచివుంది. చిన్ననాడు మోహినీ రుక్మాందలో రుక్మాంగదుడు, కృష్ణతులాభారంలో కృష్ణుడు, సాయిలీలలలో సాయిబాబా పాత్ర నిర్వహించి మెప్పుపొందారు. సరే, చదువు నిరాఘాటంగా కొనసాగింది. బి.ఏ. ఆనర్స్; ఎం.ఏ.లలో సర్వ ప్రథములుగా ఉత్తీర్ణులయ్యారు ఆంధ్ర విశ్వవిద్యాలయం నుంచి. బి.ఏ. ఆనర్సులో సర్వ ప్రథములయినందుకు ఐదు బహుమతులు పొందారు. ఆ విశ్వవిద్యాలయంనుంచే పి.హెచ్‌డి, డిలిట్‌లు పొందారు. పి.హెచ్.డి. సిద్ధాంత వ్యాసానికి మూడు బంగారు పతకాలు వచ్చాయి.



రాష్ట్ర సాహిత్య అకాడమి బహుమతి మూడుసార్లు పొందారు ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు పొందారు 26 సంవత్సరాలపాటు ఆంధ్రనాగార్జున విశ్వవిద్యాలయాలలో తెలుగు ఆచార్యులుగానూ నాగార్జున విశ్వవిద్యాలయం రిజిస్ట్రారుగానూ తెలుగు విజ్ఞానపీఠం స్పెషల్ ఆఫీసరుగాను అంతర్జాతీయ తెలుగు సంస్థ డైరెక్టరుగాను ఉన్నారు ఆంధ్ర విశ్వవిద్యాలయం సిద్ధపరుస్తున్న తెలుగు ఎటిమలాజికల్ డిక్షనరికి డైరెక్టరుగానూ ప్రదాన సంపాదకులుగాను ఉన్నారు ఆంధ్ర, బెనారస్, బెంగళూరు శ్రీకృష్ణదేవరాయ శ్రీ వేంకటేశ్వర హైదరాబాద్ కాకతీయ కేరళ, మద్రాసు మదురై మైసూరు, నాగార్జున ఉస్మానియా విశ్వవిద్యాలయాలలో వివిద సంఘాలు సభ్యులుగా పరీక్షకులుగా ఉన్నారు ఆంధ్ర సంస్థానాల సాహిత్యసేవ బాషాచారిత్రక వ్యాసావళి తెలుగులో కొత్త వెలుగులు జానపద కళాసంపద, తెలుగు హరికథా సర్వస్వం వృత్తి పదకోశం తెలుగులో చేరిన ఇండో ఆర్యన్ పదాలు, దక్షిణ బారతంలో తోలుబొమ్మలాట మనకళాప్రపూర్ణుల కవితా రేఖలు ఆకాశవాణి బాషితాలు, తెలుగు వ్యాకరణ వ్యాసాలు మున్నగు పరిశోదనాత్మక గ్రంథాలు ఆంధ్రాగ్లాలలో రచించారు వివిద బాషాసాహిత్య సంఘాలలో సభ్యులు జాతీయ అంతర్జాతీయ సబలలో సదస్సులలో పెక్కు పరిశోదన వ్యాసాలు చదివి మెప్పుపొందారు పెక్కు ఏకాంకికలు, కథలు, పదచిత్రాలు, బావగీతాలు వచనగీతాలు రచించారు అవి వివిద పత్రికలలో ప్రచురితమయాయి బాషా సాహిత్య సాంఘిక విషయాలపై వందకుపైగా రేడియో ప్రసంగాలు చేశారు జానపద సాహిత్యం, తెలుగు వ్యాకరణం, మాండలికాలు, బాషాశాస్త్రం శాసన పరిశోదన ఆంధ్రేతరులకు ఆంధ్ర బాషాబోదన– అంటే చాల యిష్టం ఆంగ్ల హిందీ కన్నడ ప్రాకృత సంస్కృతాలు మాతృబాషలాగ మాట్లాడగలరు ఇంతటి యోగ్యతగల విద్వాంసునికి అర్హమైన పదవి లబించినందుకు సహృదయులు ఎవ్వరైనా సంతోషిస్తారు మణినా వలయం వలయేన మణిః మణినా వలయేన విబాతి కరః– మణితో కంకణమూ కంకణంతో మణి, ఈ రెండింటితో చేయి ఒప్పారుతున్నది– అని ప్రాచీన కవి అన్నట్టు వైస్‌చాన్సలర్ పదవితో డాక్టర్ దోణప్ప దోణప్పతో వైస్‌చాన్సలర్ పదవీ ఈ రెండింటితో తెలుగు విశ్వవిద్యాలయమూ శోబిస్తున్నవి డాక్టర్ దోణప్ప జన్మస్థలం ఉరవకొండ మండలంలోని రాకెట్ల గ్రామం తండ్రి శ్రీ తూమాటి సంజీవప్పగారు, తల్లి శ్రీమతి తిమ్మక్కగారు డాక్టర్ దోణప్ప జనవరి 8వ తేదీన తెలుగు విశ్వవిద్యాలయం వైస్‌చాన్సలరు పదవిని స్వీకరించారు వచ్చే జూన్‌నుంచి విశ్వవిద్యాలయం శిక్షణ ప్రారంబిస్తుందని, తెలుగుబాషా సాహిత్య సంస్కృతులలో ఉన్నతస్థాయి పరిశోధన కేంద్రంగా వుండగలదని ఆయన నాతో అన్నారు. ఈ విశ్వవిద్యాలయం ప్రదాన కార్యాలయం హైదరాబాద్‌లో వుంటుంది శ్రీశైలంలోను రాజమండ్రిలోను దీని పీఠాలుంటాయి హైదరాబాదులో బాషాబివృద్ధి పాఠశాల– నిఘంటు విబాగం లింగ్విస్టిక్స్ విబాగం, బాష ఆదునీకరణ విబాగం వుంటాయి లలితకళా పాఠశాల– సంగీత నృత్య రంగస్థల విబాగాలు జానపద కళావిబాగం, చిత్రశిల్ప విబాగం వాద్య విబాగం వుంటాయి ఇవికాక అంతర్జాతీయ తెలుగు కేంద్రం, అనువాద కేంద్రం పాఠ్యపుస్తక రచనా కేంద్రం, విజ్ఞాన సర్వస్వ కేంద్రం వుంటాయి శ్రీశైలంలో చరిత్ర పురాతత్త్వ సంస్కృతి పాఠశాల వుంటుంది దీనితో తెలుగువారి చరిత్ర సంస్కృతి విబాగం శాసన, పురాలేఖ విబాగం స్థానిక చరిత్ర విబాగం వుంటాయి సంస్కృత వేదాంత పాఠశాల విడిగా వుంటుంది సాంఘిక శాస్త్ర పాఠశాలలో సాంఘిక

## హైదరాబాద్ నోట్‌బుక్

విజ్ఞాన, పత్రికా రచన, కమ్యూనికేషన్స్, భౌతిక విజ్ఞాన, వైద్య, ఇంజనీరింగ్ విభాగాలు వుంటాయి కొన్ని కారణాలవల్ల పత్రికా రచన, కమ్యూనికేషన్ల విభాగం హైదరాబాద్‌లో వుంటే మేలని భావిస్తున్నాను రాజమండ్రిలో సాహిత్య పాఠశాల వుంటుంది దీనిలో ప్రాచీన నవీన సాహిత్య, భక్తి సాహిత్య, జానపద సాహిత్య, జాన పద విజ్ఞాన విభాగాలుంటాయి ఇక్కడ నెలకొనే తులనాత్మక అధ్యయన కేంద్రంలో సంగీత నృత్య నాటక శిల్ప చిత్రకళలలో స్నాతక, స్నాతకోత్తర శిక్షణ వుంటుంది తక్కిన విషయాలలో ఎం ఫిల్ పిహెచ్‌డి కార్యక్రమం వుంటుంది దీనిలో లీనమైన అకాడెమీల కార్యక్రమాన్ని ఈ విశ్వవిద్యాలయం కొనసాగిస్తుంది - అని వివరించారు డాక్టర్ దొణప్ప వచ్చే జూలై ఒకటవ తేదీన షష్టిపూర్తి చేసుకొంటున్న డాక్టర్ దొణప్ప భాషాసాహిత్యాది సేవలలో మరొక షష్టిపూర్తి చేసుకోవాలని, జ్యోతిశ్శాస్త్ర సంప్రదాయపు 120 సంవత్సరాలూ ఆయురారోగ్యాలతో విరాజిల్లాలని కోరుతున్నాను

### ఉపశ్రుతి :—

పుస్తకావిష్కరణ సభ సమాప్తమైంది నా సహ పత్రికా రచయిత ఒకమూల కుర్చీలో కూర్చుని ఆకాశం చూస్తున్నాడు ఏమిటి మిత్రమా, ఇంకా కూర్చున్నావు అందరూ వెళ్లిపోయినా ?- అనడిగాను ఏంలేదు సభాధ్యక్షుడు ముఖ్యాతిథిని ఎక్కువ పొగిడాడా, ముఖ్యాతిథి సభాధ్యక్షుణ్ని ఎక్కువ పొగిడాడా, వీళ్లు ఇద్దరూ కలిసి రచయితను ఎక్కువ పొగిడారా రచయిత వీరిద్దరినీ ఎక్కువ పొగిడాడా, వాళ్లు ముగ్గురూ సన్మాన కర్తను ఎక్కువ పొగిడారా, సన్మానకర్త వాళ్ల ముగ్గుర్నీ ఎక్కువ పొగిడాడా, వాళ్లు నలుగురూ కలిసి పరోక్షంలో వున్న తమతమ నాయకులను ఎక్కువ పొగిడారా అనే విషయం తేల్చుకోలేక చస్తున్నాను- అన్నాడు ఆయన

—తిరుమల రామచంద్ర

## ఉత్తరాలు....

[4 వ పేజీ తరువాయి]

### వ్యాసాలు

శ్రీదేవి (17–23) ముఖచిత్రంతో వెలువడిన పత్రికలో వ్యాసాలు బాగున్నాయి ముఖ్యంగా నేటి సమాజానికి దర్పణం , సమాజాన్ని పట్టి పీడిస్తున్న సమస్యల చిత్రీకరణ బాగున్నాయి

ఎ అనంతలక్ష్మి, వక్కలంక రామారావ్‌గార్లకు అభినందనలు

—సింగం దత్తాత్రేయమూర్తి,
రఘు రామారావ్ ఒంగోలు

### సీరియల్స్

సంక్రాంతి సంచికలో భారతీదేవిగారి ప్రేమసాగరం ఆణిముత్యం ఈ సీరియల్ చాల ఇంట్రెస్టుగ సాగుతుందనె నమ్మకం కల్గుతుంది

—శ్రీమతి పి తేజాకృష్ణ టిట్లాఘర్

* * *

సంక్రాంతి సంచిక (17–23, జనవరి '86) అందించింది క్రొత్త సీరియల్ ప్రేమసాగరం ఈ సీరియల్ ప్రారంభంలోనే బలేగా ఆకట్టుకుంది చదువు చున్నంతలో సినిమా రీళ్ళలా కళ్ళ ఎదుట కనిపించేలా అనిపించింది ఈ సీరియల్‌లో స్వప్నకు ఏమౌతుందో అని రానున్న సంచికకై వేచియున్నాము రచయిత్రి ఎన్ భారతీదేవిగార్కి మా అభినందనలు తెలియ జేస్తున్నాం

—పి గోపాలకృష్ణ పట్నాయక్ బల్లిగూడ

* * *

జనవరి 17–23 సంచికపై అందాల నటి శ్రీదేవి ముఖచిత్రం ఆకర్షణీయంగా ఉంధి ఎన్ భారతీదేవిగారి ప్రేమసాగరం సిరియల్ మొదట్లోనే ఆకట్టుకుంది

– పి రాము, గుంటూరు

* * *

అందాలతార శ్రీదేవి ముఖచిత్రం రమణీయముగా వుంది ప్రేమసాగరం సీరియల్ ఆదిలోనే అందరి హృదయాలను దోచుకుంది త్రివేణి- 3డి మనసుకు సంకెళ్ళు సీరియల్స్ అహ్లాదకరంగా వున్నాయి

– చోడవరపు నాగేశ్వరరావు రమాదేవి,
సికిందరాబాదు

* * *

సంక్రాంతి సంచికపై నటి శ్రీదేవి ముఖచిత్రం చాల ఆకర్షణీయముగా ఉంది భారతీదేవిగారి ప్రేమసాగరం సీరియల్ చదువుచున్నపుడు ప్రేమసాగరంలో మునిగిపోయాను మొదట్లోనే నన్నెంతో ఆకట్టుకుంది

– దూడల రమేష్ జనగామ

### కథలు

ముచ్చర్ల అరుణ ముఖచిత్రంతో వెలువడిన పత్రికలో కొడుకు కథ చాలా బాగున్నది

అర్వపల్లి అంజనేయులు,
అర్వపల్లి రాజ్యలక్ష్మి, ఖమ్మం

☐



Printed and Published for Nageswara Rao Estates Private Ltd , by S Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada 3, Editor S Radhakrishna
Phones Business 61247, 61248, Editorial 75667

# అందానికి హుందాతనం
# ఆప్కో మేటిగుణం

కలిమికి గుర్తుగా నిలిచిన ఇంటి గదిలో
కలికితనానికి అర్థంగా నిలిచిన ఈ లావణ్యవతిని
లతలా పెనవేసుకున్న ఆప్కో చీర తనకుతాను
ఒక వింత వైభవాన్ని సంతరించుకుంది.

